# ఉచిత కానుక!

# గ్లూకోన్-డి ® యొక్క తక్షణ శక్తితో పాటుగా



# ఆకర్షణీయమైన స్టెయిన్‌లెస్ స్టీల్ చెమ్చా ఒకటి.

తక్షణ శక్తినిచ్చే మీ దినసరి పానీయం. దాన్ని కలుపుకోడానికొక చక్కని సాధనం.

ఈ తళతళ మెరిసే స్టెయిన్‌లెస్ స్టీల్ చెమ్చా గ్లూకోన్-డి 400 గ్రా. ప్యాక్‌తో పూర్తిగా ఉచితం.

తాడాదనాన్నీ, చల్లగా శక్తినీ ఇచ్చే గ్లూకోన్-డి విటమిన్ డి, కాల్షియం, ఫాస్పరస్‌లతో బలపరచబడినది. దాన్ని అలాగే తీసుకోండి, లేదా పళ్లరసం, పాలు, తేనీరు, కాఫీ, లేదా మంచినీళ్లలో కలిపి తీసుకోండి.

అం[illegible] ఒక్కటి! దాన్ని గ్లూకోన్-డి ప్రత్యేక కానుక చెమ్చాతో మట్టుకు కలిపి తీసుకోండి!

GLL-9686







స్టాకు పరిమితం
నిర్ణీత స్థలాలలో మాత్రమే లభ్యం.

## తక్షణ శక్తి కోసం - గ్లూకోన్-డి ®

మంచి ఆరోగ్యానికి
మూలస్థానం
గ్లాక్సో

ఉషా కిరణ్ మూవీస్

# కాంచనగంగ



దర్శకత్వం:
వి.మధుసూదనరావు

నిర్వహణ: అట్లూరి రామారావు

నిర్మాత
రామోజీరావు

కాంచన హాస్టల్ మేట్ గంగకు ప్రభాకర్‌ని చూసినప్పుడల్లా ముద్దపప్పు, బుద్ధావతారం, బొద్దుగా ముద్దుగా వుండే పేపర్ వెయిట్ గుర్తొస్తాయి.

కాంచన, గంగ, జగదీశ్వరి, ప్రభాకర్ వీరందరూ పట్నంలో చదువుకుంటున్న విద్యార్థినీ విద్యార్థులు.

నిజానికి గంగ కూడా అందరిలాంటి ఆడపిల్లే మరి! కాకపోతే బరువు బాధ్యతలు, కర్తవ్యాలు ఇవేమీ తెలియని యుక్త వయసులో కొందరు హద్దులున్న కలలు కంటారు. మరికొందరు కలల గుర్రాలకు కళ్లాలు తెంపి పరుగులు తీయిస్తారు.

మనసు మంచిది. గుణం మంచిది. శీలం మంచిది. కానీ ఆస్థి, అంతస్తు, ఆభరణాలు, ఆడంబరాలు వీటన్నిటికీ బానిసైపోయే తత్వం గంగది. అందుకే కళ్ళెంలేని కలలకు కాణాచి గంగ.

ఒక్కమాటలో చెప్పాలంటే "యుటోపియన్ డ్రీమ్స్" ఆమె జన్మహక్కు.

రాబోయే జీవితంలో భాగస్వాములుగా ఇంజనీరునీ ఊహించుకుంటుండి. బెంజ్ కారునీ ఊహించుకుంటుంది. ఊహించుకున్నంతలో ప్రమాదంలేదు గానీ అలవి కాని ఊహలకు వాస్తవరూపాన్ని కలిగించుకోవాలని ప్రయత్నించడం వృధాప్రయాసే అవుతుందేమో! మీరూ ఒక్కసారి ఆలోచించండి! ఇలా గంగ ఒక రకం స్త్రీ మనస్సుకు ప్రతినిధి అయితే కాంచన మరో రకానికి ప్రతినిధి.

సున్నంలేని తమలపాకులా సున్నితమైన మనస్సు, వెన్నలాంటి హృదయం, సుందరమైన భావాలు, నిదానం, నిరాడంబరత్వం ఆమె ఆభరణాలు.... ఆస్తి.

వీటన్నిటివెనుక స్వయం ప్రతిభతోను, స్వయంకృషితోను, పైకి రావాలని, పట్టుదలతో అనుకున్నది సాధించాలని, దేనికీ 'దేహి' అనకూడదనే దీక్ష, వాటిలోంచి రవ్వంత 'అహం' మనకు దర్శనమిస్తూ వుంటాయి.





వీటన్నిటినీ తన అందంతోను, ఆకర్షణతోను, హుందాతనంతోను ముడి పెట్టుకుని పట్నంలో ప్లీడరీ చదువుకుంటోంది పినతండ్రి అనంతయ్య తప్ప 'నా' అన్నవారు ఎవరూ లేని కాంచన.

ఇకపోతే జగదీశ్వరి. ఓ పశువుల డాక్టరు కూతురుగా పుట్టి తనవంటూ ఏ నిర్ణయాలు, కోర్కెలు, ఆలోచనలూ లేకుండా తల్లిదండ్రులు కట్టబెట్టినవాణ్నే కట్టుకుని ఉన్నంతలో హాయిగా బతకాలనుకునే కన్నెపిల్ల పెద్దల నిశ్చయం ప్రకారమే పెళ్ళిచేసుకుని కట్నం కోసం కాల్చుకుతినే భర్త చేతిలో అడకత్తెర్లో వక్కలా ఇరుక్కుపోయిన అబల జగదీశ్వరి.

ఇలాంటి జగదీశ్వరులు ఈనాటి సమాజంలో ఎందరో మనకు అనునిత్యం దర్శనమిస్తూనే వుంటారు. పశువుల్ని అదుపులో పెట్టుకోవడం తెలిసిన పశువుల డాక్టర్ వీరభద్రరావు తన విన్యాసాలతో కూతుర్ని రాచిరంపాన పెట్టే అల్లుడు



'వేలు'ని ఎలా ఆడించి అదుపులో పెడతాడో కాంచన గంగలో చూడండి!

ఆడబిడ్డల పరిచయం అయిందికదా! ఇక 'మగబిడ్డ' ప్రభాకర్‌ని పరిచయం చేసుకుందాం.

ప్రభాకర్ కూడా ఓ సామాన్య కుటుంబంలోంచి వచ్చిన వ్యక్తే. అతని తండ్రి ప్రసాదరావు.

ప్రసాదరావుకు ఓ అక్కగారుంది. ఆవిడకు అంతులేని ఆస్థి వుంది. ఆ ఆస్థిని చక్కదిద్దుకునేందుకు తోడులేని ఆ అక్కగారు ప్రసాదరావుని ఆయన కొడుకుని తన దగ్గరే వుంచుకుంది.

ప్రభాకర్ ఒక ఆవులాంటి సాధుజీవి. మనసు మట్టి ముద్దలాంటిది ఎటుపడితే అటు మలచుకోవచ్చు. దీన్నే మనం చంచల స్వభావంగా ఊహించుకోవచ్చు.

ప్రభాకర్‌లోని సాధు స్వభావం కొందరిని ఆకట్టుకుంటుంది.

మరికొందరికి ఆటపట్టుగా వుంటుంది. ముఖ్యంగా అతనితో చదివే కాలేజి



ఆడపిల్లలకు అతనో పనికిరాని ప్రవరాఖ్యుడిలా కనిపిస్తాడు...

కాంచనకు తప్ప.

ఓవిధంగా చెప్పాలంటే ఎదుటి వ్యక్తి మనస్తత్వాన్ని అర్థంచేసుకునే నేర్పు, తెలివి కాంచనకు శూన్యమనే చెప్పొచ్చు.

అందుకే కాంచన, ప్రభాకర్ మనసిచ్చిపుచ్చుకున్నారు. అనంతయ్య, ప్రసాదరావు, ఆయన అక్కగారు వీరి ప్రేమకు ఆమోదముద్ర వేశారు...కానీ -

అక్కడే..అప్పుడే.. 'డామిట్ కథ అడ్డం తిరిగింది'.

గంగ రంగ ప్రవేశం చేసింది!!

తండ్రి తన ఇష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా వివాహం నిశ్చయించినపుడు కుడితిలో పడ్డ ఈగలా కొట్టుకుంటూ పరిస్థితులు చెయిజారకమునుపే కాంచన పంచన చేరింది. కాంచనతో కలసి ప్రభాకర్ ఇంటికి వెళ్ళినప్పుడు ప్రభాకర్ ఆస్తిని, అంతస్తుని కళ్ళారా చూసి కరిగి పోతున్న తన కలలకు కొత్త ఊపిరు లూదుకుంది గంగ.

అవన్నీ చూశాకనే అంతవరకు అస మర్థుడిలా అనిపించిన ప్రభాకర్‌లో సైతం ప్రజ్వలించే మగతనం ప్రస్ఫుటిస్తుం దామె కళ్ళకు.

కట్టలు తెంచుకునే కలల కామనలు తప్ప కామవాంఛలేని గంగ కలిమికి దాసోహం అంటుంది. ప్రభాకర్ కోసం వలపుల వల పన్నుతుంది.

ఇక్కడే మొదలైంది అసలు కథ.

గంగ పొంగించే వలపు గంగానది ధాటికి తట్టుకోలేని కాంచన జీవితం మళ్ళీ ఓ ప్రశ్నార్థకంగా మారుతుంది.

మనిషిలోని మంచితనాన్ని అంచనా వేయలేని అసమర్థురాలు కాంచనకు అడుగడుగునా ఎదురౌతున్న జయసింహ ఓ పీడకలలా, తన జీవితానికి పట్టిన చీడపురుగులా కనిపిస్తాడు...అనిపిస్తాడు.

అలాగే కలల ప్రపంచాన్ని తప్ప వాస్తవ ప్రపంచాన్ని ఊహించలేని గంగకు మోహన్ తారసపడతాడు. ఆస్తి అంతస్థు హోదాల ముసుగులో పెద్ద

మనిషిలా చెలామణి అవుతున్న గోముఖ వ్యాఘ్రం మోహన్.

మోహన్ నయవంచకుడు కాకపోతే గంగ భర్త ప్రభాకర్‌కు తన దగ్గరే ఉద్యోగం ఇచ్చి సకల భోగాలూ చవి చూపించాల్సిన అవసరమేమిటి ఆలోచించండి!!

తన మంచితనంతో కాంచనను కడదాకా కంటిరెప్పలా కాచుకుంటూ, ఆపదల్లో ఆదుకుంటూ, చీదరించుకున్న వారితోనే ఆదరించేలా చేయించుకున్న మహోన్నతాశయమూర్తి 'రౌడీ' జయసింహ.

నల్లనివన్నీ నీళ్లు కావని, తెల్లనివన్నీ పాలు కావనీ గ్రహించగల శక్తి కాంచనకి ఎప్పటికైనా వచ్చేనా? ఏమో! కాంచన గంగ చూసి మీరే తెలుసుకోండి!

ఇలాంటి విభిన్న మనస్తత్వాల ప్రతిరూపం ఉషాకిరణ్ మూవీస్ 'కాంచన గంగ'.

ఆడమనసుకు పట్టిన నిలువుటద్దం 'కాంచన గంగ'.

సుప్రసిద్ధ నవలా రచయిత్రి శ్రీమతి యద్దనపూడి సులోచనారాణి కథ. విక్టరీ మధుసూదనరావు రూపొందించిన సెల్యులైడ్ సుధ-కాంచన గంగ.

మాటల మూటలు : డి.వి. నరసరాజు

పాటల తేటలు : వేటూరి సుందరరామమూర్తి

సంగీతస్రష్ట : చక్రవర్తి

గాయనీ గాయకులు : యస్. జానకి, శైలజ, బాలసుబ్రహ్మణ్యం

ఛాయ : యస్. గోపాలరెడ్డి

కళ : భాస్కరరాజు

కూర్పు : డి. వెంకటరత్నం

నృత్యాలు : శివసుబ్రహ్మణ్యం

వెండితెర వెలుగులు :

శరత్‌బాబు, చంద్రమోహన్, సరిత, స్వప్న, ప్రతాప్‌పోతన్, రమణమూర్తి, వీరభద్రరావు, వేలు, శంకర్, అన్నపూర్ణ, కృష్ణవేణి.

నిర్మాణ నిర్వహణ : అట్లూరి రామారావు

నిర్మాత : రామోజీరావు.


వి.మధుసూదనరావు


యస్.గోపాలరెడ్డి


చక్రవర్తి


యస్.జానకి


యస్.పి.బాలసుబ్రహ్మణ్యం


యస్.పి.శైలజ

ఉషా కిరణ్ మూవీస్

# కాంచనగంగ



దర్శకత్వం:
వి.మధుసూదనరావు

నిర్వహణ: అట్లూరి రామారావు

నిర్మాత
రామోజీరావు

# చతుర

సంపుటి : 7 నవంబరు 1984 సంచిక : 10

## ఈ నెల సమగ్ర నవల

"ప్రపంచం మొత్తం మీద పాశ్చాత్యదేశాలలో స్త్రీలు ఎక్కువగా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు అనుభవిస్తున్నారు. వారికివున్న కట్టుబాట్లు చాలా కొద్ది. అక్కడ మొగుణ్ని వరకట్నమిచ్చి కొనుక్కోనవసరంలేదు. ఆడబిడ్డకు లాంఛనాలిచ్చి తృప్తిపరచనవసరంలేదు. ఆ పాశ్చాత్యుల ప్రభావం మన దేశస్థుల మీద ఎంతో వుంది. వారి వేషభాషలు నేర్చుకున్నాం. వాళ్లు చలినుంచి తట్టుకునేందుకు టీ, సిగరెట్, విస్కీ లాంటివి తాగితే, మనవాళ్లు అవి లేనిదే బతకలేనంతగా అలవాటు చేసుకున్నారు. వారి దుర్వ్యసనాలన్నీ నేర్చుకున్నామే తప్ప వారి మంచి లక్షణాలేవీ నేర్చుకోలేదు. స్త్రీని హీనంగా చూడటం, వరకట్నం లాంటివి తీసుకోవడం ద్వారా భారతీయ సంస్కృతిని నిలబెడుతున్నాం....ఒక దేశ ఔన్నత్యం ఆ దేశపు స్త్రీలు అనుభవించే స్వేచ్ఛా స్వాతంత్ర్యాల మీదే ఆధారపడి వుంటుందనే దాన్నిబట్టి మన దేశంలోని స్త్రీల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు చూస్తే, మన దేశం ఎంతటి అధ్వాన్న స్థితిలో వుందో అర్థమవుతుంది.''

అలాంటి ఈ పవిత్ర భారతదేశంలో స్త్రీపై ఓ కామాంధుడు అత్యాచారం జరిపితే....ఆ...

# రేప్

వల్ల ఆమె జీవితం ఎలాంటి మలుపులు తిరిగి, ఎంత దయనీయంగా మారుతోంది?

ఆ దౌర్జన్యంలో నిమిత్తమాత్రురాలైన ఆ స్త్రీని విచక్షణా రహితంగా మానసిక చిత్రహింసకు గురిచేసే ఈ సమాజపు లోటుపాట్లు ఎలాంటివి?

## జె.వి.బాబు

తనది కాని దోషానికి స్త్రీ అకారణంగా అనుభవించే శిక్షను, ఆలోచనలు రేకెత్తించే విధంగా చిత్రించిన 'రేప్' ఈ నెల చతుర సమగ్ర నవల!

ముఖచిత్రం : జగ్ మోహన్

# వివాహ సంబంధములు

వివాహ సంబంధముల గురించి మీ కాలాన్ని, ధనాన్ని వృధాచేయ నవసరం లేదు. అన్ని కులములవారికి, అన్ని వయసులవారికి మా వద్ద తగిన సంబంధములు వున్నవి.

బ్రాహ్మణులు, వైశ్యులు, క్షత్రియులు, కమ్మ, రెడ్డి, కాపు మొదలగు అన్ని కులములవారికి మా వద్ద ఏజెంట్సు పనిచేయుచున్నారు.

వివాహము కాని వయస్సుమళ్లిన స్త్రీ, పురుషులు మరియు వయస్సులో విడాకులు తీసుకున్న మరియు భార్య, భర్తృవిహీనులు మరల వివాహము చేసుకొనుటకు మాతో సంప్రదించండి. ఉత్తరప్రత్యుత్తరములు రహస్యముగా వుంచబడును.

మా వద్ద రిజిష్టరు అయిన వాటికి సంబంధములు త్వరలో కుదర్చగలమని తెల్పుటకు సంతసించుచున్నాము. మీ పూర్తి వివరాలతో పాటు స్వయంగాకాని, స్వంత అడ్రసు కల స్టాంపు కవరుతోగాని సంప్రదించండి.

## భారతీయ వివాహ కేంద్రం

26-4-5, జ్ఞానోలివ్ వీధి, గాంధీనగర్, విజయవాడ-3.

* కనీసం 10 చదివిన మధ్య వయస్సుగల స్త్రీ, పురుషులు ఆఫీసు అసిస్టెంట్సుగా కావలెను.

---

వ్యవసాయదారుల
సచిత్ర మాస పత్రిక

# అన్నదాత

సాలు చందా రు: 24/- మాత్రమే

అన్నదాత, ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ, హైదరాబాద్-500004.

**చతుర**

# వణికే గోపురం

అహ్మదాబాద్‌లో ఓ వింతగోపురం వుంది. దానికి 1450లో సిద్ధిబషీరాల్ శంకుస్థాపన చేయగా, మరికొంతకాలం తర్వాత మాలిక్ సారంగ్‌లాల్ ఆ గోపురాన్ని నిర్మించాడు.

ఆ గోపురం ఎర్ర ఇటుక, పొడి సున్నాలతో సాంప్రదాయకరీతిలోనే నిర్మింపబడింది. ఆ గోపురాన్ని చేతులతో గట్టిగా పట్టుకుని కొంచెం వూపితే చాలు, కాసేపటి తర్వాత అది కంపించడం మొదలుపెడుతుంది. అటుపై దాని కంపనం మిగిలిన గోపురాలకే కాకుండా దానికి ఆనుకునివున్న గోడలకు కూడా పాకుతుంది. అక్కడికి 40 అడుగుల దగ్గరలో ఉన్న ఓ శిథిలమైన మసీదు కూడా కంపిస్తుంది.



ఈ కంపించే గోపురాన్ని చూడ్డానికి యాత్రికులు అధిక సంఖ్యలో వస్తున్నారు. అలా వచ్చినవాళ్ళంతా గోపురాన్ని వూపి తమాషా చూసిగానీ వెళ్ళడం లేదు. యాత్రికులు ఇదే కొనసాగిస్తే, ఒకనాటికి ఆ గోపురాలన్నీ నేలమట్టమైపోతాయని వాస్తు శాస్త్ర నిపుణులు భావిస్తున్నారు.

ఔరంగజేబ్ తాజ్‌మహల్‌కి ప్రతిరూపమనదగ్గ 'బీబీకా మక్బారా' అనే కట్టడాన్ని ఔరంగాబాదులో నిర్మించాడు. దౌలతాబాద్‌లో 'సంత్ మినార్' అనే మరో కట్టడాన్ని కూడా నిర్మించాడు. వాస్తుశాస్త్ర నిపుణులు "వాతావరణ కాలుష్యం వల్ల ఈ రెండు కట్టడాలు శిథిల స్థితికి చేరకముందే, ప్రభుత్వం వారు సత్వర చర్యలు తీసుకుని, ఈ చారిత్రాత్మక కట్టడాలను సంరక్షించాలి" అని చెబుతున్నారు.

ప్రపంచం

## దారాసింగ్ ప్రత్యేకత

కొన్నేళ్ల క్రితం మల్లయుద్ధ క్రీడకి భారతదేశంలో మంచి జనాదరణ వుండేది. మల్లయుద్ధయోధుల్లో కింగ్‌కాంగ్, దారాసింగ్‌ల పేర్లు ప్రముఖంగా విన్పించేవి. ఇప్పటికీ చాలామంది మల్లులు వీరిద్దరి పేర్లను భయభక్తులతో స్మరించుకుంటారు.

కింగ్‌కాంగ్ ఆకారం చిన్న పర్వతం లానే వుంటుంది. దారాసింగ్ విశాలమైన భుజాలతో బలిష్టంగా వుంటాడు. మల్లయుద్ధ క్రీడాభిమానుల్లో ఈ ఇద్దరికీ అమోఘమైన స్థానం వుంది.

కింగ్‌కాంగ్ ప్రస్తుతం జీవించిలేడు.

దారాసింగ్ కుటుంబాన్ని మన దేశంలోని మొదటి మల్లుల కుటుంబంగా పేర్కొనవచ్చు. దారాసింగ్ స్వస్థలం అమృతసర్ దగ్గిరలోని 'దాముకక్'. నేటికీ చాలామంది మల్లయుద్ధం నేర్చుకునేవాళ్లు ఆ గ్రామానికి యాత్రకు వెళ్లి, అక్కడి మట్టిని భక్తితో వెంట తెచ్చుకుంటారు. దారాసింగ్‌లాంటి గొప్ప మల్లయుద్ధయోధుడు పుట్టిన ఆ గ్రామపు మట్టికి ఏదో మహిమ వుండివుంటుందని భావిస్తారు వాళ్లు.

ప్రతిష్ఠాకరమైన బహుమతులనెన్నిటినో వరుసగా సంపాదించుకోవడంతో



దారాసింగ్ పేరుప్రఖ్యాతులు అత్యున్నత శిఖరాలనందుకున్నాయి. అతని సోదరుడైన రణధావా కూడా మల్లయుద్ధంలో ఛాంపియనే!

దారాసింగ్ తాను పాల్గొన్న ఒక్క పోటీలో కూడా ఓడిపోలేదు. ఆ విజయ రహస్యమేమంటే, "ఒకసారి కుస్తీపోటీ జరిగే మైదానంలో దిగాక నేను సహనం కోల్పోను. మనసు ప్రశాంతంగా వుంచుకుంటాను. అదే నా విజయానికి కారణం" అని చెబుతున్నాడు దారాసింగ్.

"చాలామంది మల్లులు ఎరీనాలోకి దిగగానే అరచి పెడబొబ్బలు పెట్టి ఆందోళనకు లోనవుతారు. అలాకాకుండా నేను శాంతంగా, ఆత్మ విశ్వాసాన్ని కోల్పోకుండా వుంటాను కాబట్టే గెలుస్తాను" అంటాడు దారాసింగ్ నవ్వుతూ.

1967 నుంచీ భారతీయులకి మల్లయుద్ధంలో ఆసక్తి సన్నగిల్లసాగింది. అప్పటికి దారాసింగ్‌కి 38 ఏళ్లు. మన దేశస్థులకి క్రికెట్, టెన్నిస్, ఫుట్‌బాల్‌లపై అభిరుచి పెరిగి, మల్లయుద్ధం చూసేవాళ్లు తక్కువైపోయారు.

అప్పటివరకూ మల్లయుద్ధం ఒక్కటే వృత్తిగా బతికిన దారాసింగ్ దాని స్థానంలో సినిమా రంగాన్ని వృత్తిగా చేసుకున్నాడు. అతనా విధంగా సినిమా రంగంలోకి మారడానికి కారణముంది. ప్రముఖ పహిల్వాన్ 'గామా' చనిపోయేటప్పటికి అతి బీదస్థితిలో వున్నట్లు దారాసింగ్ ఎక్కడో చదివాడు. దాంతో అతను మల్లయుద్ధ వృత్తిలో ఎవరూ జీవితాంతం బతకలేరని గ్రహించాడు.

ఆవిధంగా దారాసింగ్ మల్లయుద్ధంలో తను సంపాదించిందంతా సినిమా రంగంలో పెట్టుబడిగా పెట్టాడు. ప్రథమంగా 'శాంసన్' అనే చిత్రాన్ని నిర్మించాడు. ఆ చిత్రం అన్ని ప్రాంతాలలోని థియేటర్లలో 'హౌస్‌ఫుల్'గా నడిచి బాగా ధనం గడించింది. దాని తర్వాత 'హెర్క్యులస్' వచ్చింది. ప్రధాన పాత్రధారిగా దారాసింగ్, ఇతర ముఖ్య పాత్రలలో షీలా, సికిందర్ నటించిన ఆ చిత్రం కుస్తీ, చారిత్రాత్మక యుద్ధాలపై తీయబడింది. దారాసింగ్ నిర్మించిన చిత్రాలపై వచ్చిన ఆదాయం మల్లయుద్ధంలో సంపాదించినదానికంటే ఎన్నోరెట్లు ఎక్కువగా వుండేది.

కాని, పెద్ద దర్శకులెవరూ తమ చిత్రాలలో దారాసింగ్‌కి నటుడిగా అవకాశమివ్వలేదు. అయితే ఇటీవల ప్రఖ్యాత దర్శకుడైన మన్‌మోహన్‌దేశాయ్ తన నూతన చిత్రం 'మర్ద్'లో అమితాబ్ బచ్చన్ తండ్రి పాత్రకు దారాసింగ్‌ను ఎన్నుకొని సంచలనాన్ని సృష్టించాడు.

దారాసింగ్ భార్య సుర్జీత్, కొడుకు అమ్రిక్‌లకి అతను చిత్రాలలో నటించడం ఇష్టంలేదు. అయినా దారాసింగ్ చిత్రాలలోనూ, 'న్యూట్రాముల్' లాంటి వుత్పత్తుల వ్యాపార చిత్రాలలోనూ నటించి మంచి ఆదాయం పొందుతున్నాడు. దారాసింగ్ నటించిన, దర్శకత్వం వహించిన సినిమాలు 10 వరకూ వున్నాయి.

సాధారణంగా కుస్తీపోటీల నుంచి విరమించుకున్నాక మల్లులు కనుమరుగు అయిపోతారు. కాని, దారాసింగ్ ఇంకా ప్రముఖుడిగానే ప్రజల కళ్లెదుటవుంటూ తన ప్రత్యేకత నిరూపించుకున్నాడు.

ఇప్పుడు దారాసింగ్ 55 ఏళ్లవాడైనా నటుడిగా, నిర్మాతగా తనకుగల ఉన్నత స్థానాన్ని కాపాడుకుంటూనే వున్నాడు. ఏ వ్యక్తిలోనైనా బుద్ధిబలం, కండబలం





# నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి.



# మీ కుటుంబంలోని వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని ఇవ్వండి!

క్రమం తప్పకుండా కోల్గేట్ ని వాడటంలో మీ కుటుంబంలోని
వారి నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా ఉంటుంది, వారి పళ్ళు యిక దృఢంగా,
ఆరోగ్యంగా ఉంటాయి. కోల్గేట్ రక్షణ చక్రం చేసేది అదే,
వారికది యివ్వడం అంటే.

మీరు పళ్ళు తోముకున్న ప్రతిసారి, కోల్గేట్ యొక్క నమ్మకమైన ఫార్ములా చేసేదిది-చూడండెలాగో.



మీ పళ్ళలో యిరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన, దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్ లోని అద్వితీయమైన శక్తిగల నురగ లోపలికి చొచ్చుకుపోయి, అక్కడ గల దుర్వాసన కలిగించే ఆహారపు తునకల్ని, దంతక్షయాన్ని కలిగించే సూక్ష్మజీవుల్ని తొలగిస్తుంది.



క్రమం తప్పకుండా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటే, దాంతో యిక మీకు శుభ్రమైన, తాజా శ్వాస, దాంతోపాటె దృఢమైన, ఆరోగ్యమైన పళ్ళూను.

భోజనం చేసిన తర్వాత ప్రతిసారి మీ కుటుంబంలో వారంతా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటున్నారని ధృవపరుచుకోండి. నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి. వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని యివ్వండి.




GK&E.B84.55 Tel

*దీని తాజా పిప్పరమెంట్ రుచి మీకెంతో నచ్చుతుంది!*

సమపాళ్లలో వుండటమనేది చాలా అరుదు. అలాంటి అరుదైన వ్యక్తి దారాసింగ్.

## సూర్యరశ్మి ఎలర్జీ

భూమిపై నివసించే ప్రాణుల పెరుగుదల, మనుగడలకి సూర్యరశ్మి ఎంతో కొంత అవసరం! అయితే ఈ విచిత్ర ప్రపంచంలో ఎండపొడ గిట్టని వింత మానవులూ కొందరున్నారు. వారి శరీరాలకి సూర్యరశ్మి సోకితే చాలు – కొన్ని విపరీత లక్షణాలు కలుగుతాయి.

ట్రక్కు డ్రైవరైన 55 ఏళ్ల డోంగ్లస్ చాప్లిన్‌కి ఆరేళ్ల క్రితం ఈవిధమైన ఎలర్జీ ప్రారంభమైంది. అప్పటి నుంచి అతను సూర్యరశ్మికి భయపడి ఏడాదిలో 365 రోజులూ ఇంట్లోంచి కదలకుండా కాలం గడుపుతున్నాడు. అతనికి శరీరంపై ఒక్క సూర్యకిరణం పడినా–వళ్లు ఎర్రబడిపోయి, చర్మం కాలిపోతున్నట్టుగా తీవ్రమైన బాధ కలుగుతుందట.

అప్పట్లో డోంగ్లస్ ఈ ఎలర్జీ నుంచి ఉపశమనం పొందడం కోసం క్రీములు, ఇంజెక్షన్లు వాడినా ఫలితంలేకపోయింది. ట్రీట్‌మెంటుకై 18 మాసాలపాటు ఆసుపత్రిలో గడిపాడు. కాని, బయటికి వచ్చాక మామూలే! దాన్ని బట్టి డాక్టర్లు సూర్యరశ్మి అతని శరీరానికి ఎలర్జీ కలుగజేస్తున్నట్టు నిర్ణయించి, ఆ రోగాన్ని 'ఫొటో సెన్సిటివ్ ఎగ్జిమా'గా నిర్ధారించారు.

రోగ నిర్ధారణ జరిగాక డోంగ్లస్ ఇంట్లోనే వుండి ఇంటి పనులు నిర్వర్తిస్తుంటే, అతని భార్య ఉద్యోగం, బైట పనులు చేయసాగింది. గత ఆరేళ్లలో డోంగ్లస్ ఒకే ఒకసారి తనకొడుకు పెళ్లికి మాత్రమే ఇంట్లోంచి బైటకు అడుగు పెట్టాడు. నిండా ముసుగేసుకుని, నల్లటి అద్దాలు బిగించిన కారులో కొడుకు పెళ్లి జరిగిన చర్చికి వెళ్లాడు. డోంగ్లస్ తాను గడుపుతున్న దీనమైన, ఏకాంత వాసంపై



రెండు పుస్తకాలు కూడా రచించాడు.

డోంగ్లస్‌లానే సూర్యరశ్మి ఎలర్జీతో బాధపడే మరో వ్యక్తి, బ్రిటన్‌కి చెందిన మోనికా షెంటన్ అనే మహిళ. ఆమె 14 ఏళ్లపుడు ఆ ఎలర్జీకి గురైంది. ఇప్పుడు 47 ఏళ్ల వయసు గల ఆమెకు 24 ఏళ్ల కొడుకు వున్నాడు. ఆమె నివసించే ఇంటి లోపలికి ఎండ చొరకుండా, కిటికీలు అన్నీ వెనీషియన్ బ్లైండ్స్‌తో కప్పబడివుంటాయి. చలి కూడా మోనికా వంటికి పడదు. దాంతో ఆమె 'తపస్విని'లా ఇంటి నాలుగు గోడల మధ్యనే కాలం గడుపుతుంది.

జర్మనీకి చెందిన బ్రియాన్ ట్రాస్క్ మరో దురదృష్టవంతుడు. అతనికి 1978లో సూర్యరశ్మి ఎలర్జీ వచ్చింది. మొదట ఓ కాలిన గాయపు మచ్చలాంటిది అతని నుదుటిపైన కన్పించింది. తర్వాత అతని శరీరంపై నెప్పి, వ్రణాలు పెరగసాగాయి. ఈ సూర్యరశ్మి ఎలర్జీ వల్లే బ్రియాన్ తనకు ప్రీతికరమైన గోల్ఫ్ ఆటను విడనాడవల్సి వచ్చింది. బ్రియాన్ ఓ రైలు డ్రైవరు. ఈ ఎలర్జీ వల్ల అతను ఎప్పుడూ రాత్రిపూటే డ్యూటీ చేయడానికి రైల్వే అధికారులు సమ్మతించారు.

ఫొటో సెన్సిటివ్ ఎగ్జిమా అనబడే ఈ సూర్యరశ్మి ఎలర్జీకి తగిన గుణకరమైన నివారిణిని కనుగొనేందుకు ప్రపంచవ్యాప్తంగా డాక్టర్లు కృషిచేస్తున్నారు!

## ఉదారత అంటే?

శాంతా షీలా నాయర్ తమిళనాడులోని తిరుచ్చి జిల్లాకి కలెక్టర్. ఆమె ఏ వూళ్ళో పర్యటించినా-అది గ్రామం కానీ, పట్టణం కానీ అక్కడివారికి ఆమె రాక ఓ పండుగలా వుంటుంది.

ప్రతి సోమవారం ఆమె స్వయంగా ప్రజల్ని కలుసుకుని, వారి కష్టసుఖాల్ని విచారిస్తుంది. ఆరోజు 500 నుంచి 1000 మంది వరకూ ఆమెను కలుసుకుని తమ గోడు వెళ్ళబోసుకుంటారు. అవి వినడానికి ఉదయం పది గంటలకల్లా ప్రజల్ని



కల్సుకునే హాలులోకి వస్తుందామె. ఆమెతో తమ కష్టాలు చెప్పుకునేందుకు వచ్చినవారిలో చివరి వ్యక్తి వెళ్ళేటప్పటికి ఒక్కొక్కప్పుడు రాత్రి పది కూడా దాటుతుంది.

ఏ కలెక్టరూ ఏనాడూ సందర్శించని ప్రాంతాలకు కూడా వెళుతుంది శాంత. కొండలపై ఉండే గ్రామాల్లోని ప్రజలను కలుసుకోవడమంటే మరీ మక్కువ. ఆమె ఐయ్యేయస్‌కి శిక్షణ పొందుతున్న సమయంలో హిమాలయ పర్వతప్రాంతంలోని 12 వేల అడుగుల ఎత్తయిన ప్రదేశంలో నివసించిందట! అందుకే ఆ ఆసక్తి.

శాంత స్వస్థలం కేరళలోని త్రివేంద్రం భర్త 'వరల్డ్ బాంక్'లో పనిచేస్తున్నాడు.

"మా స్వస్థలం త్రివేంద్రం అయినప్పటికీ, అక్కడ ఎక్కువ కాలం ఉండలేదు. మా తండ్రి ఆర్మీలో లెఫ్టినెంట్ కల్నల్ కావడంతో, ఆయనకు బదిలీ అయిన వూళ్ళన్నిటికీ మారవలసి వచ్చేది" అని చెబుతోంది శాంత.

ఆమె మద్రాసులోని క్వీన్ మేరీస్ కాలేజీలో 1966-70 మధ్యకాలంలో చదివి పట్టాతీసుకుంది. తర్వాత మద్రాసులోనే క్రిస్టియన్ కాలేజీలో పోస్టుగ్రాడ్యుయేషన్ చేసింది. 1972-73 సంవత్సరంలో ఐయ్యేయస్‌లో శిక్షణ పొందింది.

ఆమె కాలేజీలో చదివేటప్పుడు వైస్‌ప్రెసిడెంట్‌గా విద్యార్థి సంఘాలలో చురుకైన పాత్ర వహించింది. మోటార్ సైకిల్ నుంచి లారీ వరకు ఏ వాహనమైనా నడపగలదామె. ఆమె మంచి మోటారు మెకానిక్ కూడా!

"ఒకసారి నేను మధురై పోలీస్ స్టేషన్‌లో మేడమీద ఓ పోలీస్ ఇన్స్పెక్టర్‌తో మాట్లాడుతున్నాను. అప్పుడు నేను ట్రెయినీ కలెక్టర్‌ని! మా సంభాషణ మధ్యలో హఠాత్తుగా తుపాకి పేల్చిన శబ్దం వినబడ్డది. దాంతో నేను, ఇన్స్పెక్టర్ బాల్కనీ వైపుకు పరుగెత్తాము.

మేము రోడ్‌మీద ఒక వాన్‌కి దగ్గరలో రైఫిల్ పట్టుకు నిలబడ్డ ఓ పోలీస్ కానిస్టేబుల్‌ని చూశాము. అతను ఇన్స్పెక్టర్ రామకృష్ణన్ వైపు రైఫిల్ గురిచేసి కాల్చడానికి సిద్ధంగా వున్నాడు. నేను గభాల్న ఇన్స్పెక్టర్‌ని పక్కకి లాగేశాను. కానిస్టేబుల్ మళ్ళీ రైఫిల్ పేల్చాడు. బుల్లెట్లలో ఒకటి నా తలమీదుగా పోయింది. మరొకటి నా భుజాన్ని రాసుకుంటూ వెళ్ళింది. ఇంతలో బుల్లెట్లు అయిపోయి అతని రైఫిల్ ఖాళీ అయింది. దాంతో మిగిలిన కానిస్టేబుల్స్ అతన్ని పట్టి బంధించేశారు.

నేనారోజు కొద్దిలో మృత్యువుని తప్పించుకున్నాను. ఆ హత్యాప్రయత్నంపై పోలీసులు కేసు నమోదు చేశారు. నేను కోర్టులో ఆ కానిస్టేబుల్‌కి వ్యతిరేకంగా సాక్ష్యమిచ్చాను. అతనికి ఏడేళ్ళపాటు జైలుశిక్ష పడింది. ఈ సంఘటన 1974లో జరిగింది. ఈమధ్య నేను తిరుచ్చిలోని ఓ గ్రామంలో పర్యటించడానికి వెళ్ళినపుడు ఓ వ్యక్తి నాకొక విజ్ఞాపన పత్రాన్ని అందజేశాడు.

అందులో 'ఆరోజున మీపైకి తుపాకీ పేల్చిన వ్యక్తిని నేనే. నేను జైలు నుంచి విడుదలయ్యాను. ప్రస్తుతం నాకు, చేయడానికి పనేమీ దొరకలేదు. మీరు దయతో నాకో కుట్టు మిషన్ ఇప్పిస్తారా' అనివుంది. "అలాగే తప్పక సహాయం చేస్తాను" అని చెప్పానతనికి" అందామె నవ్వుతూ.




# రేపే

జె. వి. బాబు

విజయ పక్కనే నడుస్తున్నాడు మోహన్. ఇద్దరూ చేతులుకలుపుకునే నడుస్తున్నారు.

"అక్కడ కూర్చుందాం" చెప్పింది విజయ.

తలూపాడు మోహన్. పక్క పక్కనే కూర్చున్నారిద్దరూ.

అగాధమైన జలనిధిలో నుండి ఉవ్వెత్తునతరంగాలు ఎగిరిపడుతున్నాయి. తీరం చేరిన కెరటాలు తమ జీవితకాలం అంతవరకే అన్నట్లు వెంటనే తిరిగి సాగరంలో కలిసిపోతున్నాయి. ఎన్నో యుగాలుగా అవిశ్రాంతంగా చేస్తున్న దినచర్యను ఆరోజు కూడా పూర్తిచేసి పశ్చిమకొండల నుండి పయనించి మరో ప్రదేశంలో తన వెలుగునిచ్చేందుకు వెళ్తున్నాడు సూర్యుడు.

"విజయా! ఏదయినా చెప్పు వింటాను" కాసేపు తర్వాత అన్నాడు మోహన్.

"ఏముంది చెప్పేందుకు....?''

''ఏదయినా చెప్పొచ్చు. మనకు కావలసింది ఒకరి ఎదురుగా ఒకరు ఉండటం. అంతేకానీ మన మధ్య ఏం మాటలు జరిగాయన్నది ముఖ్యంకాదు"

"అయితే నేను కొన్ని విషయాలు చెబుతుంటాను. నీవు వింటూ కూర్చో. కానీ ఆ మాటలు నువ్వు వినలేవేమో!''

నవ్వుతూ అంది విజయ.

"నువ్వు ఏం చెప్పినా బుద్ధిగా వింటూ కూర్చుంటాను'' గెడ్డంకింద చెయ్యి ఆన్చి ఆమెవైపు చూస్తూ అన్నాడు మోహన్.

"అయితే చెబుతున్నాను.... విను! అప్పులు చేయడంలో మన దేశం అగ్రస్థానంలో ఉంది. బంగారుభూమి, అన్నపూర్ణ అని చెప్పబడే ఈ పుణ్య భూమిలో ఉద్యోగం దొరక్క ఎందరో నిరుద్యోగులు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. వరకట్నం చావులు రోజురోజుకి పెరిగిపోతున్నాయి. 1982లో ఎనభై మూడు వరకట్నపు చావులు జరిగితే, 1983 కొచ్చేసరికి అవి నూటఇరవై ఒకటి అయ్యాయి. మానభంగాలేమో 229నుండి 326 దాకా అభివృద్ధి అయ్యాయి. ఇవి మన రాష్ట్రంలో పోలీసు రికార్డులకెక్కినవి మాత్రమే.అంటే రోజు రోజుకీ స్త్రీలపై అత్యాచారాలు ఎక్కువవుతున్నాయి. పుణ్యభూమి అని చెప్పబడే ఈ దేశంలో ఆదిమూర్తిగా కొలవబడే స్త్రీపై ఎన్ని అత్యాచారాలు, ఎంత చిన్నచూపు....''

చెప్పడం ఆపి అతనివైపు చూసింది.

ఆమె వైపు దీనంగా చూస్తున్నాడు అతను.

"ఏమైంది మోహన్?'' నవ్వాపుకుంటూ అడిగింది విజయ.

''ఏ స్త్రీ అయినా ఇటువంటి శిక్ష ప్రేమికుసికి విధించగూడదని చెబుతూ ఓ కథ రాయాలని ఆలోచిస్తున్నాను"

''మరి ఏవైనా విశేషాలు చెప్పమని నువ్వేకదా అన్నది'' నవ్వింది విజయ.

"అవును....కానీ మరీ ఇలాంటి విషయాలు, ఇన్ని వివరాలతోసహా చెబుతావనుకోలేదు"

నవ్వుతూ అతడివైపు చూస్తోందామె.

ఆమెఒడిలో తలవాల్చి పడుకున్నాడు అతడు.

కాసేపు ప్రకృతి సౌందర్యాన్ని చూస్తూ గడిపి ''ఇక వెళ్దామా!" అని లేపిందామె.

అతడూ లేచి ఆమెను అనుసరించాడు.

ఇద్దరూ బీచ్ దాటి పార్కింగ్‌లో ఉన్న స్కూటర్ తీసి కదిలారు. మరి కాసేపట్లో స్కూటర్ ఓ సందు ముందు ఆగింది.

 

"ఇంటికి రేపు ఎప్పుడయినా వస్తాను" చెప్పాడు మోహన్. ఆమె చెయ్యి ఊపింది. స్కూటర్ ముందుకు కదిలింది.

ఆమె ఇంటివైపు కదిలింది.

లోనికెళ్ళి ముఖం కడుక్కుని కుర్చీలో కూర్చుంది ప్రశాంతంగా. లోనుండి శారదమ్మ కాఫీ తెచ్చి ఇచ్చి "ఏమ్మా! ఈరోజు ఆలస్యం అయిందే..?" అడిగింది

"అలా బీచ్‌కి వెళ్ళానమ్మా!" అని కాసేపాగి, "ఈరోజూ జీతాలు ఇవ్వ లేదమ్మా" అంది.

"పోనీలే" తలూపి లోనికెళ్ళింది శారదమ్మ. మౌనంగా కాఫీ తాగుతోంది విజయ. తండ్రి షికారుకెళ్ళి ఇంకా తిరిగి రాలేదు. చెల్లెలు పక్కగదిలో పడుకుని ఏదో పుస్తకం తిరగేస్తోంది.

"ఏయ్ సుశీ....ఏమిటే ఆ పుస్తకం?" అడిగింది విజయ.

"ఇంకొక్క పేజీ ఉందక్కా! వచ్చి చెబుతానుండు" అంటూనే అయిదు నిముషాల తర్వాత వచ్చింది సుశీల.

"ఏం పుస్తకం అది?" మళ్ళీ అడిగింది విజయ.

"నవల అక్కా...ప్రేమ విమానం"

"ప్రేమ విమానం అంటే సైంటిఫిక్ నవలా?"

"కాదక్కా... ప్రేమ నవల!"

"ప్రేమ నవలా! ప్రేమ విమానం అంటే అదో విమానం పేరా" అడిగింది విజయ.

"అది కాదక్కా! ఇందులో హీరో పేదవాడు. హీరోయిన్ కోటీశ్వరుడి ఏకైక కుమార్తె. హీరో, హీరోయిన్ ప్రేమించు కుంటారు. మధ్యలో ఆమె తండ్రి విలన్లా ప్రవేశించి, ఆమెకు అబద్ధాలు చెప్పి వాళ్ళి ద్దరినీ విడగొడతాడు. హీరో డబ్బు సంపా దించాలని, దూరంగా వెళ్ళి కష్టపడి డబ్బు సంపాదించుకొస్తాడు. కాని అప్పటికే హీరోయిన్‌కు పెళ్ళయిపోయిందని తెలు సుంది. ఇక ఆ ప్రాంతంలో ఉండలేక హీరో మరో దూరప్రాంతం వెళ్ళిపోతాడు. కాని, పాపం హీరోయిన్ అక్కడే ఉంటోందని అతనికి తెలియదు.

ఓరోజు హీరోయిన్ భర్త హీరోకి పరిచయమై ఇంటికి తీసుకువస్తాడు. అక్కడ హీరోయిన్‌ని చూసి స్టన్ అయి పోతాడు. కొద్ది రోజులకి సెకండ్ హీరో... అంటే హీరోయిన్ భర్త తన స్నేహి తుడూ, భార్య అంతకుముందే ప్రేమించు కున్నారని తెలిసి వాళ్ళని కలపాలని అనుకుంటాడు. ఈలోగా హీరోయిన్ తన తండ్రి అప్పట్లో తమ ఇద్దరినీ విడదీసేందుకే అబద్ధాలు చెప్పాడని తెలుసుకుని బాధపడుతుంది"

"ఇంకా ఉందా... అయిపోయిందా" అడిగింది విజయ.

"ఇంకా ఉందక్కా! ఇక్కడ క్లైమాక్స్ భలేగా ఉంటుందక్కా... ఇంతలో హీరో అక్కడ ఉండలేక అమెరికా వెళ్ళి పోవాలనుకుంటాడు. ఇది తెలిసిన సెకండ్ హీరో అతన్ని వెనక్కు తీసుకు రమ్మని భార్యను విమానాశ్రయం పంపి స్తాడు. తను జీవించి ఉంటే వాళ్ళిద్దరూ కలవరనుకుని, వాళ్ళిద్దరి మధ్యనుండి తప్పుకునేందుకు విషం పుచ్చుకుని చని పోతాడు. విమానాశ్రయం వెళ్ళిన హీరోయిన్‌కి హీరో భర్తతోనే కాపురం చెయ్యమని బతిమలాడి పంపేస్తాడు. ఇంటికొచ్చేసరికే భర్త శవం. మరి కొద్ది సేపటికి హీరో వెడుతున్న విమానం యాక్సిడెంట్ అయి కొందరు చనిపోయా రని తెలుస్తుంది. భర్త శవం దహనం

చేసిన తర్వాత యాక్సిడెంట్ స్పాట్‌కి ఏడుస్తూ కారులో వెళుతుంది. హీరోయిన్ హీరో శవం పడిన చోట దిగులుగా వెదుకుతుంది. అక్కడ దూరంగా ఓ కవరు పడి ఉంటుంది. విప్పి చూస్తుంది. అది అతడు ఆమె కలిసి తీయించు కున్న ఫొటో. అదెలా పడుతుందంటే— విమానంలో హీరో తనెలాగూ చనిపో తున్నానని తెలుసుకుని, చివరిసారిగా ప్రియురాలిని చూడాలని జేబులోనుండి ఫొటో తీసి ముద్దుపెట్టుకొని చని పోతాడు.

తర్వాత హీరోయిన్ హీరో చని పోయిన స్థలంలో ఓ పెద్ద భవంతి కట్టు కొని, అందులోనే అతనిని తలుచుకుంటూ జీవిస్తుంది.... ఎలా ఉందక్కా... ?"

"బాగానే ఉంది"

"బాగా ఏమిటక్కా! ఇరవైనాలుగు వారాలు ఊపిరి తిప్పుకోనివ్వకుండా చది విస్తేనూ!మరీ క్లైమాక్స్‌లో హీరో దగ్గరకు వెళ్ళేప్పుడు హీరో వస్తాడా రాడా అని సందేహం. ఇక్కడ సెకండ్ హీరో మందు నోట్లో పోసుకునేప్పుడు ఆపే స్తుంది. తర్వాత హీరోయిన్ ఇంటికి తిరిగి వచ్చేప్పుడు విమానం రిపేరని తెలుస్తుంది. కూలిపోతుందేమో అని సందేహం.ఇక్కడ సెకండ్ హీరో బతుకుతాడా అని మరో సందేహం. ఇద్దరిలో ఎవరు చస్తారా అని ఇంకో సందేహం. తర్వాత మూడు వారాలు సస్పెన్స్‌తో చంపేసిందక్కా. మళ్ళీ వారం పత్రిక వచ్చేదాకా ఆత్రంగా ఎదురుచూసేవాళ్ళం"

"అవును. ఆ రకం కథల్లో అలాంటి ఆకర్షణ ఉంటుందిలే. అయినా ప్రేమ భవంతులు సృష్టించే గొప్పవారు ఎంత మంది? హీరోకి కార్లు, మేడలు ఉండని నవలలు మనకు ఎక్కువగా లేవేమో"

కాసేపాగి "ఇంతకీ నీ పరీక్ష లెప్పుడు?" అడిగింది విజయ.

"మరో వారం ఉందక్కా"

"పరీక్షలు ముందుపెట్టుకుని నవలలు చదివేందుకు సిగ్గులేదూ. లోపలికెళ్ళి నీ పుస్తకాలు చదువుకో పో" కసిరింది.

మూతి ముడుచుకుని లోపలికెళ్ళింది సుశీల.

అప్పుడే లోపలికి అడుగుపెట్టాడు వెంకట్రామయ్య.

"ఎక్కడికెళ్ళారు నాన్నా?" అడిగింది విజయ.

"అలా కాసేపు పార్కులో కూర్చుని వస్తున్నానమ్మా" నీరసంగా చెప్పాడు– సమస్తాగాఅరిగిపోయిన వెంకట్రామయ్య

స్నానం చేసేందుకు లోనికెళ్ళింది విజయ.

* * *

రకరకాల షాపులు, మనుషుల్తో రద్దీగా ఉన్న ఆ వీధిలో ఓ యువ కుడు చేతిలో ఫైల్ పట్టుకుని నడుస్తు న్నాడు. అతడి గుడ్డలు కాస్త నలిగివున్నా ముఖం మాత్రం చదువుకున్నవాడని అర్థమయ్యేలా ఉంది.

అతడు ఓ షాపు ముందు ఆగాడు. కాసేపు బయట నిలబడి లోపలికెళ్ళాడు.

"ఏం కావాలి సార్" అడిగాడు ప్రొప్రయిటర్.

కాసేపు తల దించుకుని తర్వాత అన్నాడతను–"నాకో ఉద్యోగం కావాలి సార్"

ఎదుటి వ్యక్తి కాసేపు ఆశ్చర్యపోయాడు. తర్వాత వ్యంగ్యంగా అన్నాడు–"ఉద్యోగాలు ఇక్కడ అమ్మరండి"

"మీరు అమ్మినా కొనుక్కోగలిగిన శక్తి నాకు లేదులెండి. అటువంటి శక్తి గానీ ఉంటే ఈసరికి ఏదో ఓ ఉద్యోగం కొనుక్కొని ఉండి వుందును"

"ఇంతకీ ఏం చదివావు?" అతడు ఏకవచనంలోకి దిగాడు.

"బి.ఎ. ఫస్ట్‌క్లాస్"

"బి.ఎ. లో ఏం చెప్పారు?"

"మొగల్ చక్రవర్తుల నుండి నెపోలియన్ దాకా అందరి చరిత్రా చెప్పారు. మాకియవెల్లీ దగ్గర నుండి మార్క్స్ వరకూ కూడా చెప్పారు. అర్థశాస్త్రంలో ఆర్థికాభివృద్ధి గురించీ చెప్పారు"

"చూడూ... మాకియవెల్లి గురించీ, మార్క్స్ గురించీ ఏం చెప్పారో నాకు తెలియదు కానీ ఇక్కడ ఉండే ఏసీలు, ఫ్రిజ్‌లు రిపేరు చేయగలిగితే సరే... ఉద్యోగం ఇస్తాను"

"సార్! నేను డిగ్రీ చదివాను. నాకు ఈ ఏసీ రిపేర్‌లు అవీ తెలియదు. పోనీ ఓ నెలరోజులు మీదగ్గర నేర్చుకుంటాను"

"పోవయ్యా పెద్ద చెప్పొచ్చావు! ఏదో అడిగావుకదా అని పని చూపించబోతే, నీకు డబ్బులిచ్చి నన్నే నేర్పించమంటున్నావే! ఎన్నో సంవత్సరాల ఎక్స్‌పీరియన్స్ ఉన్నోళ్లే మా దగ్గర పనిచేస్తున్నారు. ఇక నీకు నేను పని నేర్పించి చేయించేదేమిటి?"

తల దించుకున్నాడు అతడు.

"అశోకుడు చెట్లు నాటించాడు. షాజహాన్ చెట్లకు నీళ్లు పోయించాడు అంటే అన్నం పెట్టేదెవరయ్యా! ఏదయినా పని నేర్చుకో. అది బువ్వ పెడుతుంది. సరే.... వెళ్ళువెళ్ళు"

ఆ యువకుడు తల దించుకుని ఇవతలకు వచ్చేశాడు. అతనికి దుఃఖం గుండెల్లో నుండి ఉబికివస్తోంది. ఏదో ఆవేదన గుండెల్ని కోసేస్తోంది. నిరుద్యోగ జీవితం ఎంత బాధాకరం. సంపాదించలేని అసమర్థుడు అని సమాజం వేలెత్తి చూపిస్తుంటే అన్నీ చేయగలశక్తి ఉండీ చెయ్యలేక, వ్యర్థమవుతున్న జీవితం మీద బాధా, అన్నీ కలసి అతన్ని మానసికంగా చిత్రహింస పెడుతున్నాయి.

కిర్రుమంటూ పక్కనే స్కూటరు ఆగింది.

"ఏయ్..రమణా! చనిపోవాలనుకుంటే నా స్కూటరే కనిపించిందా!"

పరిచితమయిన కంఠం విని గిర్రున తిరిగి చూసాడు ఆ యువకుడు. తన కాలేజీ మిత్రుడు మోహన్ నవ్వుతూ కనిపించాడు.

"ఏమిటలా చూస్తున్నావు! రా.... స్కూటరెక్కు. లేకుంటే ట్రాఫిక్ జామ్ అవుతుంది"

స్కూటరెక్కి కూర్చున్నాడు రమణ.

"రమణా! అప్పుడెప్పుడో కనిపించావు. మళ్ళీ చాలాకాలంనుంచీ కనిపించటంలేదే"

"ఏముంది! మన డిగ్రీ కంప్లీట్ అయిన తరువాత కాంట్రాక్టర్లతో అవుటాఫ్ స్టేట్ వెళ్ళాను. ఓ సంవత్సరం అక్కడే ఉన్నాను. ఇప్పుడు కాంట్రాక్టు అయిపోయింది. అందుకే డిగ్రీపుచ్చుకుని పీఛన పడ్డాను. మరి నువ్వేం చేశావు?"

"నేను డిగ్రీ పూర్తికాగానే బాంక్‌లో చేరిపోయాను. ప్రస్తుతం బాంక్‌లో జాబ్ చేస్తున్నాను"

"ఇక ఆపరా! మా ఊరి బస్సు అదుగో. టైం అయింది. నేను ఊరెళ్ళిపోతాను"




''ఇప్పుడు నువ్వు మీ పల్లెటూరు వెళ్ళటం లేదు. నాతో మా ఇంటికి వస్తున్నావు''

"లేదు. నేను ఆగిపోతాను"

"చెప్పినట్లు విని ముందు ఇంటికిరా! నీతో చాలా విషయాలు మాట్లాడాలి"

"నాతో మాట్లాడే విషయాలు ఏం ఉన్నాయి?''

"నీకో శుభవార్త చెప్పాలి" వేగంగా స్కూటర్ పోనిస్తూ అన్నాడు మోహన్.

"శుభవార్తా! ఏమిటా వార్త?" ఆశ్చర్యంగా అడిగాడు.

"అది ఇంటి దగ్గర చెబుతాను''

"సరే పద....ఏంచేద్దాం'' నవ్వుతూ అన్నాడు రమణ.

స్కూటర్ ఇంటిముందు ఆగింది. దిగాడు రమణ. ఎదురుగా చిన్న మిద్దె. సంవత్సరం క్రితం వరకూ, కాలేజీలో చదివేప్పుడు ఆ ఇంటికి వచ్చేవాడు తను. ఆ ఇంటిలో వ్యక్తులందరూ తనకు పరిచితులే.

"హాయ్. రమణా!చాలాకాలమయిందే నిన్ను చూసి. మా ఇంటికి రావటంలేదే?" నవ్వుతూ పలకరించాడు శ్రీకాంత్. అతడు మోహన్ అన్న.

నవ్వి ఊరుకున్నాడు రమణ.

"సారీ రమణా! అర్జంటుగా వెళ్తున్నాను. ఫ్రెండ్ వెయిట్ చేస్తుంటాడు. ఇప్పటికే లేటయింది''

''అలాగే.... వెళ్ళరండి''

''మళ్ళీ మాట్లాడతాను'' అంటూనే బయట ఆపి ఉన్న స్కూటర్ ఎక్కాడు శ్రీకాంత్. బాంక్‌లో జాబ్ చేస్తున్నాడు అతను కూడా.

''అమ్మ ఏదీ?'' లోపలికి అడుగు పెడుతూ అన్నాడు రమణ.

''అమ్మా నాన్న బంధువుల ఇంటికి పెళ్ళికెళ్ళారు. పనిమనిషి భోజనం వండేసి వెళుతుంది"

మోహన్ తండ్రి శంకర్రావు. ఓ పుస్తకాల షాపు ఓనర్. అతడి షాపులో నవలలు, స్టూడెంట్స్ బుక్స్, స్టేషనరీ అన్నీ ఉంటాయి.

"కమాన్... కూర్చో భోంచేద్దాం''

''వద్దు మోహన్! నేను వెళ్ళిపోతున్నాను''

"వెళ్ళిపోతాను వెళ్ళిపోతాను...వచ్చినప్పటినుండి ఈమాటతప్ప ఇంకేమాటా నీ నోటినుండి రాదేం? కాలేజీ జీవితంలోని ఓ మంచి స్నేహితుడు ఇన్నాళ్ళకు కనిపించాడనీ, అతనితో నా ఆనందం పంచుకుందామనీ, నా సమస్యలు చర్చించుదామనీ ఎంతో ఆనందంతో నిన్ను తీసుకువస్తే, వెళ్ళిపోతానంటే నేనేం చేసేది''

''సారీ... నువ్వింతగా బాధపడతావనుకోలేదు"

''ఇట్సాల్ రైట్! భోంచేద్దాంరా"

టేబుల్ ముందు కూర్చున్నాడు రమణ.

''రమణా! నీకో శుభవార్త చెబుతానన్నాను కదూ!'' అన్నం వడ్డిస్తూ అన్నాడు మోహన్.

తలూపాడు రమణ.

"నీకు విజయ గుర్తుందికదూ... మన క్లాస్‌మేట్'' రమణవైపు చూస్తూ అన్నాడు మోహన్.

విజయ డిగ్రీలో తన క్లాస్‌మేట్. ఆమె ఓ అందాలరాశి. అందమేకాదు- గంభీర జీవనది కూడా. ఆమె ఎవ్వరితోనూ మాట్లాడేదికాదు. కానీ పలకరిస్తే మాత్రం చిరునవ్వుతో సమాధానం చెప్పేది. అటువంటి స్త్రీని ఎవరైనా మరచిపో

 

గలరా! తను మాత్రం మరిచిపోలేదా ముగ్ధ మనోహర సౌందర్యరాశిని.

''నాకూ, విజయకూ తొందరలో పెళ్ళికాబోతోంది. మాఅన్న పెళ్ళికాగానే నేనూ, విజయా పెళ్ళి చేసుకుంటాం'' సిగ్గుపడుతున్నట్టు చెప్పాడు మోహన్.

''నిజంగానా! విజయ ఒప్పుకుందా?''

''ఇది మా ఇద్దరి నిర్ణయమే. ఆమె పెద్దలకు తెలుసు. ఇంకా మా నాన్న గారికి తెలియదు. కానీ మా నాన్న నా మాట కాదనడు. ఆర్థికంగా చితికిపోయిన కుటుంబమే అయినా గౌరవమర్యాదలున్న కుటుంబం వారిది. నాన్న అభ్యంతరం చెప్పడు''

"కంగ్రాచ్యులేషన్స్ మోహన్!"

"థాంక్యూ"

ఇద్దరూ భోజనం పూర్తిచేసి మోహన్ బెడ్ రూమ్‌లోకి వెళ్ళారు. మంచంమీద పడుకున్నాడు రమణ. టేప్‌రికార్డర్ ఆన్ చేసి పక్కనే కుర్చీలో కూర్చున్నాడు మోహన్.

"ఇంతకీ మీరు ఎలా కలుసుకున్నారు! అయ్ మీన్....కాలేజీలో లేని స్నేహం, ఇప్పుడెలా అయింది"

"ఓరోజు స్కూటరుమీద వెళుతున్నాను. బస్టాప్‌లో విజయ ఎందుకో ఆందోళనగా వాచ్ చూసుకుంటోంది. మొదటినుంచి ఆమె అంటే నాకు మంచి అభిప్రాయం ఉంది. ఆమెను చూస్తుంటే నా మనస్సెందుకో స్పందించేది. నాకు రాబోయే భార్య అలాగే ఉండాలనిపించేది. అన్నట్టు ఏదో చెబుతున్నాను కదూ! ఆమెను చూసి స్కూటర్ ఆమె ముందు ఆపాను. ఏదైనా అత్యవసరమేమో అనీ, డ్రాప్ చెయ్యాలా అనీ అడిగాను. తలూపిందామె. వెనక కూర్చోమన్నాను. కాసేపు తటపటాయించి తర్వాత కూర్చుంది. ఎక్కడికి అని అడిగాను. తన తండ్రిని హాస్పిటల్‌లో జాయిన్‌చేశారని ఆఫీసుకి ఫోన్ వచ్చిందట! అందుకే వెళ్తున్నానని చెప్పి, హాస్పిటల్ అడ్రసు చెప్పిందామె. హాస్పిటల్ దగ్గర స్కూటరుఆపి, ఆమెతోపాటులోనికి నడిచాను. ఆమె తండ్రికి గుండెనొప్పి రావటంతో హాస్పిటల్‌కి తీసుకొచ్చారు. ప్రస్తుతం కోలుకునే ఉన్నాడు. పేషంట్ దగ్గరకు వెళ్ళాము. నేను తన క్లాస్‌మేట్ ననీ, స్కూటర్‌మీద తీసుకొచ్చాననీ నా గురించి చెప్పిందామె. అతడు గౌరవంగా పలకరించాడు.

ఇంతలో లేడీ డాక్టర్ వచ్చింది. ఆమె నాకు తెలుసు. అతడు నాకు కావలసిన వ్యక్తి అని ఆమెకు చెప్పి కాసేపాగి వచ్చేశాను.

ఆ మర్నాడు పండ్లు తీసుకుని హాస్పిటల్‌కి వెళ్ళాను. మొహమాట పడ్డారు వాళ్ళు. బలవంతంమీద పండ్లు తీసుకున్నారు. అలాగే వాళ్ళన్న మూడు రోజులూ వెళ్ళాను. డిశ్చార్జ్ చేసే నాలుగవ రోజు ఓ ఫ్రెండ్ కారు అడిగి తీసుకుని వాళ్ళని ఇంటిదగ్గర వదిలివచ్చాను. అప్పు డప్పుడూ వస్తుండమని వారు కోరారు. అలాగే అప్పుడప్పుడూ వాళ్ళ ఇంటికి వెళ్ళి రావటంతో ఆమెతో స్నేహం ఏర్పడింది. ఓ నెల గడిచిన తర్వాత ఎన్నాళ్ళ నుండో నా మనసులోనే దాగివున్న ప్రేమను ఆమె ఎదుటపెట్టాను. ఆమె అంగీకరించింది. త్వరలో పెళ్ళిచేసుకోబోతున్నాము"

"నిజంగా నువ్వు అదృష్టవంతుడివి. ప్రేమించిన చేతిని దక్కించుకోవడం అంత సులభంకాదు. అలా నువ్వుదక్కించుకుంటున్నావు. జీవితభాగస్వామిగా చేసుకో

బోతున్నావు"

"థాంక్స్" సిగ్గుగా అన్నాడు మోహన్.

"మొత్తంమీద అనుకున్నది సాధించు కుంటున్నావు"

"అంతేకాదు-మరో మంచిపని కూడా చేయబోతున్నాను" అన్నాడు మోహన్.

"ఏమిటి?" అడిగాడు రమణ.

"నీలాంటి మంచి స్నేహితుని నా దగ్గరే ఉంచేసుకోవాలనుకుంటున్నాను"

"అంటే" ఆశ్చర్యంగా అడిగాడు రమణ.

"చెప్పను...చేసిచూపిస్తాను"నవ్వుతూ అన్నాడు మోహన్.

"ఓకే... నీ ఇష్టం"

ఇద్దరూ అదే మంచంమీద పడుకుని నిద్రపోయారు.

సాయంత్రం కాఫీ తాగి వెళ్ళి పోయాడు రమణ.




తన గదిలో కూర్చుని టైప్ చేస్తోంది విజయ.

"అమ్మా! మిమ్మల్ని యమ్.డి.గారు పిలుస్తున్నారు" చెప్పాడు ప్యూన్.

"వస్తున్నా పద" చెప్పింది విజయ.

కాగితాలు ఎగిరిపోకుండా పేపర్ వెయిట్ పెట్టి గదివేపు నడిచింది.



వెనక్కు వాలి ఏవో కాగితాలు చూస్తున్న ఆఫీసర్ ఆమె రావటం చూసి ముందుకివాలాడు. అలా వాలటంతో అతని మెడలోని గోల్డ్ చెయిన్ ముందుకి ఊగింది.

అతడికి పాతికేళ్లు ఉంటాయి. అతని స్థితిని తెలుపుకునేందుకు కాబోలు మెడకో చెయిన్, చేతికో చెయిన్, మూడు ఉంగరాలు, ఓ ఇంపోర్టెడ్ వాచ్ ధరించి వున్నాడు. టేబిల్ మీద ఇంపోర్టెడ్ సిగరెట్ పాకెట్ ఉంది.

"టేక్ యువర్ సీట్" అన్నాడతను. అతని పేరు ప్రకాష్.

కూర్చుంది విజయ.

"చూడండీ...ఈ రిపోర్టుని ఓ గంటలో ఫైవ్ కాపీస్ టైప్‌చేసి పెట్టండి" కాగితాలు అందించాడు ప్రకాష్.

"ఓ.కే.సర్" వెనక్కు తిరిగిందామె.

తెల్లగా, అందంగా మలచిన శిల్పంలా ఉన్న ఆమెను కోరికగా చూస్తున్నా డతను. పొడవుగా కదలాడుతున్న జడతో వయ్యారంగా నడుస్తున్న ఆమె అందాన్ని చూస్తున్నాడు. ఆమె గదినిదాటిన వెంటనే తలుపు మూసుకుపోయింది.

అడిగిన టైముకు పని పూర్తిచేసి, కాగితాలు మేనేజర్‌కి అందించి, ఇంటికి బయలుదేరింది విజయ.

బస్టాపులో నిలబడి బస్సుకోసం ఎదురు చూస్తోంది.

"హాయ్... విజయా!"కాలుకింద పెట్టి, స్కూటర్ మీదనుండి పిలుస్తున్నాడు మోహన్.

అటూ, ఇటూ చూసి స్కూటర్ దగ్గరగా నడిచింది విజయ.

"మోహన్! మరీ ఇలా పిలవడం నాకు నచ్చదు" అంటూ స్కూటరెక్కి కూర్చుంది.

"అలాగే!రేపటినుంచి ఇలా పిలవను...

సరేనా" స్కూటర్ పోనిస్తూ అన్నాడు మోహన్.

స్కూటర్ ఓ హోటల్ ముందు ఆగింది. లోపలికి నడిచారు ఇద్దరూ.

ఫామిలీ రూమ్‌లో కూర్చుని ఐస్‌క్రీమ్ ఆర్డర్ ఇచ్చాడు.

"రేపు ఆదివారంకదా! ఎక్కడికెళ తావు?" అడిగింది విజయ.

"రేపు నేను పల్లెటూరికి వెళుతున్నాను" చెప్పాడు మోహన్.

"పల్లెటూరా! ఎవరింటికి? ఎంత దూరం?"

"పక్కనే..ఓ ఎనిమిది మైళ్ళ దూరం. నా స్నేహితుని ఇంటికిలే. నీకు రమణ అని నా ఫ్రెండ్ గుర్తున్నాడా?" అడిగాడు మోహన్.

"సన్నగా, పొడవుగా ఎప్పుడూ నీతో ఉండేవాడు.... అతనేనా?"

"అవును...అతడే! చాలా తెలివైన వాడు. అంతకుమించి స్నేహానికి ప్రాణం ఇచ్చేవాడు. మొన్ననే కనిపించాడు. ప్రస్తుతం నిరుద్యోగి. నా స్నేహితుడు ఒకడు ఫైనాన్షియర్‌గా అప్పులు ఇస్తుంటాడు. అతడిని అడిగి అక్కడ ఓ ఉద్యోగం సంపాదించాను. అక్కౌంటెంట్‌గా.నెలకు నాలుగువందలు ఇస్తారు"

"అతడు నీకు అంత ముఖ్య స్నేహితుడా?"

"నాకుండే స్నేహితులలోకెల్లా నేను మెచ్చినవాడు, నాకు నచ్చినవాడు అతడే. నిజమైన స్నేహానికి విలువనిచ్చే వ్యక్తి. అందుకే అతనంటే మా ఇంట్లో కూడా సదభిప్రాయముంది"

"అలాంటివారికి సహాయపడటం మంచిదే" ఐస్‌క్రీమ్ పూర్తిచేసి అన్నది.

"ఇంతకీ నీ ఉద్యోగం ఎలా ఉంది?" అడిగాడు మోహన్.

"ఎలా ఉన్నా మరికొంతకాలంపాటు చేయక తప్పదుకదా!" చిన్నగా నవ్వుతూ అన్నది విజయ.

"అంటే అక్కడ నీకు హాయిగా లేదా?"

"ప్రైవేట్ కంపెనీలలో ఎంతచేస్తే మాత్రం గవర్నమెంట్ జాబ్‌లా ఉండదు కదా! అదీకాక నాకు ఇటువంటి ఉద్యోగాలు చేస్తూ బతికేకన్నా హాయిగా భర్త నీడలో, ఇంటిలో కూర్చుని ఇంటి బాధ్యత నిర్వహించాలని ఉంటుంది"

"నిజమే విజయా!కానీ మా అన్న పెళ్ళి కాకుండా నేను నా పెళ్ళి గురించి నాన్న గారికి చెప్పడం బాగుండదు. అందుకే మరికొద్ది రోజులు ఇలా గడపవలసి వస్తుంది"

ఒప్పుకోలుగా తలూపింది విజయ.

"విజయా! సినిమాలో చెప్పినట్టుగా కాదు, కానీ ఏ పరిస్థితులు అడ్డువచ్చినా మనిద్దరి పెళ్ళి తప్పక జరుగుతుంది. ఒక వేళ మన తల్లిదండ్రులు వద్దన్నా వారిని ఎదుర్కొని పెళ్ళిచేసుకుంటాను" ఆమె చేతిలో చెయ్యివేశాడు మోహన్.

ఆమె ముఖంలో కాంతిరేఖలు విరిశాయి.

"వెళ్దామా" కాసేపాగి అన్నాడు మోహన్.

"వెళ్దాం" లేచిందామె.

బిల్లు చెల్లించి బయటకు నడిచాడు. విజయకు వీడ్కోలు చెప్పి స్కూటర్ స్టార్ట్‌చేశాడు.

* * *

ఆరోజు స్కూటర్ మీద రమణ ఊరు బయలుదేరాడు మోహన్. అంతకుముందు రెండు మూడు మార్లు ఆ గ్రామానికి వెళ్ళి

ఉండటాన రమణ ఇంటికి సరాసరి వెళ్ళాడు.

ఇంటిముందు చెట్లకి పాదులు చేస్తున్నాడు రమణ. స్కూటర్ ఆగిన శబ్దం వినిపించి బయటకు వచ్చాడు.

"హాయ్ రమణా!" పలకరించాడు మోహన్.

స్నేహితుని చూసి మొదట ఆశ్చర్యపోయాడు రమణ.

"రా మోహన్! ఏమిటిలా అనుకోకుండా ఊడిపడ్డావు?!" చేతులకున్న మట్టి కడుక్కుంటూ అన్నాడు రమణ.

"నీకు ఎప్పుడో చెప్పాను. 'ఏదయినా చేసేది చెప్పను. చేసి చూపిస్తాను' అని. అందుకే అనుకోకుండా రావడం" నవ్వుతూ అన్నాడు మోహన్.

"రా....కూర్చో" మంచం వాల్చాడు రమణ. అతని తల్లి కాఫీ తెచ్చి అందించింది.

"అలా వెళ్దామా" కాఫీ తాగిన తర్వాత అన్నాడు రమణ. తలూపాడు మోహన్. ఇద్దరూ ఊరుదాటి పొలాలవైపు వెళ్ళారు.

"మబ్బులు లేచాయి. వర్షం వచ్చేట్టుందికదూ" ఆకాశంవైపు చూస్తూ అన్నాడు మోహన్. తలూపాడు రమణ.

పొలాలలో కొద్దిదూరం నడిచి, ఓ మామిడిచెట్టు కింద కూర్చున్నారు.

"నీకో శుభవార్త" కూర్చుంటూ అన్నాడు మోహన్.

"ఏమిటి?" అడిగాడు రమణ.

"నువ్వు ఉద్యోగివి కాబోతున్నావు"

"ఎలా?"

"ఓ మిత్రుడి ఫైనాన్స్ కంపెనీలో నీకు అకౌంటెంట్‌గా ఉద్యోగం సంపాదించాను. నెలకు నాలుగువందలు ఇస్తారు. నీకు ఇష్టంవుంటే రేపటినుండి చేరొచ్చు"

"ఉద్యోగం అంటూ ఒకటి దొరికితే, నాలాంటివాడికి ఇష్టంలేకుండా ఎలా పోతుంది" ఆనందంగా అన్నాడు రమణ.

"రేపు ఉదయమే ఇంటికివస్తే నిన్ను తీసుకెళ్ళి వారికి పరిచయం చేసేసి వదిలి వెళతాను"

"అలాగే" తలూపాడు రమణ.

"మొత్తానికి నాకోసం చాలా కష్టపడ్డట్టు వున్నావు. నా కోసం నువ్వింతగా శ్రమ తీసుకున్నావంటే నీలాంటి మిత్రుణ్ని పొందడం నా అదృష్టం అన్నమాటే"

"అంత పెద్ద మాటలెందుకు రమణా! నువ్వంటే నాకిష్టం. నీకేదో సహాయం చెయ్యాలనుకున్నాను... చేస్తున్నాను. అంతే"

"చాలా థాంక్స్‌రా" మోహన్ వైపు చూస్తూ అన్నాడు రమణ. మోహన్ ఆకాశంవైపు చూస్తున్నాడు. చుట్టూ మబ్బులు ముసురుకుంటున్నాయి.

"ఇకనుండి నువ్వు రోజూ ఇక్కడినుండి టౌన్‌కి రాలేవుగా. అక్కడే ఏదైనా చిన్న రూమ్ చూసుకుంటే బాగుంటుందేమో!"

"అలాగే. అక్కడే ఏదైనా రూమ్ చూసుకోవాలి. అమ్మ ఇక్కడి నుంచి టౌన్‌కి ఎలాగూ రాదు"

ఇంతలో చిన్నగా చినుకులు పడసాగాయి.

"పెద్ద వర్షం వచ్చేట్టుంది... వెళ్దామా మోహన్" అన్నాడు రమణ. మోహన్ లేచాడు.

"విజయగారు బాగున్నారా?"

తలూపాడు మోహన్.

వర్షం పెద్దది కాసాగింది. కొద్దిదూరం పడిపడిగా నడిచారు. వర్షం మరింత పెద్దదయింది. పరిగెత్తుకుంటూ ఊళ్ళోకి వచ్చారు. ఇద్దరూ తడిచారు.

"ఆ చెట్టుకింద కాసేపు నిలబడదాం" అటువైపు దారితీస్తూ అన్నాడు మోహన్. అతడిని అనుసరించాడు రమణ. ఇద్దరూ ఆ చెట్టుకింద నిలబడ్డారు. మోహన్ జేబు లోని కర్చీఫ్ తీసి తల తుడుచుకుంటు న్నాడు.

"అనుకోకుండా వర్షం ఇలా వచ్చిం దేమిటి?" అంటూ తుడుచుకుంటున్నాడు. అవతలినుండి జవాబు రాలేదు. కాసేపాగి రమణవైపు చూశాడు మోహన్.

రమణచూపుఅక్కడలేదు. ఎక్కడో... ఎదురింటి మిద్దెమీద ఉంది. మిద్దె మీద ఓ స్త్రీ నిలబడి ఉంది. ఆమె చేతిలో ఓ చిన్నారిపాప. చాలా అందమైన స్త్రీ ఆమె.

ఆమె చూపులు రమణమీద ఉన్నాయి. రమణ చూపు కూడా ఆమెమీదే ఉంది. పరిసరాలు మరచి అతడినే, అతనివైపే చూస్తోంది ఆమె. పక్కనున్న మిత్రున్ని కూడా మరచిపోయి ఆమెనే చూస్తున్నాడు రమణ. ఎన్నో ఏళ్ళక్రితం తప్పిపోయిన ప్రేమికుల్లా, చాలాకాలానికి కలుసు కున్న ప్రాణమిత్రుల్లా ఒకరినొకరు చూసుకుంటున్నారు.

ఆ ఇద్దరి నడుమ కాలం స్థంభించి నట్లుంది. ఈ లోకంలో వారిద్దరే ఉన్న ట్లుగా చూసుకుంటున్నారు. కనులు మూస్తే ఎదుటి దేవత మాయం అవుతుందేమోనని అతడు, చూపు తిప్పితే దేవుడు మాయం అవుతాడేమోనని ఆమె భయపడుతున్న ట్లున్నారు.

ఆ చూపుల్లో ఎన్నో భావాలు, ఎన్నో మూగభాషలు, చూపులతోనే ఒకరినొకరు పరిశీలించుకుంటూ, పలకరించుకుంటు న్నారు.

కొద్దిసేపటికి రమణ చూపులు మరల్చు కున్నాడు. ఆమెకూడా చూపు తిప్పుకుంది ఒక్క పదిసెకనులు గడిచాయి. ఆ కొద్ది సమయమే యుగం అయినట్టు మళ్ళీ చూసుకుంటున్నారు.

వర్షం తగ్గింది. కానీ ఏదో లోకంలో ఏ భావాలలోనో ఉండే వారిని, వారి ఆనందాన్ని చెడిపే ఇష్టంలేదు మోహన్‌కి. అందుకే మౌనంగా ఉన్నాడు.

వర్షం తగ్గినట్టు గమనించాడేమో రమణ 'వెళ్దామా' అన్నాడు. తలూపాడు మోహన్.

చెట్టు దాటి నడువసాగారు ఇద్దరూ. నడుస్తూ ఆమెవైపు చూశాడు రమణ.

వీడ్కోలు చెబుతున్నట్టుందా చూపు. ఆ స్త్రీ కన్నులలో రెండు కన్నీటి బిందు వులు గమనించాడు మోహన్.

ఇద్దరూ కొద్దిదూరం నడిచిన తర్వాత అడిగాడు మోహన్ 'ఎవరామె?'

"చిన్నప్పుడు నాతో కలిసి చదువు కుంది"

"ఇప్పుడెక్కడఉంటోంది?" అడిగాడు మోహన్.

"ఎక్కడో బొంబాయిలో భర్త దగ్గ రుంటోంది. వాళ్ళ నాన్నను చూసేందుకు వచ్చింది కాబోలు"

మౌనంగా నడుస్తున్నాడు రమణ. ఆమె గురించి ఎక్కువ చెప్పడం అతనికి ఇష్టంలేదని గ్రహించాడు మోహన్.

ఇద్దరూ ఇంటికి చేరుకున్నారు. రమణ ఏదో ఆలోచనలతో కొట్టుమిట్టాడుతున్నట్టు ఎక్కువగా మౌనంగా ఉండటం గమనిం చాడు మోహన్.

తల తుడుచుకుని, భోజనానికి కూర్చు న్నారు. రమణ తల్లి అన్నం వడ్డించింది. తిని లేచారు.

"నేను వెళ్తాను" కాసేపు తర్వాత అన్నాడు మోహన్.

 

"సాయంత్రం వరకూ ఉండు మోహన్" అన్నాడు రమణ.

"లేదు... వెళ్ళాలి''

"నా ప్రవర్తనతో నీకేదయినా బాధ కలిగిస్తే క్షమించు మోహన్''

"ఛా! అలాంటిది ఏమీ లేదు. ఊరకే వెళ్ళాలని వెళుతున్నాను''

"అలాగే... నీ ఇష్టం''

"రేపు తప్పక వస్తావుకదా!''

"ఓ! తప్పకుండా''

మోహన్ స్కూటర్ స్టార్ట్ చేసుకుని వెళ్ళిపోయాడు. మోహన్ వెళ్ళిపోయేంత వరకూ వీధిలో నిలబడి ఇంటిలోకినడిచాడు రమణ.

* * *

ఉదయమే రమణ బస్సుకోసం 'ఆ' ఇంటిమీదుగానే బయలుదేరాడు. అప్పుడే దుమ్ము లేపుకుంటూ ఓ కారు ముందుకి వెళ్ళిపోయింది. అందులో 'ఆమె' ఉంది. ఒక్క నిట్టూర్పు వదిలాడు రమణ. శరీరంలోని అర్ధభాగం ఎక్కడికో దూరంగా సుదూరతీరాలకు తనను వదిలి వెళ్ళిపోయింది. మళ్ళీ ఎప్పుడో,ఎక్కడో..

కాసేపటికి బస్సు వచ్చింది. బస్సెక్కి టౌన్‌కి బయలుదేరాడు.

బస్సు దిగి మోహన్ ఇంటికి వెళ్ళాడు. అప్పటికే మోహన్ టిఫిన్ చేసి రెడీగా ఉన్నాడు. ఇద్దరూ స్కూటర్ మీద ఫైనాన్స్ ఆఫీసుకి బయలుదేరారు.

రమణను ఆఫీసులో మిత్రునికి పరిచయం చేశాడు మోహన్. రమణకు చెయ్యాల్సినపని గురించి చెప్పాడుఅతడు. వచ్చే బిల్స్ నోట్ చేసుకోవడం, ఇచ్చిన కాష్ నోట్ చేసుకోవడం, ఫైనల్ అకౌంట్స్ చేయడం. ఇదీ పని. కాసేపు కూర్చుని మోహన్ బాంక్‌కివెళ్ళిపోయాడు.

సాయంత్రం బాంక్ నుండి వచ్చేప్పుడు ఆఫీసు దగ్గరకు వచ్చాడు మోహన్. రమణ లేచి మోహన్‌తోపాటు కదిలాడు.

"ఎలా ఉంది ఉద్యోగం?" అడిగాడు మోహన్.

"చరిత్ర చదివినవాడు అకౌంట్స్ చూడాలంటే కాస్త కష్టమే. కానీ కాంట్రాక్ట్సులో అకౌంట్స్ చూస్తుండేవాడిని కాబట్టి ఇక్కడ సులువుగానే ఉంది"

"ఎలాగో కొద్దికాలం సర్దుకో రమణా"

నవ్వాడు రమణ.

"ఈ రాత్రికి ఇంటి దగ్గర పడుకో. రేపు ఉదయమే ఆఫీసుకి వెళ్ళొచ్చు''

"వద్దు. ఈరోజు ఇంటికి వెళ్ళిపోతాను. రేపు రూమ్ వెతాడి అక్కడ చేరిపోతాను"

"రూమ్ దొరకడం కష్టం అవుతుం దేమో" అనుమానంగా అన్నాడు మోహన్.

"ఈ దేశంలో వెతాడనిదే ఏదీ దొరకదు. అలాగే డబ్బు పెడితే దొరకనిది ఏదీ ఉండదు. కాబట్టి డబ్బులు పెట్టి వెతాడితే రూమ్ దొరక్కపోదు''

నవ్వాడు మోహన్. ఇద్దరూ హోటల్‌లో టిఫిన్ చేశారు. రమణను బస్టాండ్ దగ్గిర వదిలాడు మోహన్.

"రేపు ఉదయం ఇంటికొస్తావా?" అడిగాడు మోహన్.

"నువ్వే ఆఫీసు దగ్గరకు వచ్చెయ్" చెప్పాడు రమణ. మోహన్ వెళ్ళిపోయాడు.

వారం రోజులకు ఓ చిన్నగది అద్దెకు తీసుకుని అందులో చేరిపోయాడు రమణ.

* * *

ఆఫీసు కాగితాలు చూస్తోంది విజయ. ప్యూన్ వచ్చాడు.

"మేడమ్! అయ్యగారు పిలుస్తున్నారు"

లేచి గదిలోకి వెళ్ళింది.

''కూర్చోండి'' చెప్పాడు ప్రకాష్.

కూర్చుందామె.

"ఈ రిపోర్ట్ డిక్టేట్ చేస్తాను. టైప్ చేసి పెట్టండి''

"ఓకే సర్'' కాగితం, పెన్సిల్ పట్టుకుందామె.

''టు ది పీకాక్ ఇంజనీరింగ్ కంపెనీ, హైదరాబాద్...'' చెబుతున్న అతడు తలెత్తి ఆమెవైపు చూశాడు. ఆమె పయ్యెద కాస్త పక్కకు తొలగి మగసిరిని సవాలుచేస్తున్నట్లుంది.

మళ్ళీ తల వంచుకుని చెప్పసాగాడు. కానీ అతడి మనస్సు ఆ రిపోర్ట్‌మీదా, చూపులు కాగితాలమీదా నిలబడలేదు. మళ్ళీ తలెత్తి చూశాడు. ఆమె తల వంచుకొని రాస్తోంది.

ముందుకి పడిన కురులు, తెల్లగానున్న కోల ముఖం.... చూపు మరల్చుకోనివ్వకుండా, పయ్యెదనుండి బయటపడి రెప్ప గొడుతున్న వక్షోజాలు, సున్నగా మెరుస్తున్న శరీరం...పని మరిచిపొయ్యాడతను. గెడ్డంకింద చెయ్యి ఉంచి ఆమె వైపే చూస్తున్నాడతను.

అవతలి నుండి ఎంతసేపటికీ మాట రాకపోయేటప్పటికి తలెత్తి అతనివైపు చూసింది విజయ. అతని చూపు ఎక్కడుందో గమనించి, ఆత్రుతగా పైట సర్దుకుందామె.

ఉలిక్కిపడ్డాడతను. కాగితాలలోకి చూపు మార్చి డిక్టేట్ చెయ్యసాగాడు. చెప్పడం పూర్తయింది. లేచిందామె.

''చూడండి...! ఈ కాగితాలు కూడా టైపుచేసి ఉంచండి'' ఫైలులోని కాగితాలు నాలుగు తీసి ఆమె చేతిలో పెడుతూ, కాస్త ఆమె చేతికి తన చెయ్యి తగిలించాడు. షాక్‌కొట్టినట్టు వెనక్కుతీసుకుంది చెయ్యి. కాగితాలు తీసుకుని వెళ్ళిపోయింది. ఆమె వెనుకే స్ప్రింగ్‌డోర్ మూసుకుపోయింది.

మెల్లగా నవ్వుకున్నాడు ప్రకాష్. అందమైనది విజయ. అంతేకాదు– తనకి అందనిది కూడా. అంటే డబ్బుకి దొరికేది కాదు. కోరికతో వచ్చేదికాదు. పెళ్ళికి అందేది కాదు– ఎందుకంటే ఆమె మరో యువకుని ప్రేమిస్తోంది. ఏవిధంగానూ ఆమె అందనిదని అతనికి తెలుసు.

అందనిదాని మీద మనిషికి కోరిక ఎక్కువ. అతను అందుకు అతీతుడుకాదు.




ఇసుకలో కూర్చుని ఎగిరిపడే తరంగాలను చూస్తున్నాడు రమణ. ఆకాశాన్ని తాకాలని కాబోలు ఉవ్వెత్తున ఎగిరి శక్తి చాలక విరుచుకపడి మళ్ళీ ప్రయత్నించేందుకు తిరిగి తల్లి గర్భంలోకి చేరిపోతున్నాయి. వాటివైపు చూస్తూ ఆలోచిస్తున్నాడు రమణ.

"హాయ్ రమణా!''

పిలుపు వినబడి తిరిగి చూశాడు రమణ. ఎదురుగా మోహన్. పక్కనే విజయ.

"ఏమిటిలా వచ్చావు?'' పక్కనే కూర్చుంటూ అడిగాడు మోహన్. అతడి పక్కనే విజయ కూర్చుంది.

"ఏదో బుద్ధిపుట్టింది, తీరిక దొరికింది'' నవ్వుతూ అన్నాడు రమణ.

"మిమ్మల్ని ఒకరికి ఒకరిని పరిచయం చెయ్యవసరం లేదుకదూ''

''ఆ అవసరం లేదులే'' అన్నాడు రమణ. ఆమె కూడా నవ్వేసింది.

''బాగున్నారా?'' అడిగాడు రమణ.

"బాగున్నాను. మరి మీరు...''

తలూపాడు రమణ.

రమణ చేతిలో మౌత్ఆర్గన్ చూసి దానిని తీసుకుని నోటికి ఆనించాడు మోహన్.

''ఇప్పుడు ఎక్కడ మీరు ఉండేది?'' అడిగింది విజయ. చెప్పాడు రమణ.

''అంటే మా ఇంటికి వెళ్ళేదారిలోనే అన్నమాట. అటే కాబట్టి మీ ఇంటికిరోజూ రావచ్చు''

''ఇల్లుకాదండీ రూము... నేనొక్కడినే ఉండేది''

''అలాగా''

''విజయా!రమణదగ్గర ఎన్ని పుస్తకాలున్నాయో తెలుసా? అన్నీ నీకు నచ్చే పుస్తకాలే! నీకు కావాలంటే వెళ్ళితెచ్చుకో''

"నిజమేనా'' అడిగిందామె.

నిజమేనన్నట్టు తలూపాడు రమణ.

ఓ పదిహేను నిముషాలు అలా మాట్లాడుకుంటూ గడిపేసారు. చీకటిపడ సాగింది.

లేచి ముగ్గురూ నడిచారు. స్కూటర్ స్టార్ట్‌చేశాడు మోహన్. ఇద్దరూ నిలబడి ఉన్నారు.

''మీరు వెళ్ళండి. నేను కాసేపాగి వస్తాను'' అన్నాడు రమణ.

విజయ స్కూటరెక్కి కూర్చుంది. స్కూటర్ వెళ్ళిపోయింది.

రమణ మరికాసేపు వీధులన్నీ చుట్టి రూమ్‌కి చేరుకున్నాడు. భోజనం వండు కోవాలనిపించలేదు. అలాగే చాపమీద పడిపోయాడు.

* * *

ఆ రోజు సెలవుదినం కావటంతో టిఫిన్ తినేసి వచ్చి పడుకొని నవల చదువు కుంటున్నాడు రమణ. బయట స్కూటర్ ఆగిన చప్పుడు వినిపించింది. మోహన్ వచ్చాడనుకొని పుస్తకం పక్కన పడేసి లేచి కూర్చున్నాడు.

మోహన్ లోపలికి వచ్చాడు.

"అయితే ఈరోజు ఊరికెళ్ళలేదన్న మాట'' లోనికి అడుగుపెడుతూ అన్నాడు మోహన్.

''లేదు మోహన్''

"అయితే ఇంటికి వచ్చెయ్యి. అక్కడే భోంచేసి ఇద్దరం మ్యాట్నీ సినిమాకి వెళ్దాం''

''అలాగే వెళ్దాంలే... కూర్చో''

కూర్చున్నాడు మోహన్.

''అలా ఆ పుస్తకాలు చూస్తుండు. కాఫీ పెట్టేస్తాను'' లోపలి కిటికీ లోని స్టౌ తీసి వెలిగించి నీళ్ళు పడేసి, పౌడర్ వేసాడు.

''ఇప్పుడు అనవసరంగా ఎందుకు శ్రమపడతావు'' కసిరినట్టు అన్నాడు మోహన్.

ఉదయం మిగిలిన పాలుపోసి, కాఫీ కాచి, రెండు గ్లాసుల్లో పోసి తెచ్చాడు రమణ.

మోహన్ కిటికీలో ఉన్న పుస్తకాలు ఒక్కొక్కటి తీసి చూస్తూ అన్నాడు— "అనవసరంగా చాలాడబ్బు పుస్తకాలమీద వేస్ట్ చేసినట్టున్నావు''

కాఫీ గ్లాసు చేతికి అందిస్తూ అన్నాడు రమణ—''నువ్వు పొరపాటుపడ్డావు''

''అంటే...''

''పుస్తకాలమీద పెట్టిన డబ్బు వేస్ట్

ఎందుకు అవుతుంది? పుస్తకాలు ఎంతో ఆనందాన్ని, విజ్ఞానాన్ని అందిస్తాయి. అసలు నీకు తెలుసా! ఆపుస్తకాలు కొన్ని ఎలా కొన్నానో. నాతో ఉండేవాళ్లు అందరూ సినిమాకి వెళితే ఆ డబ్బులు ఖర్చుపెట్టకుండానూ, క్యాంప్ వెళ్ళినపుడు రెండుపూటలా భోంచెయ్యకుండానూ, అలాగే కొన్ని సరదాలు, ఆనందాలు, వదులుకొని కొన్న పుస్తకాలు ఇవి...

"నీకు తెలుసా మోహన్! బాధల సుడిగుండంలో చిక్కుకున్నపుడో, ఆకలి వేసినపుడో, ఒంటరితనం కౌగిలించు కున్నప్పుడో నేను ఆ పుస్తకాలు పట్టు కుంటాను. ఈ లోకంలో నేనొక్కడినే ఒంటరివాడిని కానని, నేనొక్కడినే బాధితుడనుకానని, నేనొక్కడినేపీడితుడను కానని అవి నాకు బోధించినట్టవుతుంది. నాలాంటివారు మరి కొందరున్నారని సంతృప్తి పడతాను. లేకుంటే ఏ బలహీన క్షణాన ఎటువంటి పాడుపనో చేసుండే వాడినే...!

"ఒక్కోరాత్రి నాకు పిచ్చిపిచ్చి నో నో... చాలా భయంకర ఆలోచనలు వస్తుంటాయి. మనిషి దేనికోసం పాటు పడేది. డబ్బుకోసమా? కీర్తికోసమా? డబ్బుకోసమే అయితే డబ్బు పొందిన మన మునిమనవళ్ళు మన పేరుకూడా గుర్తుపెట్టుకోరే? మరి కీర్తికోసమే అయితే ఆ కీర్తి ఎంతకాలం ఉంటుంది. ఓ రచయితగా పేరు తెచ్చుకుంటే ఓ రెండువందల సంవత్సరాలు, ప్రధాని అయితే మరో వంద సంవత్సరాలు పుస్త కాలలో పేరు నిలిచి ఉంటుందనుకో. ఈలోపల ఏ జల ప్రళయమో, అణుయుద్ధమో, భూమి అంతరించిపోవ డమో జరిగితే ఈ మనుషులు అంతా ఎటుపోతారు? అప్పుడు మానవజీవి అనేదే ఉండదుకదా! మళ్ళీ కొత్త సృష్టి వస్తుందా? వాళ్ళకి మన గురించి తెలు స్తుందా? అసలు దేవుడున్నాడా? ఉంటే అతనేం చేస్తుంటాడు? జరిగే పనులన్నీ శేషపాన్పు మీద పడుకుని చూస్తుంటాడా? అలా ఎంతకాలం చూస్తూవుంటాడు? అత డికి బోరు కొట్టదా? పోనీ ఓ కోటి కోట్ల సంవత్సరాలు ఉంటాడనుకుందాం. తరు వాత అయినా బోర్ కొట్టిపోడా? అయినా మనుషుల్ని పుట్టించి చంపడం తప్ప అతనికి ఇంకేం పనిలేదా? మరి మనిషి చనిపోతాడుకదా.... అతని ప్రాణం ఎటు పోతుంది? దేవుడు ఉంటాడనుకుంటే స్వర్గానికో, నరకానికో. లేడు అనుకుంటే చావు తరువాత ప్రాణానికి మనుగడ లేదు....

"అటువంటి భయంకర ఆలోచనలు ఒక్కోరాత్రి నన్ను భయపెడుతాయి. ఈ భూమిని గురించి, ఆ దేవుని గురించి, మానవుని చివరిదశ గురించి తలచుకుంటే భయంకరంగా ఉంటుంది. దానిని మాటల్లో చెప్పలేను. అటువంటి పరిస్థితులలో ఓ పుస్తకం తెరచి ఆ పుస్తకంలో నిమగ్న మయిపోతాను. అలా ఆ ఆలోచననుండి తప్పించుకుంటాను" ఏదో ఆలోచిస్తూ అన్నాడు రమణ.

"పిచ్చి రమణా! అటువంటి ఆలో చనలు అసలెందుకు రావాలి? ఈ లోకంలో పుట్టాము, కాబట్టి ఓ యాభై సంవత్స రాలు ఎలాగో గడిపేస్తే తర్వాత ఏం జరిగినా మనకెందుకు? కాబట్టి ఆ ఆలోచనే రాకూడదు"

"నేనూ అలాగే అనుకుంటుంటాను. కానీ ఆలోచించటం ఓ వ్యసనం. ఆలోచిస్తుంటే ఆలోచనలు వస్తూనే ఉంటాయి...ఏం




చెయ్యను?"

"నీలయినవరకూ అటువంటి ఆలోచనలు తగ్గించుకో" అన్నాడు మోహన్.

రమణ కాఫీ గ్లాసులు రెండూ పక్కన పెట్టాడు.

కాఫీ తాగి "ఇక వెళ్దామా!" అన్నాడు మోహన్.

ముఖం కడుక్కుని డ్రస్ మార్చుకున్నాడు రమణ. స్కూటర్ మీద ఇద్దరూ మోహన్ ఇంటికి చేరుకున్నారు.

వరండాలో కూర్చుని ఉన్నాడు శంకర్రావు. వెళ్ళి ఆయన పక్క కుర్చీలో కూర్చున్నాడు రమణ. పక్కనే మోహన్ కూర్చున్నాడు.

"ఏం బాబూ! బాగున్నావా?" పలకరించాడు శంకర్రావు.

"బాగున్నానండి" నవ్వుతూ అన్నాడు రమణ.

"ఎలావుంది నీ ఉద్యోగం?"

"ఏదో సంతృప్తికరంగానే ఉంది"

"ఏమిటో రమణా! నువ్వు తెలివయినవాడివి. ఫస్ట్‌క్లాస్ విద్యార్థివి. అయినా ఈ దేశంలో తెలివయినవారిని కులాల పేరిట, మతాల పేరిట ప్రభుత్వం ఉత్తర దక్షిణాలు లేవని అధికారులు అణగదొక్కేస్తున్నారు. ఈ దేశంలో ఎందరో మేధావులు అణగదొక్కబడి ఉన్నారు. వారిలో నువ్వొకడివి" నిట్టూరుస్తూ అన్నాడు ఆయన.

మౌనంగా ఉన్నాడు రమణ.

"పోనీలే. త్వరలో ఏదయినా గవర్నమెంట్ ఉద్యోగం చూసుకుందాం" అన్నాడు శంకర్రావు.

"లోపలికెళ్దాంరా రమణా" పిలిచాడు మోహన్. లోపలికి నడిచాడు రమణ. ఇద్దరూ మోహన్ బెడ్‌రూంలో కూర్చున్నారు. మోహన్ డ్రస్ మార్చుకుంటున్నాడు. రమణ తల వెనక్కి వాల్చి ఏదో ఆలోచిస్తున్నాడు.

"ఏమిటి రమణా ఆలోచిస్తున్నావు?" అడిగాడు మోహన్.

"ఇంతకుముందు మీ నాన్న అన్నాడు చూశావా! మేధావులు అణగదొక్కబడి ఉన్నారని"

"అంటే ఎలా అణగదొక్కబడి ఉన్నారని అనుకుంటున్నావు"

"ఈ దేశంలో మేధావులకు ప్రోత్సాహం లేదు. పాలకులు తమ స్వార్థం కోసం ఇంకా ఆనాటి బ్రిటీషు రాజనీతి విభజించి, పాలించు అనే పద్ధతినే అవలంబిస్తున్నారు. అందుకే దేశంలో కొన్ని తరగతులవారి సానుభూతికోసం వారికి రిజర్వేషన్లు పెట్టి ఓట్లు సంపాదించుకుంటున్నారు. దీనివలన మేధావులు బాధపడుతున్నారు. ఉదాహరణకు ఏవైనా ప్రొఫెషనల్ కోర్సులలో సీట్ల గురించి ఆలోచిద్దాం. ఉన్న నూటయాభై సీట్లలో ఇరవైశాతం రిజర్వేషన్ సీట్లు అనుకుంటే ఓ ముప్పై సీట్లు వారివి. మామూలు విద్యార్థులు ఎనభైశాతం మార్కులు తెచ్చుకున్నవారికి సీటు వస్తే ఈ రిజర్వేషన్ లిస్టులో అరవైశాతం మార్కులు వచ్చినా సీటు వస్తుంది. అంటే డెబ్భై తొమ్మిదిశాతం తెచ్చుకున్న మరో విద్యార్థికి సీటు రాదు. ఎంతో కష్టపడి చదివిన మరో తెలివైన విద్యార్థి ఎంత నిరాశ చెందుతాడో ఆలోచించు"

"అంటే రిజర్వేషన్‌లు తప్పంటావా?"

"అలా అని చెప్పడం లేదు. తరతరాలుగా కొన్ని తరగతులకు ఈ సమాజం ఎంతో ద్రోహం చేసింది. మానవత్వం లేకుండా ఆలోచించింది. అందుకే ఆ జాతిని మనం మనతోపాటు

కలుపుకుని ముందుకు నడిపించాలి. కానీ ఆదారి ఇదికాదు. ఒక దేశ ప్రగతికి తోడ్పడే మేధావుల్ని అణచడం వలన ఏ దేశం బాగుపడదు. జాతి మొత్తానికి ఉచిత విద్యావసతి, ఆర్థిక సహాయం అందజేయాలి. అంతేగాని తెలివిగలవారిని బాధ పెట్టకూడదు. కొద్దికాలం క్రితం ఈ రిజర్వేషన్‌ల వల్లనే విరక్తి చెందిన ఓ యువకుడు ఆత్మహత్య చేసుకున్నాడు.

ఒక జాతిని ఏదో ఉద్ధరిస్తున్నాం అని చెప్పుకునే ఈ ప్రభుత్వాలు అసలు ఆ విషయాన్ని గూర్చి చిత్తశుద్ధితో ఆలోచిస్తున్నాయా అని అనుమానించాల్సి వస్తోంది"

ఆలోచిస్తూ వింటున్న మోహన్ అది ఎలాగో చెప్పమన్నట్టు చూశాడు.

"మన ప్రభుత్వం 'ఏకజాతి' కావాలని సందేశాలిస్తుంటుంది కదా! మరి అలాంటప్పుడు కొందరికి ప్రత్యేకమైన హాస్టళ్లు, ఊరికి దూరంగా 'కాలనీ'లు నిర్మిస్తూ, వారిని ప్రత్యేకంగా ఉంచుతుందేం! కులాన్ని మరచిపొమ్మంటూనే నీ కులం ఏమిటని అప్లికేషన్స్‌లో అడుగుతుందేం? అలా అడిగి మరీ కులం గుర్తు చేస్తుంటే 'ఏకజాతి' ఎలా సాధ్యం చెప్పు"

"నువ్వన్నది నిజం" ఒప్పుకున్నాడు మోహన్.

"ఓకే... లీవిట్. ఇంకేదయినా మాట్లాడు" ఆ టాపిక్ అంతటితో వదిలేద్దాం అన్న ఉద్దేశంతో అన్నాడు రమణ.

ఇంతలో భోజనం పూర్తయినట్టు మోహన్ తల్లి వచ్చి చెప్పింది. ఇద్దరూ భోజనంచేసి రూమ్‌లోకొచ్చారు. కాసేపు నిద్రపోయి లేచారు.

"ఏ సినిమాకెళ్దాం?" అడిగాడు మోహన్.

"ఏదైనా మంచి డైరెక్టర్ సినిమాకెళ్దాం"

రమణ లేచి ముఖం కడుక్కున్నాడు. మోహన్ డ్రెసప్ అయి వచ్చాడు. ఇద్దరూ స్కూటర్‌మీద 'బిగ్‌బాస్' ఆడుతున్న హాలు చేరుకున్నారు. ఆదివారం అవడం వలన రద్దీ ఎక్కువగా ఉంది.

మోహన్ ఓ ఫ్రెండ్‌నడిగి రెండు టిక్కెట్లు తీసుకువచ్చాడు. ఇద్దరూ సినిమా చూశారు.

"ఎలా ఉంది?" సినిమా వదిలిన తర్వాత అడిగాడు రమణ.

"చాలా బాగుంది. ఆ ఫైటింగ్‌స్టయిల్ ప్రపంచంలో మరెవ్వరికీ రాదు. ఈమధ్య జాకీ ఛాన్ అనే హీరో వస్తున్నాడు. కానీ బ్రూస్‌లీ స్పీడ్ అతడికి రాదు" చెప్పుకుపోతున్నాడు మోహన్.

స్కూటర్‌పై రమణను రూముదగ్గర దించేసి మోహన్ వెళ్ళిపోయాడు.

• • •

సమయం ఆరు కావస్తోంది. నల్లగా మబ్బులు కమ్మి ఉన్నాయి. మరో నిముషంలో వర్షంపడేట్టు ఉంది. కిటికీ దగ్గర నిలబడ్డాడు రమణ. ఏదో పని ఉన్నట్లు, ఎవరివో ప్రేమికుల సందేశాలను చేరవేసేందుకు వెళుతున్నట్లున్న మేఘాలను చూస్తున్నాడు అతడు. తన చెలికి కూడా ఆ మేఘాల ద్వారా ఏదైనా సందేశం పంపితే అన్న ఆలోచన అతనికి వచ్చింది.

సన్నగా చినుకులు పడసాగాయి. అంతవరకూ ప్రియుడి సందేశం మోసుకెళుతున్న మేఘాలు, తాము సందేశం అందించాల్సిన ప్రేయసికి మరో యువకునితో పెళ్ళయిందని దారిలో




తెలుసుకున్నాయి కాబోలు, దుఃఖాన్ని ఆపుకోలేక ప్రియుడికంటే ముందుగా అవే ఏకధారగా కన్నీరు కురిపించ సాగాయి.

ఒక్క క్షణం 'ఆమె' అతని గుండెల్లో మెదిలింది. అతని గుండె తియ్యగా స్పందించింది. అక్కడా ఈ వాతావరణమే ఉంటే ఆమె ఏమిచేస్తుం టుంది. చల్లని చలికి, భర్త కౌగిలిలో వెచ్చగా సేదతీర్చుకుంటూ ఉంటుందా? అవునులే. నాకూ వెచ్చగా గుండెల్లో అగ్నిరగిల్చి, ఎన్నో తుఫానులకు, చలి గాలులకు తట్టుకునేట్టు చేసావుగా. అయినా భార్య ఇచ్చే వెచ్చదనానికన్నా ప్రేమజ్వాల అందించే వేడి మరింత వెచ్చగా ఉంటుందిలే.

'ఆమె'ను గురించి మనసులో ఆలోచనాతరంగాలు ఉప్పొంగుతుంటే, ఆమెను చూడాలనిపించింది అతడికి. లోపల ఎక్కడో సూట్‌కేస్ అడుగున ప్రాణంకన్నా మిన్నగా భద్రంగా దాచుకున్న ఫొటోను చేతిలోకి తీసు కున్నాడు. మంచం మీద వాలి ఆ ఫొటోనే తదేకంగా చూస్తున్నాడు.

ఎంత అందంగా ఉందామె! కొన్ని అద్భుత సౌందర్యాలను ఏకంచేసి ఆమెను సృష్టించినట్లు. ఫొటోలోనే ఆ ముఖం అంత అందంగా ఉంటే ఇక ప్రత్యక్షంగా ఎంత అందంగా ఉండేదో.... అవును ఎంత అందంగా ఉండేదామె!?

పసుపు, పాలు కలిపి ముద్దచేసి ఆకారం చేస్తే, గులాబీ రేకులుతెచ్చి పెదాలకు అంటిస్తే, చక్కదనాలనన్నిం టినీ ఒక రూపంలోపెట్టి ఆమె మోము తయారుచేస్తే, ఈ లోకం గురించి తనకేమీ తెలియదని చెప్పకొనే కళ్ళు ఉంచి, శంఖంని కొలతగాపెట్టి ఆమె మెడను తయారుచేసి, ఎత్తు పల్లాలు సరిగాచేసి గంగానది వంపుచూసి ఆ నడుముచేసి, ఆ ఆకారానికి ప్రాణంపోసి, తనకోసమే ఎవరో పంపారని భావించే విధంగా ఉండేది.

ప్రేమించే తన కళ్ళకు 'అంత అందంగా కనిపించేదామె. పచ్చపరికిణీ వేసుకుని, పచ్చని పొలాల మధ్య ఆమె నడుస్తుంటే, పురివిప్పిన నెమలులు ఆమె నడకలో తనకు కనిపించేవి. పెదవివిప్పి తనతో పలికితే వసంతంలో కోయిల గానం వినిపించేది. ఆమె అచ్చం ఏ కావ్యనాయికలానో ఉండేది.

ఏవీ ఆ అందాలు? ఎక్కడ??

అతనికి ఓదార్పునిచ్చేందుకు కాబోలు రెండు కన్నీటిబొట్లు తమంతటతామే రాలి కిందపడి, తమ జాలిని ప్రదర్శించాయి.

"ఎక్కడో భర్త కౌగిలిలో, సంసా రంలో, బిడ్డతో ఆనందాన్ని పొందే చెలీ! ఓ నా మనసా! ఇక్కడ మరో మనసు నీకోసం అల్లాడుతోందని తెలుసా! పలుపును రగిలించి వెళ్ళిన ప్రియా! ఇక్కడ ఓ జీవి నీవు రగిలించిన ప్రేమాగ్నిలో నశించిపోతోందని తెలుసా? నీ నామస్మరణతో ఓ వ్యక్తి కృశించి పోతున్నాడని నీకు తెలుసా..."

'టక్‌టక్' బయట తలుపు చప్పుడు వినిపించింది. ఫొటో మంచం మీదపెట్టి కళ్ళు తుడుచుకుంటూ తలుపు తీసేందుకు వెళ్ళాడు.

తలుపు తీసి ఒక్కక్షణం ఆశ్చర్య పోయాడు.

ఎదురుగా విజయ!

ఒంటికి అంటుకున్న చీర శరీరంలోని అణువణువునూ బయటపడేస్తోంటే,

తడిసిన కురులు ముఖం మీద కరుచుకు పోయి కొత్త అందాన్ని తెస్తోంటే, మెడ మీదనుండి నీరు కిందకు జారి ఎక్కడో లోయలోకి వెళుతున్నట్టు....

చూపు మరల్చుకొని పక్కకు తప్పుకున్నాడు.

లోనికి వచ్చిందామె.

"ఎంత సేపు తలుపుతట్టానో తెలుసా?" అతడివైపు చూస్తూ అందామె.

"...ఏవో ఆలోచనల్లో ఉండి, వినిపించుకోలేదు. అయామ్ సారీ. మీరు పూర్తిగా తడిసిపోయారే! ఉండండి..టవలు ఇస్తాను" అంటూ పక్కనున్న టవలు తీసి ఆమెకిచ్చాడు.

కురులువిప్పి తుడుచుకోసాగిందామె. తడిసిన ఆమె చీర నుండి నీరు కారుతూనే ఉంది.

"నేను అలా బయటకు వెడతాను. మీరు చీర పిండుకోండి" చెప్పాడు రమణ.

"వద్దండీ... వర్షం తగ్గగానే వెళ్ళ





పోతాను" మొహమాటంగా అన్నదామె.

"పర్వాలేదు. రెండు నిముషాలేగా" తలుపు తీసుకుని వరండాలో నిలబడ్డాడు రమణ. తలుపు వేసుకుని మరో రెండు నిమిషాల తర్వాత తలుపు తీసిందామె.

"లోపలికి రండి" పిలిచింది.

చీర పిండి కట్టుకొని ఉన్నా తడి చీర కావడంతో ఆమె ఒంటికి అతుక్కుపోయి ఉంది. ఆమె వైపు చూడకుండానే లోనికి నడిచాడు. కొత్తగా కొన్న మంచం మీద కూర్చున్నాడు. ఓ మూలగా మరో చివర్న ఆమె కూర్చుంది. కొద్దిసేపు వారిమధ్య మౌనం రాజ్యమేలింది.

"ఈరోజు మీదగ్గర ఏదైనా పుస్తకం తీసుకెళ్ళాలని వచ్చా. మీ వీధి మలుపు తిరిగేసరికే, చినుకులుపడి పెద్ద వాన అయిపోయింది" తను వచ్చినదానికి సంజాయిషీ చెబుతున్నట్లు అందామె.

మౌనంగా ఉన్నాడతడు.

విజయ మంచం వైపు చూసింది. అక్కడ పడున్న ఫొటో చేతిలోకి తీసుకుందామె. అందమైన ఆడపిల్ల ఫొటో అది.

"ఎవరండీ ఈ అమ్మాయి?'' అడిగింది విజయ.

మరోవైపు చూస్తున్న అతను, గిర్రున తిరిగి చూసాడు.

"ఓ... సారీ! ఆ... ఫొటో ఇలా ఇవ్వండి" అడిగాడు రమణ.

"ఆమె ఎవరో చెప్పకూడదా?'' ఫొటో ఇస్తూ అందామె.

''చెప్పలేనండీ... నేను చెప్పలేను" కళ్లు మూసుకుని అన్నాడు.

"ఏం.... అంత చెప్పకూడనిదా!" అడిగిందామె.

"చెప్పకూడనిది కాదండీ! కానీ ఎక్కడో ఉన్న జ్వాలను పైకితెచ్చి నా గుండెల్ని మండించుకోలేను. ఆమెను తలచుకుంటే, నా కన్నులు వర్షిస్తాయి. అసలు నేనే మారిపోతాను. కొన్ని విషయాలు పక్కవారితో చెప్పుకుంటే ఆనందాన్నిస్తాయి, బాధను తగ్గిస్తాయి... నిజమే! కానీ ప్రేమను మనసులో దాచుకుంటేనే మధురంగా ఉంటుంది. అందుకే ఆమెను గురించి ఎవ్వరికీ తెలుపను"

"పోనీ ఒక్క విషయం చెప్పండి! ఆమె ఎక్కడుంది?" ఆరాగా అడిగింది విజయ.

"ఎక్కడో భర్త నీడలో ఉంటుంది"

"మై గాడ్! పెళ్ళయిపోయిందా!" ఆశ్చర్యంగా అడిగిందామె.

అతడు జవాబు చెప్పలేదు.

మరో పదినిముషాలు ఎవ్వరూ మాట్లాడుకోలేదు. మౌనాన్ని భంగం చేస్తూ రమణ అన్నాడు.....

"ఓ...సారీ! మీరు అలాగే కూర్చుండి పోయారు. ఉండండి కాఫీ పెట్టేస్తాను"

"ఇప్పుడెందుకండీ" మొహమాటంగా అందామె.

"ఫర్వాలేదు'' అంటూనే స్టౌ వెలిగించాడు. మిల్క్‌పౌడర్ వేసి కాఫీ పెట్టాడు.

"రండి! ఇక్కడ వెచ్చగా ఉంది కూర్చుందురుగాని" పిలిచాడు రమణ.

ఆమె వచ్చి అతని పక్కనే కూర్చుంది. స్టౌ వత్తులు మరి కొంచెం పెద్దవిచేశాడు.

కాఫీ రెండు గ్లాసులలో పోసి ఆమెకు ఒకటిచ్చి తను ఒకటి తీసుకున్నాడు.

"వర్షం తగ్గేట్లులేదు" బయటికి చూస్తూ అన్నాడు.

"ఎలాగండీ! నేను ఇంటికి వెళ్ళిపోవాలి. ఇప్పటికే అమ్మావాళ్లు నాకోసం ఎదురుచూస్తుంటారు" ఆందోళనగా అందామె.

"ముందు కాఫీ తాగండి. పక్కింటికి వెళ్లి గొడుగు పట్టుకొస్తాను. మీ ఇంటి దగ్గర వదిలిపెడతాను"

"థాంక్స్"

కాఫీ తాగిన తరువాత పక్కింటికెళ్లి





గొడుగు తీసుకునివచ్చాడు అతడు.

"ఏదయినా పుస్తకం తీసుకుంటారా?" అడిగాడు రమణ.

"వద్దులెండి. ఈ వర్షంలో తడిసి పోతుంది. రేపు వచ్చి తీసుకెళ్తాను''

"అలాగే రండి. కానీ మీరు ఒక్కరే రండి''

''అంటే...?''

''అదే... మీరు మాత్రమే రండి! తోడుగా వర్షాన్ని మాత్రం తీసుకు రాకండి''

నవ్వేసిందామె.

అతడూ నవ్వాడు.

ఇంటికి తాళం వేసి గొడుగు తీసి పట్టుకున్నాడు రమణ. చుట్టూ చీకట్లు ముసురుకొని ఉన్నాయి. వర్షం భయంకరంగా కురుస్తోంది.

ఇద్దరూ కదిలారు. ఆమె అతడికి ఆనుకుని నడుస్తోంది. ఆ చిన్న గొడుగులో ఇద్దరూ ఇమడలేకపోతున్నారు. ఇద్దరి మీదా వర్షపుజల్లు పడుతూనేవుంది. రోడ్డంతా నిర్జనంగా ఉంది.

"ఈ వీధి చివరే మా ఇల్లు'' చెప్పింది విజయ.

''అయితే దగ్గరికి వచ్చేశామన్న మాట''

ఇద్దరూ విజయవాళ్లింటి ముందుకు వచ్చారు. కిటికీలోనుండి కూతురుకోసం ఎదురుచూస్తోంది శారదమ్మ. కూతురుని చూడగానే ఆమె ముఖం వికసించింది.

''నేను వస్తానండి" వాకిట్లో నిలబడి అన్నాడు రమణ.

"లోపలికి రండి. భోంచేసి వెళుదురు. అసలే వర్షం... ఇపుడు ఇంటికెళ్లి మీరు వండుకోలేరు... రండి''

"వద్దండీ... మరెప్పుడయినా వస్తాను''

''పోనీ కాసేపు కూర్చొని, వర్షం తగ్గిన తర్వాత వెళ్ళకూడదా!'' అడిగింది ఆమె.

''సారీ! ఏమనుకోవద్దు'' అంటూనే వెనక్కు తిరిగి వెళుతున్నాడు రమణ.

ఒంటరిగా నిర్జనమైన రోడ్లలో, వర్షంలో వెళుతున్న అతన్ని కనుచూపు దాటేవరకూ చూసి, ఇంట్లోకి వెళ్ళింది విజయ.




రాత్రి తొమ్మిదిన్నర.

ఊరికి దూరంగా ఓ గెస్ట్‌హౌస్. విలాసాల, వినోదాల నిలయం అది. అక్కడ ఏంచేసినా, ఎలా చేసినా ఎవ్వరికీ వినిపించదూ, కనిపించదూ.

ఆ హౌస్‌లో ఇద్దరు వ్యక్తులు కూర్చుని ఉన్నారు. వారిముందు టేబిల్ మీద తెల్లటి సీసాల్లో ఎర్రటి ద్రవం ఉంది. పక్కనే చిప్స్‌లాంటి తినే వస్తువులు ఉన్నాయి.

''ఆ బ్రోకర్‌గాడు ఇంకా రాలేదే'' విసుగ్గా అన్నాడు ప్రకాష్.

''పిట్ట దొరికినట్టు లేదు'' అన్నాడు రాజేష్. అతడు ఆ ఊరి యం.యల్.ఏ. కొడుకు. రౌడీగా మంచి పేరుంది. తండ్రి సంపాదించిన ఆస్తి బోలెడువుంది. తిరిగేందుకు కారు ఉంది. బరువుగా పర్సు ఉంది. అందుకే అతడు ఎప్పుడూ జల్సా చేస్తుం

టాడు. ఖుషీగా కాలం గడుపుతూ ఉంటాడు.

ప్రకాష్‌కీ, అతడికీ మంచి స్నేహం. అధికారానికి, డబ్బుకి ఎంత దగ్గర సంబంధం ఉందో వారిద్దరి మధ్య అంత దగ్గర సంబంధం ఉంది. విందు వినోదాలు కలిసి చేసుకుంటుంటారు. ఏదైనా సినిమాకి వెళ్ళాలనుకుంటే ఇద్దరూ కలిసే వెళ్తారు. ఎప్పుడైనా మంచిపని చెయ్యాలనుకుంటే కలిసేచేస్తారు. అలాగే ఎప్పుడూ చేసే వెధవపనులు కూడా కలిసేచేస్తారు.

గ్లాసులోకి మందు పోసుకుని గొంతులోకి వంపుకున్నాడు ప్రకాష్. రాజేష్ చిప్స్ తింటున్నాడు.

''రాజా! నాకో సమస్య వచ్చిపడింది. దాన్ని నువ్వే సాల్వ్ చెయ్యాలి'' అన్నాడు ప్రకాష్.

''నీకు ఏ సమస్య వచ్చినా తీర్చగలిగినవాడిని నేను ఉన్నానుగా. ఆ సమస్య ఏమిటో చెప్పు?'' అన్నాడు రాజేష్.

''అందమైన ఓ అమ్మాయి ఉందనుకో... ఆ అమ్మాయిని ఎన్ని విధాలుగా ట్రైచేసినా రాలేదనుకో. దేనికీ లొంగలేదనుకో. అప్పుడేంచెయ్యాలి?''

"డబ్బుకి కూడా రాలేదా?"

''డబ్బుకి లొంగదు''

''అని నువ్వు అనుకుంటున్నావు. కానీ ఈ లోకంలో డబ్బుకి లొంగనిది ఏదీ లేదురా''

డబ్బుతో ఏదైనా చెయ్యొచ్చు అనే ధీమా అతడిలో ఉంది.

''ట్రైచేశాను. అది కూడా ఫెయిలయింది. మరొకరిద్వారా ఆశ చూపించాను. చెంప ఛెళ్ళుమనిపించింది'' చెప్పాడు.

''అయితే దాన్ని గురించి ఆలోచించాల్సిందే. ఇంతకీ అదేమయినా ధనవంతురాలా? ధనవంతులయితే డబ్బుకి పడరు. వాళ్ళకి మరో దారిలో పోవాలి. ఇంతకీ ఎవరది?''

"మా ఆఫీసులోనే టైపిస్ట్‌గా పని చేస్తోంది. స్టన్నింగ్ బ్యూటీ. నా మనసు ఎంత మరల్చుకోవాలనుకున్నా ఆమె నుండి మరల్చుకోలేక పోతున్నాను. ఒక్కసారి... కనీసం ఒక్కసారి చెయ్యి వెయ్యనిదే నిద్రపట్టేటులేదు" అన్నాడు ప్రకాష్.

"అంత అందంగా ఉంటుందా! అయితే రేపు నీ ఆఫీసుకి వచ్చి ఆ అందగత్తెను దర్శించుకుంటాను. తర్వాత ఏం చెయ్యాల్సిందీ ఆలోచించుకుని చెబుతాను. ఇంతకీ ఆమె పేరేమిటి?" అడిగాడు.

"విజయ" చెప్పాడు ప్రకాష్.

"నాకు చెప్పావుగా! ఇక ఆ విజయ నీ పడక చేరినట్టే భావించుకో" భుజం తడుతూ అన్నాడు రాజేష్.

బయట కారు ఆగిన చప్పుడు వినిపించింది.

"వాడు వచ్చినట్లున్నాడు" అన్నాడు రాజేష్. అతడి మాట పూర్తికాకముందే బ్రోకర్ లోపలికి వచ్చాడు. అతని వెనకే ఓ యువతి లోపలికి అడుగు పెట్టింది.

ఆమె చూపులో కైపు ఉంది. మగాడిని రెచ్చగొట్టే విధంగా బొడ్డు కిందకు చీర కట్టి ఉంది. అందంగానే ఉందామె.

"నేను వెళ్తున్నానయ్యా" చెప్పాడు బ్రోకర్. ఐదురూపాయల కాగితం వాడి చేతిలో పెట్టాడు రాజేష్. వాడు వెళ్ళిపోయాడు.

ప్రకాష్ లేచి తలుపువేసి వచ్చాడు.

"మందు కొడతావా?" అడిగాడు రాజేష్ ఆమెను.




"వద్దు. మీరు కానివ్వండి" చెప్పిం దామె.

"అయితే ఆ గదిలో కూర్చోపో" అన్నాడు ప్రకాష్.

అవతలి గదిలోకి వెళ్ళిందామె.

"ముందు నువ్వు వెళతావా?" అడిగాడు రాజేష్.

"నువ్వే వెళ్ళు" చెప్పాడు ప్రకాష్. మందు మరో గ్లాసు గొంతులో పోసుకుని గదిలోకి వెళ్ళిపోయాడు రాజేష్.

ప్రకాష్‌కి డబ్బుకి కొనుక్కున్న ఆ శరీరం మీద మనసు పోవటంలేదు. డబ్బు వెదజల్లితే అటువంటి స్త్రీలు అంతకంటే అందగత్తెలే వస్తారు. కానీ విజయలాంటి స్త్రీలు ఎంత డబ్బు పోసినా దరిచేరరు. అలాంటి ఆడదానిని ఒక్కసారి పొందినా అది ఓ మధురానుభూతిగా మిగిలిపోతుంది. కానీ, కానీ ఎలా దారిలోకి తెచ్చుకోవాలో అర్థం కావటంలేదు. ప్రకాష్ ఆలోచిస్తూ గడుపుతున్నాడు. కొద్దిసేపటికి పక్కగది తలుపు తెరచుకుని రాజేష్ బయటకు వచ్చాడు.

"వెళ్తావా?" అన్నాడు రాజేష్.

"అలాగే" తలూపి ఆగదిలోకివెళ్ళాడు ప్రకాష్.

* * *

మర్నాడు ఆఫీసు గదిలో కూర్చుని ఫైల్స్ చూసుకుంటున్నాడు ప్రకాష్. తలుపు తెరుచుకుని గదిలోకి అడుగు పెట్టాడు రాజేష్.

"హలో రాజేష్! ఏమిటిలా వచ్చావు?" అడిగాడు ప్రకాష్.

"అప్పుడే మరచిపోయావా? రాత్రి చెప్పానుగా ఈరోజు మీ టైపిస్టుని ఓసారి చూసి ఆమె నీ వడిలో వాలే మార్గం గురించి చెబుతానని. అందుకే ఆమెను చూడాలని వచ్చాను".

"ఇప్పుడే పిలిపిస్తాను" అంటూనే బజర్ నొక్కాడు ప్రకాష్. ప్యూన్ లోపలికి వచ్చాడు.

"ఓసారి విజయగారిని రమ్మను" చెప్పాడు ప్రకాష్. ప్యూన్ వెళ్ళిపోయాడు. మరో నిముషం తర్వాత ఆ గదిలోకి అడుగుపెట్టింది విజయ.

"నిన్న కొన్ని కాగితాలు ఇచ్చాను. అవి పోస్ట్‌చేసేశారా?" అడిగాడు ప్రకాష్.

రాజేష్ ఆమెను పరిశీలనగా చూస్తున్నాడు. అది గమనించాడు ప్రకాష్.

"పంపేశాను సార్" చెప్పిందివిజయ.

"సరే... మీరు వెళ్ళొచ్చు" చెప్పాడు ప్రకాష్. ఆమె వెళ్ళిపోయింది.

"ఎక్స్‌లెంట్ ఫిగర్ గురూ! నీ సెలక్షన్ చాలా బాగుంది"

"సెలక్షన్ బాగుంది అని తెలుసు గానీ ఆమె నావరిచేరే మార్గమే తెలియటం లేదు"

"అందుకే మన పెద్దలు సామ భేద దాన దండోపాయాలు అని చెప్పి నాలుగు ఉపాయాలు చెప్పారు. మొదటి మూడు కాకుంటే నాలుగవది దండోపాయం ఉపయోగిద్దాం. యూ డోన్ట్ వర్రీ"

"అంటే..." అర్థంగాక అడిగాడు ప్రకాష్.

"రాత్రికి మూన్‌లైట్ బార్‌కి వచ్చెయ్యి. ఈలోపల దాన్ని గురించి ఆలోచించి రాత్రికి నీకు చెబుతాను"

"ఎలాగైనా విజయ నా వళ్ళో వాలేట్టు చూడు గురూ!"

"మనం కన్నేసి వదిలిన ఆడది ఇంతవరకూ లేదు బ్రదర్. ఎలాగైనా దాన్ని నీ సొంతంచేస్తాను" అభయ హస్తం ఇచ్చినట్టు అన్నాడు రాజేష్.

"థాంక్యూ" అన్నాడు ప్రకాష్.

"అయితే ఇక నేను వెళ్తాను. రాత్రికి బార్‌లో కలుసుకుందాం" వచ్చినంత వడిగానే వెళ్ళిపోయాడు రాజేష్.

ప్రకాష్ మళ్ళీ ఫైల్స్ చూడడం మొదలుపెట్టాడు. అయితే ఈసారి అతని మనసు ఆ ఫైల్స్‌మీద నిలువ లేదు. ఆలోచనల్లో పడిపోయింది.

* * *

బార్ చాలా సందడిగా ఉంది. ఒకరి ముఖం ఒకరికి కనిపించనంత చీకటిగా ఉంది. ఒకరి మాటలు ఒకరు పట్టించుకోనంత బిజీగా ఉంది. సర్వర్స్ అటూ ఇటూ తిరుగుతున్నారు.

ఓ టేబిల్ ముందు కూర్చుని తీవ్రంగా ఆలోచిస్తూ,చర్చించుకుంటున్నారు ప్రకాష్ రాజేష్‌లు.

"అంటే అది దేనికీ లొంగదంటావు" అన్నాడు రాజేష్.

"ఎట్టి పరిస్థితుల్లోనూ లొంగదు" చెప్పాడు ప్రకాష్.

"అయితే దాన్ని పెళ్ళిచేసుకో"

"ఆమె వేరెవరినో లవ్‌చేస్తోంది. నేను కోటీశ్వరుడినయినా ఆమె నన్ను పెళ్ళాడదు. ప్రేమించినవాడినే పెళ్ళాడుతుంది. ఇప్పుడు నా మార్కెట్ రేటు ఎంతో తెలుసా? ఆరు లక్షలు. దాన్ని కట్టుకుంటే ఆరువేలు కూడా రావు"

కాసేపు ఆలోచిస్తూ గడిపాడు రాజేష్.

"అన్నివిధాలా లొంగని ఆడదానికి ఒకటే శాస్తి"

"ఏమిటి?" ఆత్రతగా అడిగాడు ప్రకాష్.

"దండోపాయం"

"వాట్?" అదిరిపడ్డాడు ప్రకాష్.

"రేప్ అంటే అంతగా నువ్వు భయపడాల్సిన అవసరంలేదు. నువ్వు రేప్ చెయ్యగానే ఆమె పోలీస్ కేస్ పెడుతుందనీ, జైలుకి వెళ్లాలనీ, చెడ్డపేరు వస్తుందనీ నీకు బాధ అక్కరలేదు. ఎందుకంటే దేశంలో మనబోటి రేపిస్టులకి తోడ్పడేది అలా రేప్ చేయబడ్డ స్త్రీయే. ఆ ఆడది తనపై అత్యాచారం జరిగిందని ఎలాగూ చెప్పుకోలేదు. అలా చెప్పుకున్నట్లయితే పోలీసు రికార్డుల్లో వేలకువేలు మానభంగం కేసులు రిజిస్టర్ అయి ఉండేవి. అలా చెప్పకపోవడమే మనలాంటివారికి ఎంతో మేలు చేస్తోంది.

"ఒకవేళ ఆ ఆడది అలా చెప్పుకున్నా అది ఆమెకే ప్రమాదం. రేప్‌చేసిన మగాణ్ని ఈ సమాజం ఏమీ అనదు. కానీ రేప్‌చెయ్యబడ్డ ఆడది వీధిలోకి వస్తే అసహ్యకరమయిన చూపులతో, సూటిపోటి మాటలతో పొడుస్తారు. మరికొందరు జాలి కనబరుస్తారు. ఆ రెండూ తట్టుకోవడం కష్టం. అందుకే ఏ ఆడదీ తనపై అత్యాచారం జరిగిందని చెప్పుకోలేదు.

"ఆమె పోలీస్ కేస్ పెడితే....?" అనుమానంగా అడిగాడు.

"డోన్ట్ ఫియర్. ఈ సమాజంలాగే ఈ వ్యవస్థ కూడా మనకి సహాయపడుతుంది. డబ్బు పెడితే జరగని పనిలేదు. ఎన్నో రేప్‌కేసులు జరిగాయి కదా! మరి ఎన్ని కేసుల్లో మగాడికి శిక్షపడింది. ఏ కొద్ది మందికో మాత్రమే. మిగిలినవాటిల్లో డబ్బుకు చాలావరకూ మాసిపోయ్యాయి. అందులో అధికారమున్న నీలాంటివాడి కేసు అయితే అంతుకూడా ఉండదు"

"కానీ ఎందుకో...?"

"భయపడేట్లయితే ఆ పనిచెయ్యొద్దు. ఆమెమీద కోరిక చంపుకో...చాలు" తమాషాగా నవ్వుతూ అన్నాడు.

"అదికాదులే!సరేగానీ తోడుగా నువ్వు ఉంటావుగదా?"

"నాకూ ఉండాలనే ఉంది. అందమైన ఆ పిట్టను అనుభవించాలనే ఉంది. కానీ కొద్దిరోజుల్లో ఎలక్షన్లు వస్తున్నాయి. ఇప్పుడు ఏదయినా పొరపాటు జరిగితే నా పేరు బజార్నపడితే మా ఓట్లు పోతాయి. నాన్నకు ప్రాణంకన్నా ముఖ్యం అధికారం. అది లేకపోతే మేం బతకలేం"

"అయితే ఇప్పుడు నన్ను ఆ పని చెయ్యవద్దంటావు!" ఒక నిశ్చయానికి వచ్చినట్లు అన్నాడు ప్రకాష్.

బదులుగా నవ్వాడు రాజేష్.

"అది నేను చెప్పేదికాదు. వీలు చూసుకుని చెయ్యాల్సింది నువ్వు. ఎప్పుడు పరిస్థితులుఅనుకూలించితేఅప్పుడుచేసెయ్యి"

"ఎందుకో నాకు భయంగా ఉంది" అన్నాడు ప్రకాష్.

"తప్పుడు పనిచేసేప్పుడు భయంగానూ, మంచిపని చేసేప్పుడు థ్రిల్ ఫీలవడం మామూలే"

"ఎటువంటి ఇబ్బందులూ ఎదురవకుండా నా కోరిక తీరినట్లయితే, నీకు ఓ గ్రాండ్‌పార్టీ అరేంజ్ చేస్తాను"

"నాకు అటువంటి ఆశలేం పెట్టనవసరం లేదు. నీ కోరిక తీరేందుకు నేను చేయగలిగింది చేస్తాను"

సర్వర్ బిల్ తెచ్చిపెట్టాడు. వందరూపాయల నోటు ప్లేట్‌లో వేసాడు ప్రకాష్.

"ఇక వెళ్దామా?" లేచాడు రాజేష్. ప్రకాష్ కూడా లేచాడు.బయటకు నడుస్తూ అన్నాడు ప్రకాష్-

"సమయం చూసి, నువ్వు చెప్పిన పద్ధతిలో సర్దుకుంటాను"

"అది నీ ఇష్టం. నీకున్న అవకాశాల్ని బట్టి ఉంటుంది"

"కోరికయితే తీవ్రంగానే ఉంది. కాని మనసులో ఏ మూలనో కొద్దిభయంవుంది. అంతే!" అన్నాడు ప్రకాష్.

"అందాన్ని పొందాలంటే కొంత సాహసం చెయ్యక తప్పదు బ్రదర్! రిస్కు తీసుకున్నప్పుడే ఆనందం పొందగలము"

అవునన్నట్టు తల పూపాడు ప్రకాష్. ఇద్దరూ బయటకు చేరుకున్నారు. కారు స్టార్ట్‌చేస్తూ అన్నాడు రాజేష్-

"విష్ యూ బెస్టాఫ్ లక్"

* * *

సాయంత్రం ఇంటికి వెళుతూ దారిలో రమణ రూముకి వచ్చింది విజయ. ఆమె వచ్చేప్పటికి కాగితాలు ముందేసుకుని ఏదో ఆలోచిస్తూ కూర్చుని ఉన్నాడు రమణ.

"హలో" అందామె.

"హలో... ఏమిటి ఒక్కరే వచ్చినట్టు వున్నారే?"

"అంటే ఇంకా ఎవరు రావాలని"

"అదే! తోడుగా వర్షాన్ని తీసుకొచ్చుకో లేదా అని"

ఫక్కున నవ్వింది దామె. "మీరు భలే జోక్ చేస్తారే" అంది.

"కూర్చోండి" అన్నాడతను.

కూర్చుని "ఏదో రాస్తున్నట్టున్నారు?" అడిగిందామె.

"ఏమీలేదు'' నవ్వేశాడు.

"ఇదొక్కటే మీలో నాకు నచ్చనిది. ప్రతి ఒక్కటీ దాచిపెట్టుకుంటారు. ఎవ్వరికీ ఏదీ చెప్పరు" చిరుకోపంగా అడిగిందామె.

"ఏమీ లేదండి... నవలో, కథో రాయాలని కాగితాలు తెచ్చాను. కానీ

నిన్నటి నుండి ఒక్క అక్షరం ముక్క కూతా పేపర్ మీద పెట్టలేకపోతున్నాను" చెప్పాడు అతడు.

"ఎందుకని"

"కొత్తగా కలం పట్టుకున్నప్పుడు భయంవేస్తుంది. కలం ముందుకు కదలదు. ప్రతి అక్షరం ఆలోచించి మరీ రాయాలి. అలాగే రాస్తూవుంటే కొద్దికాలానికి అలవాటవుతుంది. తర్వాత తసకంటూ ఓ శైలి ఏర్పడుతుంది. అంతేకాకుండా ప్రారంభం అందంగా, కొత్త తరహాగా వర్ణిస్తూ రాయాలని ఆలోచిస్తున్నాను. కానీ మనసులోని భావాలు పదాల రూపంలో పెట్టబోతే సాధ్యం కావడం లేదు"

"ఇంతకీ థీమ్ ఏమిటి?"

"అందమైస ఓ అమ్మాయి! ఎక్కడో దూరంగా ఉందామె. ఇక్కడ ఓ ప్రేమి





కుడు! ఒకరికోసం ఒకరు పరితపిస్తూ ఉంటారు. ఆమెను కలవాలని అతడు ప్రయత్నిస్తూ ఉంటాడు. కొద్దికాలానికి అతడికి తెలుస్తుంది- ఆమెకు పెళ్లయిపోయిందని. అతడికి బాధేస్తుంది. ఇది ఓ ప్రేమకథ"

"మరి ఎలా ముగించాలనుకుంటు

న్నారు?" ఏదో జ్ఞప్తికి రాగా అందామె.

''ముగింపును గురించే ఇంతవరకూ ఒక సరయిన నిర్ణయానికి రాలేకపోతున్నాను. ఆ భగ్న హృదయుడి ప్రేమ ఎలా ముగించాలో అర్థంకావడం లేదు. కానీ కథకు ముగింపు ముఖ్యం. ఆలీస్ వెల్ దట్ ఎండ్స్ వెల్" అన్నాడు రమణ.

"అయితే రచయిత కాబోతున్నారన్నమాట"

"ఇల్లు అలుకగానే పండగయినట్టు కాదుగా" నవ్వేశాడు రమణ.

"మీ దగ్గర పుస్తకం తీసుకెళ్దామని వచ్చాను" చెప్పిందామె.

"అలాగే ! ఆ కిటికీలో ఉన్నాయి. మీకు నచ్చిన పుస్తకం తీసుకోండి" చెప్పాడు రమణ.

ఆమె పుస్తకాలు చూస్తోంది. ఎన్నో పుస్తకాలు ! అన్నీ మంచి పుస్తకాలే విజ్ఞాన సర్వస్వాలే. ఎందరో ప్రముఖ రచయితలవే. ఒకొక్క పుస్తకం చేతిలోకి తీసుకొని తిరగేస్తోంది.

"మీ దగ్గర చాలా పుస్తకాలు ఉన్నాయే" అందామె.

నవ్వి ఊరుకున్నాడు రమణ.

''ఠాగూర్ కథలు బాగుంటాయా?"

"అడగాల్సిన ప్రశ్న కాదది. ఆయన కథలు ప్రపంచ ప్రఖ్యాతి చెందినవి. తప్పక చదవాల్సిన కథలు. వాటిల్లో ప్రతికథా ఓ ఆణిముత్యం వాటిల్లో కొన్ని నాకు మరీ చాలా నచ్చాయి. పోస్టుమెన్, కాబూలీవాలా, ఒకరాత్రి ఇవన్నీ ఆణిముత్యాల్లాంటి కథలే''

''అయితే ఈరోజు ఈ పుస్తకం తీసుకెళతాను. రేపు ఆదివారం కదూ!



అయితే సోమవారం ఆఫీసుకి వెళ్ళేప్పుడు మీకు ఈ పుస్తకం తెచ్చిచ్చి వెళతాను. అన్నట్టు మర్చేపోయాను. ఆరోజు నా పుట్టినరోజు కూడా"

"అలాగా!అయితే ముందుగానే పుట్టినరోజు శుభాకాంక్షలు అందజేస్తున్నాను" అన్నాడు రమణ.

"థాంక్యూ" అన్నది విజయ.

"మీ పుట్టినరోజు విషయం మోహన్‌కి తెలుసా?" అడిగాడు.

"లేదు. మోహన్‌కు రేపు చెబుతాను" పొద్దుపోతోంది... వస్తాను"

వెళ్ళిపోయిందామె.

* * *

"ఏ పిక్చర్‌కెళ్దాం?" అడిగాడు మోహన్.

"నీ ఇష్టం వచ్చిన సినిమాకెళ్దాం'' చెప్పింది విజయ.

ఓ థియేటర్ ముందు స్కూటర్ ఆపాడు మోహన్. ఇంగ్లీషు సినిమా ఆడుతోంది అక్కడ.

టిక్కెట్లు తీసుకుని హాలులోకి నడిచారు. ఇంకా స్టార్ట్ కాలేదు.

"మోహన్! రేపు నా పుట్టినరోజు" చెప్పింది విజయ.

''రియల్లీ... రేపుపుట్టబోయేపాపాయికి జన్మదిన శుభాకాంక్షలు. అయితే రేపు నీకు పార్టీ చేస్తాను. ఆఫీసు వదలగానే నవీన్ రెస్టారెంట్‌కి వచ్చెయ్యి. ఇద్దరం కాసేపు కూర్చొని మాట్లాడుకుందాం"

''అలాగే" తలూపింది విజయ.

పిక్చర్ స్టార్ట్ అయింది. జంతువుల గురించి చూపించే సినిమా అది జంతువులు. ఎలా వేటాడుతాయో, వాటి జీవన విధానం ఎలా ఉంటుందో చూపిస్తున్నారు.

సినిమా పూర్తయింది.

స్కూటర్ స్టార్ట్ చేసి విజయ ఇంటి వైపు పోనిచ్చాడు. ఆమెను వీధి చివర్న వదులుతూ అన్నాడు– "రేపు తప్పక నవీన్ రెస్టారెంట్‌కి వస్తావు కదూ!''

"ఎట్టిపరిస్థితుల్లోనూ అయిదున్నరకల్లా అక్కడ ఉంటాను" చెప్పింది విజయ.

"నీకోసం వెయిట్ చేస్తుంటాను" స్కూటర్ రివర్స్ చేసి అన్నాడు.

"అలాగే" చెయ్యి ఊపివెళ్ళిపోయింది ఆమె.

* * *

ఆఫీసుకు వెళ్లేందుకు తయారయి అన్నం వడ్డించుకుని తింటున్నాడు రమణ.

"ఆఫీసుకు వెళుతున్నారా?" లోనికి అడుగుపెడుతూ అన్నది విజయ.

"అవునండీ! ఈరోజు మీ పుట్టిన రోజు కదూ!"

"అందుకే స్వీట్ ఇచ్చి వెళ్దామని వచ్చాను" టిఫిన్ బాక్స్‌లోని స్వీట్ తీసి అతని చేతికిచ్చింది.

"హేపీ బర్త్‌డే టూ యూ" స్వీట్ కొరుకుతూ అన్నాడు రమణ.

"థాంక్స్" అన్నదామె.

"పుట్టినరోజు కూడా ఆఫీసుకు వెళ్ళక పోతేనేం" అడిగాడు.

"అది ప్రైవేట్ కంపెనీకదా! ఎక్కువగా సెలవులు ఇవ్వరు"

చేతులు కడుక్కుంటున్నాడు రమణ.

"నేనొస్తానండీ! ఆఫీసుకు టైమయింది. మీ పుస్తకం ఇదుగో"

పుస్తకం కిటికీలో పెట్టి కదిలింది. నేరుగా ఆఫీసుకు వెళ్ళిందామె.

ఆఫీసులో ఆమెకు మిత్రులంటూ ఎవరూ లేరు. టిఫిన్‌బాక్స్ పక్కనపెట్టి తన సీట్లో కూర్చుందామె. క్రితంరోజు మిగిలిన కాగితాలు ముందేసుకుని టైపు చేయడం మొదలుపెట్టింది. ఓ గంట తర్వాత పిలుపు వచ్చింది. లోనికి వెళ్ళిందామె.

ఏవో ఫైల్స్ చూసుకుంటున్న ప్రకాష్ తలెత్తి చూశాడు. ఎదురుగా ఉన్న అందాన్ని చూసి ఒక్కక్షణం అతడి గుండె ఆగింది. సాక్షాత్తు తన ఎదురుగా అజంతా శిల్పంలా నిల్చుని ఉంది విజయ. పసుపుపచ్చని శరీరచ్ఛాయ. తల స్నానం చేసి ఉండటంతో నల్లని కురులు ముఖం మీదపడి అల్లరిచేస్తున్నాయి. తిరిగి చూడాలనుకునే అందం కాదామెది. ఎప్పటికీ అలాగే చూస్తూవుండిపోవాలనే సౌందర్యం ఆమెది. ఈ రోజెందుకో ఆ అందం రెట్టింపయినట్లుంది. రెప్ప వాల్చకుండా ఆమెనే చూస్తున్నాడు ప్రకాష్.

"పిలిచారా సార్" అడిగింది విజయ.

"కవర్స్ మీద ఈ అడ్రసులను టైప్‌చేసి ఈ కాగితాలు వాళ్ళకి పోస్టులో పంపించండి" చెప్పాడు ప్రకాష్.

"అలాగే సర్" తలూపి కాగితాలు అందుకుని వెళ్ళిపోయింది.

అందమైన ఆడదానికి ఈ దేశంలో ప్రతిక్షణం గండమే. ఏ క్షణాన ఎదుటి వాడికి ఎలాంటి బుద్ధి పుడుతుందో చెప్పలేం. అందులో అధికారం, డబ్బు స్వైరవిహారంచేస్తూ, చట్టానికి కూడా కళ్ళు కప్పేడుతూ ఏంచేసినా తప్పించుకో వచ్చునన్న ధీమాతో మగాడు తన కోరికకు కళ్ళెం వెయ్యాలనుకోడు. వీలయినంతవరకూ అనుభవించాలనే అనుకుంటాడు.

అంతకాలం తటపటాయిస్తున్న ప్రకాష్‌కి ఆ క్షణమే కోరిక బలంగా నాటుకుపోయింది. ఇక ఆగలేదతను.

ఈరోజు ఎలాగైనా ఆమెను అనుభవించాలి. ఎలా? ఎలా?? ఎలా??? అతని మస్తిష్కం వేగంగా ఆలోచించసాగింది.

మధ్యాహ్నం అయింది. అతడికి కారియర్ వచ్చింది. ఆఫీసు గదికి పక్కనే అనుకుని ఉన్న పర్సనల్ రూంలోకి వెళ్ళి భోంచేశాడు. అప్పటికే అతడి ఆలోచనలు స్థిరరూపం దాల్చుకుని ఉన్నాయి. కాసేపు ఆ గదిలో మంచంమీద పడుకుని చెయ్యబోయే పని గురించి ఆలోచించాడు. పళ్ళు వేడెక్కింది.

ఆఫీసు గదిలోకి వచ్చి ఫైల్స్ ముందేసుకుని కూర్చున్నాడు. కానీ వాటి మీద మనసు నిలపడంలేదు. కాలం ఎలా గడుస్తోందో అర్థంకావడంలేదు.

అయిదున్నర అయింది. ఆమె వెళ్ళేందుకు తయారవుతున్నట్టుంది. బజర్ నొక్కి ప్యూన్‌ని పిలిచాడు.

"విజయగారిని పిలువు" చెప్పాడు. కాసేపటికి ఆమె వచ్చింది.

"చూడండీ! ఇంకో గంటసేపు ఉండాలి. కొద్దిగా వర్క్ మిగిలివుంది" అన్నాడు ప్రకాష్.

ఆమె గుండె గుభేలుమంది. అయిదున్నర నుండి మోహన్ సఫిన్ రెస్టారెంట్‌లో తనకోసం వెయిట్ చేస్తుంటాడు.

"సార్! ఈరోజు నాకు కొద్దిగా పని ఉంది" ధైర్యంచేసి అన్నది.

"బట్ ఇది చాలా ఇంపార్టెంట్! రేపు ఉదయం టెండర్ వెయ్యాలి. రేపు పది గంటలకు టైము అయిపోతుంది...ప్లీజ్" రిక్వెస్ట్‌గా అడిగాడు అతడు.

ఒక్క క్షణం తటపటాయించిందామె. తర్వాత విధిలేక ఒప్పుకుంటున్నట్టు అంది "అలాగే సార్"

కొన్ని కాగితాలు ఆమెకు అందించాడు అతడు. వచ్చి నిస్సత్తువగా టైప్‌మిషన్ ముందు కూర్చుంది. చేతిలోని కాగితాలు ఏవో కూడా గమనించకుండా టైప్ చేయసాగింది.

ప్యూన్‌ని పిలిచాడు ప్రకాష్.

"చూడూ... ఈరోజు ఇంకొక రెండు గంటలు ఆఫీసు ఉంటుంది. నువ్వు వెళ్ళదలచుకుంటే వెళ్ళిపో"

"ఏదైనా అవసరం అయితే..." తొందరగా వెళ్ళాలన్న ఉద్దేశం మనసులో ఉన్నా అన్నాడతను.

"నేను చూసుకుంటాను. ఫ్లాస్క్‌లో కాఫీ తెచ్చిపెట్టి వెళ్ళు"

"అలాగే సర్" అన్నదే తడవుగా వెళ్ళి కాఫీ తెచ్చి, అక్కడ పెట్టి వెళ్ళిపోయాడు.

వర్షాకాలం కావడంతో ఆరు గంటలకే చీకట్లు ముసురుకుంటున్నాయి. ప్రకాష్ బజర్ నొక్కి లోపలికి పిలిచాడు విజయను. లోపలికి వచ్చిందామె.

ఆ గదిలో లేడతను. ఆమెకు తెలుసు పక్కనే ఉన్న పర్సనల్ రూంలో ఉంటాడని.

"విజయగారూ! ఇలా రండి" ఏదో పని ఉన్నట్లు పక్కగదిలో నుండి పిలిచాడు ప్రకాష్.

ఒక్క క్షణం తటపటాయించింది. ఆ గదిలోకి అంతకుముందు ఎప్పుడూ అడుగు పెట్టలేదు. మనసు హెచ్చరిస్తున్నా మర్యాదకోసం లోనికి అడుగుపెట్టింది. టక్కున తలుపు మూసుకుపోయింది. భీత హరిణేక్షణై గిరుక్కున వెనుదిరిగింది. ఎదురుగా నవ్వుతున్నాడు ప్రకాష్. అతడు నవ్వుతుంటే శరీరం మీద తేళ్ళు, జెర్రెలు పాకాడినట్లు ఫీలయ్యింది. ధైర్యం దిగజారిపోయింది. కానీ వెంటనే ధైర్యం




కూడగట్టుకొని అడిగింది.

"ఏమిటిది?"

"ఏమీలేదు. ఒక్కసారి ... కేవలం ఒక్కసారి నువ్వు నాకు కావాలి. ఒప్పుకుని సహకరిస్తే నీకూ, నాకూ సుఖంగా ఉంటుంది"

"నువ్వు ఇంతటివాడివనుకోలేదు. మర్యాదగా నన్ను బయటకు పంపించు" అరిచినట్టుగా అంది విజయ.

"అలాగే...పంపిస్తాను. కానీ నా కోరిక తీరిన తర్వాతనే. అందుకు నువ్వు ఒప్పుకుంటే తేలిగ్గా పోతావు. ఒప్పుకోక పోతే బలవంతంచెయ్యాల్సి ఉంటుంది"

"మిస్టర్ ప్రకాష్! నేను చచ్చినా నీకు లొంగను"

ఇక మాటలతో లాభంలేదనుకున్నాడు అతడు. ఒక్క ఊపుతో ఆమెను సమీపించి గట్టిగా పట్టుకున్నాడు. కుష్టు వ్యాధి ఉన్న వ్యక్తి తనను పట్టుకున్నట్టు గట్టిగా విదిలించి కొట్టింది. అయినా అతను వదల్లేదు.

"వొదులు ప్లీజ్...నన్నొదులు...నీకు దణ్ణంపెడతాను ప్రకాష్.నన్ను విడిచిపెట్టు. నీకు పుణ్యం ఉంటుంది..నన్నొదిలిపెట్టు" ఏడుస్తూ, అతని పట్టు నుండి విడిపించు కోవాలని ప్రయత్నిస్తూ అన్నదామె.

అతడు తన ప్రయత్నం మీద తను ఉన్నాడు తప్ప ఆమె మాటలు వినిపించు కోలేదు.

మెడమీద చేతులు వేసి వెనక్కు నెట్టింది. వెనక్కు పడ్డాడతను. అలా పడటంలో ఆమె చీర అతని చేతికి చిక్కింది. కచ్చిగా చీరను లాగి విసిరేశాడు. పరుగున వెళ్ళి ఆమె జాకెట్ మీద చెయ్యివేసి సర్రున లాగాడు. పర్రున చిరిగిపోయింది. బ్రా తెగిపోయింది. చిరిగిన జాకెట్ లోనుండి బయటపడిన అందాలు చూసి పిచ్చెక్కిపోయాడు.

అతడు ఆ క్షణం మానవుడుగా ప్రవర్తించలేదు....దానవుడయిపోయాడు.

గోడకు గాంధీగారి ఫొటో వేలాడుతూ ఉంది. ఏనాడైతే ఆడది అర్ధరాత్రికూడా ఒంటరిగా నడివీధిలో పోగలుగుతుందో ఆనాడే ఈ దేశానికి నిజమైన స్వాతంత్ర్యం వచ్చినట్టు అన్న గాంధీగారు, ఈ దేశానికి అలాంటి నిజమైన స్వాతంత్ర్యం ఎప్పుడొస్తుందా అని ఆలోచిస్తూకాబోలు గట్టిగా కళ్లు మూసుకున్నాడు.




నవీన్ రెస్టారెంట్ లో కూర్చుని టైము చూసుకున్నాడు మోహన్. ఆరున్నర అయింది. ద్వారం వైపు చూశాడు. అతడు అలా చూడటం వందోసారి. అతడికి నిరాశగా ఉంది. విజయ తననిలా ఎన్నడూ బాధపెట్టలేదే. వస్తానన్న టైముకు సరిగా వచ్చేది. ఈరోజు ఏమైంది? అందులోనూ బర్త్ డే! ఈరోజు తన పార్టీకి వస్తానని చెప్పి ఇలా చేసిందేమిటి? అతడు వెళ్ళిపోవాలనుకున్నాడు. కానీ బర్త్ డేరోజు! కనీసం గుడ్ విషెస్ చెప్పకుండా వెళ్ళాలని లేదు. మరికాసేపు రెస్టారెంట్ లో కూర్చున్నాడు. అక్కడ మనసు నిలవలేదు. రెస్టారెంట్ బయటకు

వచ్చాడు. ఒకవేళ ఆమె ఇంటికివెళ్ళి ఉంటుందా? స్కూటర్ స్టార్ట్‌చేసి ఆమె ఇంటివైపు పోనిచ్చాడు. స్కూటర్ ఆపి లోపలికి నడిచాడు.

''విజయ రాలేదా?'' అడిగాడు మోహన్.

''ఇంకా రాలేదు బాబూ!'' శారదమ్మ చెప్పింది. ఇంట్లో ఎవరూ లేరు. అతడు ఆ ఇంటికి కాబోయే అల్లుడని ఆమెకు తెలుసు. అందుకే అంది—

"ఉండు బాబూ! కాఫీ తాగి వెళుదువు గాని"

ఇష్టం లేకపోయినా కాఫీతాగి స్కూటర్ స్టార్ట్ చేశాడు.

విజయ ఎక్కడికి వెళ్ళి ఉంటుంది? తను ఇటు వచ్చిన తర్వాత నవీన్ రెస్టారెంట్ కి వెళ్ళి తన కోసం ఏమైనా ఎదురు చూస్తోందేమో! స్కూటర్‌ని రెస్టారెంట్ వైపు పోనిచ్చాడు.

స్కూటర్ పార్క్ చేసి లోనికి వెళ్ళి చూశాడు.... లేదామె. ఎక్కడికి వెళ్ళి ఉంటుంది? ఒకవేళ ఆఫీసులో ఏదైనా బిజీ వర్క్ ఉందేమో! ఆలోచించి స్కూటర్‌ని ఆవైపు కదిలించాడు మోహన్. అప్పటికి సమయం ఏడు కావస్తోంది.

* * *

"విజయా ! జరిగిందెలాగూ జరిగి పోయింది. గుట్టు చప్పుడు కాకుండా ఉంటే నీకే మంచిది. ఎందుకంటేనేనెలాగూ మగవాణ్ని. రేపు లోకం నన్నేమీ చెయ్యలేదు. ఇది తెలిస్తే నిన్ను అస హ్యించుకుంటారు. శీలం పోయిన ఆడది అని అంటారు. తర్వాత నీ ఇష్టం"

అతడివైపు ఒక్కసారి చూసి, తుపుక్కున అతడి ముఖం మీద ఉమ్మింది.





ఒక్కక్షణం బిత్తరపోయి, వెంటనే నవ్వి తుడుచుకున్నాడు.

"ఇంకా నీ పొగరు అణగలేదు"

సిగరెట్ వెలిగించాడు అతడు. తలుపు తీసుకుని బయటకు వచ్చింది ఆమె. ఆఫీసు అంతా ఓ నరకంలా కని పించింది. అందులో తన శీలం దోచుకో బడింది. అక్కడినుండి వేగంగా గేటు దగ్గరకు పరుగెత్తింది. వీధికి చేరుకుంది. ఎలా వెళ్తోందో ఆమెకే తెలియదు. అసలు నడుస్తోందో లేక తేలిపోతోందో ఆమెకే అర్థం కావటంలేదు. నడుస్తున్న ఆమెను రెండు చేతులు పట్టుకోవడంతో ఉలిక్కి పడి తేరుకుంది.

"ఎన్నిమార్లు నిన్ను పిలవాలి విజయా!" అంటూ ఆమెను ముందుకు తిప్పుకున్న మోహన్ ఉలిక్కిపడ్డాడు.

"ఏమైంది విజయా...ఏమైంది?" ఆమె ఆకారం చూసి ఆతృతగా అడిగాడు. ఆమె బొట్టు చెదిరిపోయి ఉంది. జుట్టు చెరిగిపోయి ఉంది. రవిక పీలికలై ఉంది. కొంగుతో దాన్ని కప్పెట్టుకుని ఉందామె.

"ఏమైంది... విజయా ఏమైంది?"

"ప్రకాష్ నన్ను పాడుచేశాడు. నా సర్వస్వం దోచుకున్నాడు" అంతవరకూ దాచుకున్న దుఃఖం ఒక్కసారి పెల్లుబికి వచ్చేసింది. అతని ఎదమీద వాలి భోరున ఏడవసాగింది.

ఒక్క క్షణం ఆశ్చర్యపోయాడు మోహన్. వెంటనే అతని పిడికిలి బిగుసు కుంది.

"ఇది... ఇదెలా జరిగింది?" కోపం బిగపట్టుకుని అడిగాడు.

"ఇంకా సేపు పని ఉందని చెప్పి నన్ను ఉంచేసి అందర్నీ పంపేసి బలత్కారం చేశాడు" వెక్కుతూ చెప్పిందివిజయ.

"సరే..నువ్వు ఇంటికి వెళ్లు" దూరంగా వెళ్తున్న ఆటోని పిలిచాడు.

"మరి నువ్వు?" అడిగింది విజయ.

"కాసేపట్లో వస్తాను... నువ్వెళ్ళు" ఆమెను ఆటో ఎక్కించాడు.

ఆటో వెళ్ళిపోయింది.

దూరంగా ఆపి ఉన్న స్కూటర్‌ని స్టార్ట్ చేసి ఆఫీసువైపు పోనిచ్చాడు. అతడి గుండె ఆవేశంతో ఎగిరిపడుతోంది.

స్కూటర్ ఆపి లోనికి వెళ్ళాడు. కుర్చీలో కూర్చుని సిగరెట్ తాగుతూ ఉన్నాడు ప్రకాష్. మోహన్‌ని చూసి ఒక్క క్షణం భయపడ్డాడు. వేగంగావచ్చి ప్రకాష్ కాలర్ పట్టుకున్నాడు మోహన్.

"బాస్టర్డ్! ఆడదాన్ని చెరుస్తావట్రా. నువ్వు మనిషివా పశువ్వా" ప్రకాష్ ఆ చెంపా ఈ చెంపా వాయించేశాడు కాసేపటికి తేరుకున్నాడు ప్రకాష్. మోహన్‌ని విదిలించి దూరంగా తోసేశాడు. మోహన్ కన్నా బలంగా ఉన్నాడు తను. మోహన్ దగ్గరకు వెళ్ళి అతన్ని కిందికి తోసి అతడి గుండెలమీద కాలువేసి ఆ చెంపా, ఈ చెంపా వాయించేశాడు.

"ఏరా! నన్నే కొడతావా. అవును... ఆ [illegible] నేను రేప్ చేశాను. నువ్వు దిక్కున్నచోటుకు వెళ్లు" అతన్ని పైకి లేపి నెట్టాడు ప్రకాష్.

పైకిలేచి మళ్ళీ ప్రకాష్ మీదికి పరుగెత్తాడు మోహన్. ఈసారి పిడికిలి బిగించి మోహన్ గెడ్డంకింద కొట్టాడు ప్రకాష్. దూరంగా పడ్డాడు మోహన్.

"ఇంకాసేపు ఇక్కడ ఉంటే నీ ప్రాణాలు దక్కవు. వెళ్ళి నీకు ఇష్టమయినది చేసుకోపో" అన్నాడు ప్రకాష్.

ఎగిరిపడే ఆవేశాన్ని మనసులోనే అణచుకుని పైకిలేచాడు.

"నీ అంతు చూస్తాన్రా.... పోలీస్ కేస్ పెట్టి నిన్ను జైలుకు పంపిస్తాను" అరిచాడు మోహన్.

"అలాగే చేసుకోపో" నిర్లక్ష్యంగా అన్నాడు ప్రకాష్.

కోపంతో తలుపును బలంగా తన్ని బయటకు నడిచాడు మోహన్. కొద్దిసేపటికి అతడి స్కూటర్ స్టార్ట్ అయిన శబ్దం వినిపించింది.

వెళ్తున్న మోహన్‌ని ఒక్కసారి చూసి ఫోన్ పైకెత్తి నంబర్ డయల్ చేశాడు. అవతల ఫోన్ ఎత్తుకున్న చప్పుడయింది.

"హలో" అన్నాడు ప్రకాష్.

"హలో...రాజేష్ స్పీకింగ్" అవతలి గొంతు పలికింది.

"హలో రాజేష్! నేను... ప్రకాష్‌ని మాట్లాడుతున్నాను"

"హలో ప్రకాష్! ఏమిటి విశేషం?" అడిగాడు రాజేష్.

"నేను... నేను... మనం అనుకున్నట్టు విజయ పని పూర్తిచేసేశాను" కంగారుగా అన్నాడు ప్రకాష్.

"వెరీగుడ్! అనుకున్నది సాధించావన్నమాట. అయితే ఇంకేం"

"అదికాదు...దాని లవర్ నా దగ్గరకు వచ్చి నా మీద పోలీస్‌కేస్ పెడతానని గలాభాచేసి వెళ్ళాడు"

"ఓహో... దాన్ని గురించా! దాన్ని గురించి నువ్వేం భయపడవద్దు. అది నేను చూసుకుంటాను. ఆ ఏరియా పోలీస్ స్టేషన్‌కి నేను ఫోన్‌చేసి చెబుతాను. ఇంతకీ ఆ పిల్లతో రంజుగా ఉందా?"

"ఆ అర్ధగంటా బాగానే ఉంది. కానీ ఇప్పుడే కాస్త భయంగా ఉంది. అది మరీ వాడు వచ్చిన తర్వాతనే"



"అలాంటి భయాలేం పెట్టుకోకు. కోర్టు, పోలీస్‌స్టేషన్ అన్నీ మనవే. నీకు అంతగా భయంగావుంటే మన ఇంటికి వచ్చెయ్యి"

"నేనూ అక్కడికే రావాలనుకుంటున్నాను"

"అలాగే వచ్చెయ్యి. నేను ఉంటాను"

ఫోన్ పెట్టేసిన శబ్దం అయింది. తనూ ఫోన్ పెట్టేశాడు ప్రకాష్.

తర్వాత నిశ్చింతగా కుర్చీలో కూర్చు

న్నాడు. కానీ ఏదో మూల అతనికి భయం తీసిపోలేదు. సిగరెట్ వెలిగించాడు. రేప్ చేసేప్పుడున్న ఆవేశం ఇప్పుడతడిలో లేదు. ఇప్పుడు ఆలోచిస్తున్నాడు. ఆ ఆలోచించేది జరగబోయే పరిస్థితులను ఎలా ఎదుర్కోవాలా అని.

కొద్దిసేపు తర్వాత లేచి ఆఫీసుకు తాళంవేశాడు. కారు స్టార్టుచేసి రాజేష్ ఇంటివైపు తిప్పాడు.

* * *

గుండెల్ని పిండేస్తోంది మంట. వాణ్ని చంపెయ్యాలి. వాణ్ని ఎలాగైనా జైలుపాలు చెయ్యాలి. విజయ శీలం దోచుకున్న వాణ్ని ఊరికే వదలకూడదు. వాడికి తగిన శిక్ష పడాలి.



స్కూటర్‌ని పోలీస్ స్టేషన్ ముందు ఆపాడు మోహన్. యస్. ఐ. తన సీట్లోనే ఉన్నాడు. ఫోన్‌లో ఎవరితోనో మాట్లాడుతున్నాడు. మాట్లాడేది ఈ విషయం గురించే, అని మోహన్‌కి తెలియదు.

ఫోన్ పెట్టేశాడు యస్. ఐ. లోపలికి వస్తున్న మోహన్‌ని చూసి ఏమిటన్నట్లు చూశాడు.

"ఈ ఏరియాలో ఓ రేప్ జరిగింది" చెప్పాడు మోహన్.

"ఎక్కడ?" అడిగాడు యస్. ఐ.

"ద్వారకా ఫాక్టరీ ఆఫీసులో"

"రేప్ చేసింది ఎవరు?"

"కంపెనీ యమ్. డి. రేప్ చెయ్యబడింది ఆ కంపెనీలో పనిచేసే విజయ అనే అమ్మాయి"

"ఆమె మీకు ఏమవుతుంది?"

ఒక్కక్షణం తడబడ్డాడు. "ఆమె నా స్నేహితురాలు"

"ముందు ఆ ప్రదేశాన్ని చూద్దాం పదండి" పైకి లేచాడు యస్. ఐ.

స్కూటర్ స్టార్ట్ చేశాడు మోహన్. యస్. ఐ. బైక్ స్టార్ట్ చేశాడు. ఓ పోలీసు వెనక ఎక్కాడు.

స్కూటర్‌ని ఆఫీసు ముందు ఆపాడు మోహన్. ఎదురుగా చూసి ఉలిక్కిపడ్డాడు. ఆఫీసుకు తాళం వేసి ఉంది.

"ఆఫీసు క్లోజ్ చేసి ఉందే"

మౌనంగా తల వూపాడు మోహన్. కాసేపు తర్వాత అన్నాడు యస్. ఐ.

"ఆమె అడ్రసు ఇవ్వండి. రేపు ఉదయం ఎంక్వయిరీ చేస్తాను"

అడ్రసు చెప్పాడు మోహన్.

"మీరు వెళ్ళండి. రేపు ఉదయం ఆమె ఇంటికి వచ్చేయండి"

బైక్ స్టార్ట్ చేసుకుని వెళ్ళిపోయాడు యస్. ఐ.

మోహన్‌కు తల తిరుగుతున్నట్లుగా ఉంది. ఇంటికి వెళ్ళాలనిపించటం లేదు. స్కూటర్‌ని రమణ ఇంటివైపు తిప్పాడు.

స్కూటర్‌ని రూమ్ ముందు ఆపి గదిలోకెళ్ళి మంచంమీద వాలిపోయాడు.

పాలిపోయిన ముఖంతో, సర్వం కోల్పోయినవ్యక్తిలా వచ్చిపడ్డ మోహన్‌ని చూసి ఉలిక్కిపడ్డాడు రమణ.

"ఏమిటి మోహన్? ఏమిటిలా ఉన్నావు?" ఆతృతగా అడిగాడు.

"విజయను రేప్ చేశారు రమణా! ఆమె ఫాక్టరీ ప్రొప్రయిటరే ఆమెను రేప్ చేశాడు" ఎక్కడో నూతిలోనుండి వస్తున్నట్టున్నాయి మోహన్ మాటలు.

అదిరిపోయాడు రమణ. ఉదయం తనకు స్వీట్ ఇచ్చిన విజయ అతడి కళ్ళముందు కదలాడింది. 'అంత మంచి స్త్రీకి ఇంత పెద్ద శిక్షా?' మనసులోనే అనుకున్నాడు. వెంటనే ఆమె భవిష్యత్తు కూడా అతడి కళ్ళముందు కదలాడింది.

"ఈ విషయం ఎవరికైనా తెలుసా?" వెంటనే అన్నాడు రమణ.

"మా ఇద్దరికే తెలుసు. ఇంతకుముందే పోలీస్ స్టేషన్‌లో రిపోర్టు ఇచ్చి వస్తున్నాను" చెప్పాడు మోహన్.

"పోలీసు రిపోర్టు ఇచ్చావా! పెద్ద పొరపాటు చేసేశావు మోహన్. అయినా జరిగిపోయిన పొరపాటుని మనసులో దాచుకుని ఉంటే బాగుండేది"

"అంటే ఆ బాస్టర్డ్‌ని పోలీసులకు పట్టిచ్చి, జైలులో పెట్టించడం తప్పంటావా?" ఆశ్చర్యంగా అడిగాడు మోహన్.

"పోలీసులు, కోర్టు, న్యాయం అను




కుంటున్నావా? అలా అయితే పొరపాటు పడ్డావు. ఎందుకంటే– ఈ వ్యవస్థలో అవన్నీ డబ్బుకు లొంగిపోతాయి. వాడు శిక్షపడకుండా తప్పించుకోగలడు. వాణ్ని ఈ సమాజం కూడా ఏమీ అనదు. కానీ విజయను ఈ సమాజం రేప్ చెయ్యబడ్డ ఆడదానిగా గుర్తిస్తుంది. అప్పటి నుండి పతితగా వేలెత్తి చూపిస్తుంది. ఆమె బతుకు భయంకరంగా తయారవు తుంది. తప్పు చేసిన వాడేమో 'మగ వాడు' అయినందున ఈ సమాజం క్షమిస్తుంది. వాడు పలుకుబడితో చట్టం నుండి తప్పించుకుంటాడు"

"ఇవన్నీ నేను ఆలోచించలేదు. వాణ్ని జైలుకు పంపాలని చేశాను"

"జరిగిందెలాగూ జరిగిపోయింది. ఇంతకీ విజయ పరిస్థితి ఇంటిదగ్గర ఎలాగుందో" ఆలోచిస్తూ అన్నాడు రమణ.

* * *

చెదిరిన జుట్టుతో, నలిగిన గుడ్డలతో కన్నీళ్లు ధారాపాతంగా కారుతుండగా లోనికి అడుగుపెట్టింది విజయ. ఆమెను చూసి ఆశ్చర్యపోయింది శారదమ్మ.

"ఏమైంది విజయా... ఏమైంది?" ఆతృతగా అడిగింది ఆమె. పక్కగదిలో పడుకుని ఉన్న వెంకట్రామయ్య, సుశీల ఆ అరుపులకు లేచి వచ్చారు.

తల్లిని చుట్టుకుని బావురుమంది విజయ.

"ఏమైందమ్మా?" విజయనుఓదారుస్తూ అడిగింది శారదమ్మ.

"నేను చెడిపోయానమ్మా! నా సర్వం దోచుకున్నాడమ్మా" వెక్కివెక్కి ఏడుస్తూ చెప్పింది విజయ. ముగ్గురూ ఉలిక్కి పడ్డారు.

"ఎవడు వాడు?" గొంతు పెగల్చుకుని అడిగింది శారదమ్మ.

"ఆ ప్రకాష్‌గాడు. మా యమ్.డి. నన్ను బలవంతంగా అనుభవించాడు"

ఆ తల్లి మనస్సు స్థంభించిపోయింది. కొద్దిసేపు ఆ గదిలో విజయ ఏడుపు తప్ప మరేమీ వినిపించలేదు. కొద్దిసేప టికి ఆమె తేరుకుని అడిగింది–

"ఎలా జరిగిందమ్మా"

కాసేపు ఉండమనడం దగ్గరనుండి అంతా చెప్పింది విజయ ఏడుస్తూ.

"ఈ విషయం మోహన్‌కి తెలుసా?" తెలియదనే ఉద్దేశంతో అడిగాడు వెంకట్రామయ్య.

"ముందు మోహన్‌కే తెలుసు. అతడే నన్ను ఆటో ఎక్కించి, తను స్కూటర్ వేసుకుని ఎక్కడికో వెళ్ళాడు. బహుశా వాడి దగ్గరకే వెళ్ళి ఉంటాడు"

వెంకట్రామయ్య నోటినుండి ఒక్క నిట్టూర్పు వెలువడింది. ఆయన కళ్ల ముందు విజయ బతుకు భయంకరంగా కనిపించింది.

శారదమ్మ కొంగు నోట్లోపెట్టుకుని ఏడవసాగింది. సుశీల భయంగా తల్లిని కరుచుకుపోయింది. విజయ తన గదిలోకి పరుగెత్తి మంచంమీద వాలి వెక్కివెక్కి ఏడవసాగింది.

ఆ రాత్రి ఆ ఇంట్లో ఎవ్వరూ భోంచెయ్యలేదు. రాత్రంతా ఏడ్పులు, నిట్టూర్పులు, ఓదార్పులు, ఆలోచనలు. ఆ రాత్రి భయంకరంగా గడిచింది అందరికీ.

* * *

ఉదయమే ఆ ఇంటి ముందు పోలీస్ వాన్ ఆగింది. ఇరుగూ పొరుగూ విచిత్రంగా చూశారు. యస్.ఐ.ఠీవిగా

లోపలికి నడిచాడు. లోనికి వస్తున్న యస్.ఐ.ని చూసి ఆశ్చర్యపడ్డాడు వెంకట్రామయ్య- ఈ విషయం పోలీసు లకు ఎలా తెలిసిందా అని. క్షణం తర్వాత అనిపించింది మోహన్ చెప్పి ఉంటాడని.

"విజయ మీ అమ్మాయే కదూ!'' అడిగాడు యస్.ఐ.

అవునన్నట్టు తలవూపాడు.యస్.ఐ.ని చూసి శారదమ్మ, సుశీల గదిలో నుండి బయటకు వచ్చారు.

"ఆమె ద్వారకా ఫ్యాక్టరీ ఆఫీసులో పనిచేస్తుందా?'' అడిగాడు.

"అవును" చెప్పాడు.

"మీ అమ్మాయిపై ప్రకాష్ అనే వ్యక్తి అత్యాచారం చేశాడని మోహన్ అనే వ్యక్తి మాకు రిపోర్టు చేశాడు. అందుకు ఆమెను కొన్ని ప్రశ్నలు అడగాలి"

"ఆ గదిలో ఉంది'' చెప్పాడు వెంకట్రామయ్య.

ఆ గదిలోకి నడిచాడు యస్.ఐ. మంచం మీద మోకాళ్ళపై తలపెట్టుకుని కూర్చునుంది విజయ. అంతకు ముందు తండ్రితో యస్.ఐ. మాట్లాడేప్పుడు విని ఉన్నది. యస్.ఐ. రావటం చూసి తలెత్తి చూసింది. పక్కనే ఉన్న కుర్చీ చూపించింది. కుర్చీలో కూర్చున్నాడు యస్.ఐ.

"మీ పేరేనా విజయ?"

అవునన్నట్టు తల వూపింది.

"ప్రకాష్ అనే వ్యక్తి మిమ్మలను మానభంగం చేశాడని రిపోర్టుచేయడం జరిగింది... అది నిజమేనా?"

మౌనంగా ఉంది విజయ. ఏమని చెబుతుందామె. తన శీలం పోయిందనా?

"నిజం చెప్పండి'' రెట్టించాడు యస్.ఐ.

అవునన్నట్టు తలూపింది.

"ఆ అత్యాచారం జరిగింది ఎన్ని గంటలకు?"

"నిన్న ఆరున్నర, ఏడు మధ్య"

"అతడు ఒక్కడేనా... మరికొంత మందా?"

"అతడు ఒక్కడే''

"ఫ్యాక్టరీ ఆఫీసులోనేనా మీ మీద అత్యాచారం జరిగింది?''

''అవును''

"ఓకే. అతడిని గురించి మేము ఆలోచిస్తాము. మీరు ముందా హెడ్ క్వార్టర్స్ ఆసుపత్రికి మెడికల్ చెకప్ కోసం వెళ్ళాలి. పదకొండు గంటలకు ఆసుపత్రి దగ్గరకు వచ్చి ఉండండి"

తలూపిందామె. యస్.ఐ. వెళ్ళి పోయాడు.

అప్పటికే ఎలా పాకిందో కాని ఆ ఇంట్లోని విజయ అనే అమ్మాయిని ఎవరో రేప్ చేసారని చుట్టుపక్కల అందరికీ తెలిసి పోయింది.

ఓ అర్ధగంట తర్వాత మోహన్ ఆ ఇంటికి వచ్చాడు.

"మోహన్! ఇదేమిటయ్యా... ఈ ఇంటికి పోలీసులు రావటం ఇదంతా ఏమిటి? జరిగిందేదో జరిగిపోయింది. దాన్ని మనసులో పెట్టుకుంటే పోయేదానికి వీధుల్లోబడి రభసచేసుకోవటం ఎందుకు" అన్నాడు విజయ తండ్రి.

"అలాంటి బాస్టర్డ్‌ని వదిలితే ఇంకెంత మందిని ఇలా చేస్తారో"

''ఎవరో చేస్తారని మన అమ్మాయిని వీధుల్లో పెట్టుకుంటామా? అసలు ఆ కోర్టులచుట్టూ, పోలీసుల చుట్టూ ఎవరు తిరుగుతారు? కోర్టులంటే అవి యమ కూపాల్లాంటివి. మనుషుల్ని చిత్రహింసలు




పెరతాయి"

"సరే... ఇంతదాకావచ్చిన తర్వాత వెనకంజవేయడం ఏం బాగుంటుంది? చెప్పండి. ఆ కోర్టులు అవన్నీ నేను చూసుకుంటాను"

మారు మాట్లాడలేకపోయాడు వెంక ట్రామయ్య. "సరే... నీ ఇష్టం బాబూ" అని మాత్రం అన్నాడు.

అర్థగంట తర్వాత ఓ ఆటో ఆ ఇంటి నుంచి హాస్పిటల్ వైపు కదిలింది.

* * *

ఆరోజు ఉదయం ఒకే ఒక స్థానిక పత్రిక ఈ వార్తను బాక్స్‌కట్టి మరీ ప్రచురించింది.విజయను గురించి వివరాలు రాసి, ఆమెపై అత్యాచారాన్ని ఖండించింది.

ఆ వార్త ప్రజలలో సంచలనం కలిగించింది. ముఖ్యంగా స్థానిక మహిళా మండలులలో చర్చనీయాంశమైంది. మహిళా సంఘాలు విజయకు జరిగిన అన్యాయానికి నిరసనగా ఊరేగింపు జరపాలని నిశ్చయించుకున్నాయి. స్త్రీలపై పెరుగుతున్న అత్యాచారాలకు వ్యతిరేకంగా ఆందోళన చెయ్యాలనుకున్నాయి.

దానితో ఆ మర్నాడు అన్ని పేపర్‌లలో ఈ వార్త ప్రచురింపబడింది. ఈసారి మరికొంత వివరంగా రాశాయి. నిందితుడిని అంతవరకూ అరెస్ట్ చెయ్యలేదని కూడా రాశాయి. దాంతో మహిళా మండలులకు మరింత ఊపు వచ్చింది.

ఓ యువతిఆవేశంగా ఉపన్యసించింది.

"రోజు రోజుకూ స్త్రీలకు భద్రత లేకుండాపోతోంది. పోలీస్ స్టేషన్ లో యువతి మానభంగం, మైనర్ బాలిక బలాత్కారం, గుర్తు తెలియని ఆడ శవం, కట్నాలు తేలేదని కోడల్ని చంపారు లాంటి వార్తలు మనం చదవని రోజు ఉండదు. ఓ ఆడది బయటికెళితే తిరిగి వస్తుందన్న నమ్మకం లేదు. సెకండ్‌షో సినిమాకు జంటగా వెళ్ళేసే దిక్కులేదు. ఇక ఒంటరిగా వెళితే తిరిగి రానేరాదు. ఒక ప్రాంతంలో పోలీస్‌స్టేషన్‌లలో పోలీసులే రేప్‌లు చేస్తారు. రేప్ అంటే ఓ సామాన్య విషయంలా మారిపోయింది. తప్పు చేసినవాడు చట్టం నుండి తప్పించు కుంటున్నాడు. తన తప్పులేకుండానే ఆడదాన్ని 'చెడిపోయిన ఆడది' అని సమాజం వేలెత్తి చూపిస్తుంది. అందుకే ఈ అత్యాచారాన్ని వ్యతిరేకించాలి. ఒక జాతి సౌభాగ్యం ఆ జాతి స్త్రీలు అనుభవించే స్వేచ్ఛా స్వాతంత్ర్యాల మీద ఆధారపడి ఉంటుంది. అందుకే దుర్గతిలో ఉన్న మన జాతిని కాపాడుకోవాలి..."

ఆరోజు మహిళా మండలులు ఊరేగింపు జరిపాయి.

'స్త్రీలపై అత్యాచారాలు అరికట్టాలి' 'మానభంగం చెయ్యబడ్డ విజయకు న్యాయం చెయ్యాలి', 'నిందితుని వెంటనే అరెస్టు చెయ్యాలి', 'నిందితుని రక్షించ డానికి ప్రయత్నిస్తున్న పోలీసుల లంచగొండితనం నశించాలి'

స్లోగన్స్‌తోసహా వీధుల్లో ప్రదర్శన జరిపారు.పత్రికేయులకలాలు కదిలాయి.

దాంతో అప్పుడే గుర్తువచ్చినట్టు పోలీసులు నిందితుని అరెస్టుచేశారు. అతడు డాక్టర్ పరీక్షకు పంపబడ్డాడు. తర్వాత అతన్ని బెయిల్‌మీద వదిలి పెట్టారు.

ఆ తర్వాత కేసు కోర్టుకు వెళ్ళింది.

ఆ విధంగా అప్పటి వరకూ సంచలనంగా ఉన్న విషయం కాస్త చప్పబడింది.




పురుషోత్తమరావు ప్రముఖ న్యాయవాది.

ఇద్దరు న్యాయవాదులు న్యాయస్థానంలో న్యాయంకోసం వాదించుకుంటున్నారంటే వారిలో ఒకరు న్యాయాన్ని పాతిపెట్టేందుకు ప్రయత్నిస్తున్నారన్నమాట. అంటే ఒకరు అన్యాయవాది.

సామాన్యంగా పురుషోత్తమరావు అన్యాయవాదిగానే ఉంటాడు. తన తెలివిని న్యాయానికి కాళ్లు విరిచి అన్యాయాన్ని విలయతాండవం చేయించేందుకే ప్రయత్నిస్తాడు. అందుకే డబ్బున్న ఘరానా పెద్దమనుషులు అందరూ అతడి దగ్గరికే వస్తారు.

స్నానంచేసి 'దేవుణ్ని' పూజించి ఆఫీసు గదిలోకి వచ్చాడు పురుషోత్తమరావు. లోపల కూర్చుని ఉన్నారు రాజేష్, ప్రకాష్‌లు. అతడికి రాజేష్ తెలుసు.

"కాసేపు కూర్చోండి. విజిటర్స్‌ని పంపించి వస్తాను" చెప్పి పక్క గదిలోకి వెళ్ళాడు పురుషోత్తమరావు.

అరగంట తర్వాత తిరిగి వచ్చాడు. కుర్చీలో కూర్చుంటూ–

"చెప్పండి... ఏమిటిలా వచ్చారు?" అనడిగాడు.

"ఇతడు ప్రకాష్ అని నా మిత్రుడు" పరిచయంచేశాడు రాజేష్. ప్రతి నమస్కారాలయ్యాయి.

"ఓ రేప్ కేస్ గురించి మీతో చర్చిద్దామని వచ్చాను"

"రేప్ కేసా! అంటే ఐ. పి. సి. త్రీ సెవెంటీఫైవ్, త్రీ సెవెంటీ సిక్స్ అన్నమాట. ఇంతకీ ఎవరి కేస్ అది?"

"పేపర్‌లో చూసే ఉంటారు. ప్రకాష్ అనే వ్యక్తి తనకింద పనిచేసే విజయ అనే అమ్మాయిని రేప్ చేశాడని. ఆ రేప్ కేస్ గురించి"

"మీరేనా ఆ ప్రకాష్?" ప్రకాష్‌ని చూస్తూ అన్నాడు.

అవునన్నట్టు తలవూపాడు ప్రకాష్. కాసేపు మౌనంగా ఉన్నాడు పురుషోత్తమరావు.

"అయితే ఒక్క విషయం నిజం చెప్పండి. జరిగింది నిజమేకదూ?"

ఒక్కక్షణం మౌనంగా ఉన్నారిద్దరూ.

"డాక్టర్‌లకేకాదు – ఒక్కోసారి లాయర్‌కి కూడా నిజం చెప్పాలి"

"నిజమే సార్! అనుకుంటున్నది నిజమే" చెప్పాడు ప్రకాష్.

కొద్దిసేపు తర్వాత అన్నాడు పురుషోత్తమరావు – "ఆమె ఎక్కువగా ప్రతిఘటించిన చిహ్నాలు ఉన్నాయా! అంటే రక్కులు, కొరికినవి, గీరినవి"

"నో సర్! అటువంటివేవీలేవు. ఆమె విదిలించి దూరంగా తోసేసింది. అంతే కాని రక్కడం లాంటివి చెయ్యలేదు"

"అంటే తక్కువ ప్రతిఘటన చూపించన్నమాట" అన్నాడు.

"లేదు సార్! చివరివరకూ పెనుగులాడుతూనే ఉంది" చెప్పాడు.

"ఆమె పెనుగులాడవచ్చు. కానీ ఆమె పెనుగులాడింది అన్నదానికి గుర్తులు ఈ రక్కులు, గిచ్చడం లాంటివి. కోర్టుకు కావలసింది అటువంటి సాక్ష్యాలే. ఇంతకీ




డాక్టర్ రిపోర్టు పరిశీలించాలి. అవన్నీ చూసి మీకు చెబుతాను" అన్నాడు పురుషోత్తమరావు.

"మీరు ఎలాగైనా ఈ కేసు తీసుకోవాలి" అన్నాడు ప్రకాష్.

"అలాగే... తీసుకుంటాను. కానీ ఫీజు ఎక్కువవుతుందేమో"

"ఎంతయినా ఫర్వాలేదు"

"ఓకే. నా ప్రయత్నం నేను చేస్తాను"

కాసేపు తర్వాత రాజేష్ అడిగాడు.

"ఈ కేసు ఎలా నడుస్తుందో వివరంగా చెప్పగలరా?"

"చెబుతాను. ఇండియన్ పీనల్ కోడ్ 375, 376 ప్రకారం రేప్ అంటే 1. ఒక స్త్రీని ఆమె ఇష్టానికి వ్యతిరేకంగా అనుభవించడం. 2. స్త్రీ అనుమతి లేకుండా అనుభవించటం. 3. స్త్రీని భయపెట్టి, బెదిరించి సంపర్కించడం. 4. మైనర్ బాలిక ఇష్టంతోగాని, ఇష్టంలేకుండాగానీ అనుభవించటం...

"ఇవన్నీ రేప్ కిందే గుర్తింపబడతాయి. రేప్ జరిగే సమయంలో గీర్లు, రక్కులు, కొరకటం లాంటివి ఉంటే ఆమె ఎక్కువగా ప్రతిఘటించినట్లు, లేకుంటే తక్కువగా ప్రతిఘటించినట్లు కోర్టు భావిస్తుంది. చాలామంది ఆడవారికి ఈ విషయం తెలియదు. తమపై అత్యాచారం జరిగే సమయంలో ప్రత్యర్థి శరీరంపై రక్కులు, కొరుకులు లాంటివి పడేపక్షంలో అదే తమకు న్యాయస్థానంలో సాక్ష్యం ఇస్తాయని వారికి తెలియదు. తెలిసినా ఆ క్షణంలో అవి గుర్తుండకపోవచ్చు.

"పోతే మరొక విషయం కూడా కోర్టులో పరిశీలిస్తారు. అది ఆమె గత చరిత్ర గురించి. ఆమె అంతకుముందు జీవితంలో ఎలాంటిది? అంటే ఆమె శరీరాన్ని అమ్ముకునే వేశ్యలాంటిదా అనేవి కూడా పరిగణనలోకి తీసుకోబడతాయి.

"1972లో జరిగిన మధుర రేప్ కేసులో 'ఇద్దరి బట్టలమీదా వీర్య చిహ్నాలు ఉన్నాయి. అంతకుమించి ఆమెను బలాత్కరించారన్న వాదానికి ఆధారంగా గుర్తులేవీ లేవు' అన్న డాక్టర్ రిపోర్టు ఆధారంగా, అవి వాళ్లు మరొకరితో జరిపిన సంపర్కానికి చిహ్నాలు కావచ్చు అని జిల్లాకోర్టు కొట్టివేసింది. అయితే హైకోర్టు రేప్ అని నమ్మి శిక్షవేసింది. కాని ఆ తర్వాత సుప్రీమ్ కోర్టు 'నిర్దోషి' అని తీర్పుచెప్పింది.

"సో! ఒక కోర్టులో మనకు వ్యతిరేకంగా తీర్పు వచ్చినా మరో కోర్టులో మనకు అనుకూలంగా జరుగుతుంది. డోంట్ ఫియర్ ఎబౌట్ రూల్ అండ్ లా" వివరించాడు లాయరు.

"అంటే ఒక్కో కోర్టులో ఒక్కో న్యాయం చెబుతారా? అంటే న్యాయాధిపతులలోనే ఏకాభిప్రాయం లేదా?" అమాయకంగా అడిగాడు ప్రకాష్.

"గుడ్ క్వశ్చన్. మన న్యాయస్థానాలలో సరయిన న్యాయం జరగడం లేదని చెప్పేందుకే మధుర కేస్ గురించి చెప్పాను. అంటే ఒక న్యాయాధిపతికి న్యాయంగా అనిపించింది, మరొక న్యాయాధిపతికి అన్యాయంగా తోస్తుంది. ఇక్కడ మనం ఒక్క విషయం గుర్తు చేసుకోవచ్చు. ఒకసారి నెహ్రూగారు మరో దేశ న్యాయాధిపతి మనదేశానికి వచ్చినపుడు 'మా చట్టంఎలా ఉంది?' అన్నారట. దానికి ఆయన 'మీ దేశంలో ఓ నేరస్థుడు పార్లమెంట్ లోనే అందరి సమక్షంలోనూ ఓ హత్యచేసినా తప్పించుకోవచ్చు' అన్నా

డట. అది నిజం"

"మనం న్యాయం గురించి చర్చల్లోకి వెళ్లాం" గుర్తుచేశాడు రాజేష్.

"ఓకే సర్. డాక్టర్ రిపోర్టు పంపుతాను" చెప్పాడు ప్రకాష్.

"ఓకే విష్ యూ బెస్టాఫ్ లక్" చెయ్యి కలిపాడు లాయరు.

ఆ తర్వాత కేసు కోర్టులో విచారణకొచ్చింది.

కోపం, జాలి, నవ్వు అన్నీ వస్తాయి.

తనవారికెవరికయినా కోర్టులు న్యాయం చెయ్యకపోతే ఈ న్యాయ వ్యవస్థపై కోపం వస్తుంది.

పక్కన ఎవరయినా చట్టం పేరుతో శిక్షింపబడుతుండే వారిపై జాలి కలుగుతుంది.

చట్టాలు క్షుణ్ణంగా చదివి వాటిలోని లోటుపాట్లు గమనించినపుడు ఆ అతుకుల



కోర్టు-చట్టం-న్యాయం.

ఆ మూడూ అంటే ఏమిటో అనుభవపూర్వకంగా తెలిసినవారికి ఎవరికయినా

బొంత కోర్టు చట్టాలను చూసి నవ్వు వస్తుంది.

కోర్టుకు కావలసింది సాక్ష్యం. ఒక

తప్ప, ఒక నేరంచేసేవాడు పక్కన సాక్ష్యుల్ని ఉంచుకుని మరీ నేరంచేస్తాడా? పైగా సాక్షులు డబ్బుకు లొంగుతారు. కాబట్టి సాక్ష్యం అనేది డబ్బుఉన్నవాడి జేబులో ఉంది. మరి ఈ కోర్టులలో పేదవాడికిన్యాయం ఎక్కడజరుగుతుంది?

అసలు బక్క ప్రాణులు కోర్టులకు పోగలుగుతారా? కోర్టులకెళితే అక్కడి జలగలు అతడి రక్తాన్ని కొద్దికొద్దిగాపీల్చి పిప్పిచేస్తాయి. దానికి తగ్గట్టే ఎన్నోళ్ళో ఈ కోర్టు చుట్టూ తిరిగితేనేకాని న్యాయం జరగదు. అందుకే 'తెలివున్నవాడెప్పుడూ' ఈ కోర్టుల జోలికి పోడు.

చట్టం!

ఈ చట్టాలు ఉన్నవాడి అడుగులకు మడుగులొత్తుతూ, అతడి అడుగుజాడల్లో నడుస్తుంటాయి. రోడ్డుపక్క తన కడుపు కోసం, తన బిడ్డల జబ్బులకోసం తన శరీరాన్నే అమ్ముకునే భారత స్త్రీని వ్యభిచార నేరంకింద అరెస్టుచేసే చట్టాలు, పెద్ద పెద్ద లాడ్జిలలో, పెద్దవాళ్ళ గెస్ట్ హవుస్‌లలో పెద్దయెత్తున జరిగే వ్యభిచారాన్ని, 'రాజకీయ వ్యభిచారాన్ని' ఎలా శిక్షిస్తాయి?

న్యాయం!

రోడ్డుపక్క ఇద్దరు పేదవాళ్ళు కొట్టుకుంటుంటే చూస్తూ పోయే రక్షకభటులు, ఏ ధనవంతుడి ఇంటిముందో కుక్కల్లా కాపలా ఉంటారు. ఇదా న్యాయం?

అందుకే ఈ వ్యవస్థ గొప్పవాళ్ళ యొక్క, గొప్పవాళ్ళ చేత, గొప్పవాళ్ళ కొరకు రూపొందించుకున్నట్లుగా మారి పోయింది. అందుకే ఈ వ్యవస్థలో మామూలు మనిషికి న్యాయం జరగదు. సగటు మనిషికి న్యాయం జరగదు.




మన చట్టాలు అలా ఉండబట్టేనేరస్తులు నేరం చేసినా తప్పించుకోగలం అన్న ధీమాతో ఉన్నారు.

ఈ వ్యవస్థలో విజయకు మాత్రం న్యాయం జరుగుతుందా? ఏమో...? ఆమె మధ్యలో మరో దారి చూసుకోకుంటే ఎలా జరిగేదో?

మన రాజ్యాంగ వ్యవస్థ పేదవాడికి అన్యాయం చేస్తుంటే, మన సామాజిక వ్యవస్థ 'స్త్రీ'కి ద్రోహం చేస్తోంది.

ఎవరైనా అత్యాచారం జరిపితే కోర్టు అతగాడికి శిక్షవేసే పక్షంలో మరో వ్యక్తి అలాంటి నేరం చేసేందుకు భయపడ తాడు. కానీ ఈ సమాజం రేప్ చెయ్యబడ్డ ఆడదానికి కూడా అంతకంటే పెద్దశిక్ష విధిస్తుంది. ఆమెను పతిత అని, చెడి పోయిన ఆడది అని హింసిస్తారు. ఆమెను పెళ్ళాడేందుకు వెనుకాడతారు. ఆమెను వెలివేసినట్లు చూస్తారు.

అసలు భారత స్త్రీ శీలానికి ఎంతో ప్రాముఖ్యతనిచ్చి ఆమె శీలం లేనిదని తెలిస్తే హీనంగా, అంటరానిదానిలా చూస్తారు. వంశానికే అప్రతిష్ఠ అంటారు. అందుకే ఎన్నో అత్యాచారాలు అగాధ మైన స్త్రీ హృదయ సాగరంలోనే అణగారి పోతున్నాయి తప్ప బయటపడటంలేదు.

వీటన్నింటికీ కారణం పురుషాధిక్యత గల మన సమాజం. నిజానికి ఇవన్నీ పురుషులు ఏర్పరచిన కట్టుబాట్లే. పురుషులు చెప్పిన నీతి వాక్యాలే! పురుషులు రచించిన కథల్లో స్త్రీ శీలానికే ప్రాముఖ్యత! ఇవన్నీ కలిసే స్త్రీని ఈ స్థితికి దిగజార్చాయి.

ఓ పురుషుడు పదిమంది ఆడవారితో తిరిగితే అతడు గోపాలకృష్ణుడు...జల్సారాయుడు అనే ఈ సమాజం, ఓ ఆడది తెలిసీ తెలియక మరొకడితో బహిరంగంగా

సంబంధం పెట్టుకుంటే ఆమెను 'లంజ' అని పిలుస్తుంది. అంటే మగాడికో న్యాయం, ఆడదానికో న్యాయం!

మన పురాణాల్లోని సీత, సావిత్రి, దమయంతి లాంటి పతివ్రతలు అంటూ కథలు చెబుతారేకానీ కృష్ణుడు, అర్జునుడు లాంటి 'ఆడ పిచ్చోళ్ళు' అని ఎవరూ చెప్పరేం? ఇది పురుషాధిక్యతకు నిదర్శనం కాదా!

ఇదీ నేటి సమాజంలో స్త్రీ స్థానం.

ఈ సమాజం చట్టంలాగానే కొన్నింట చూసీ చూడనట్టు పోతోంది.

ఓ స్త్రీ భర్త నీడలో ఉండి, అతడి కళ్ళు కప్పి దొడ్డిదారిన మరొకడితో కామ కలాపాలు సాగిస్తే చూసీ చూడనట్టుగా పోతోంది. అదే ఓ స్త్రీ తన కూటికోసం రోడ్లో నిలబడి శరీరాన్ని అమ్ముకుంటే ఆమెను 'వేశ్య' అంటుంది. మరో స్త్రీ మరే మగాడి వల్లనో 'చెరచబడితే' అది బహిరంగం అయితే ఆమెను 'చెడిపోయిన ఆడది' అని అంటారు. ఆమెను వెలివేసినట్టు చూస్తారు. అంటే గుట్టుచప్పుడు కాకుండా ఏంచేసినా ఫర్వాలేదు కానీ బహిరంగంగా పొరపాటున కూడా జరక్కూడదు.

అందుకే రేప్ చెయ్యబడ్డ తర్వాత కోర్టుకెళ్ళి న్యాయం కోసం నిలబడటం ఒక ఎత్తయితే, ఈ సమాజంలో చెడిపోయిన స్త్రీలా బతకడం మరో ఎత్తు. లోకం ఆమెను క్రూరమైన మాటలతో హింసిస్తుంది..గేలి చేస్తుంది. అసలు తెలిసీ తెలియని తనంతో స్త్రీకి స్త్రీయే శత్రువుగా వ్యవహరిస్తుంది కూడా!

* * *

ఉదయమే పొరుగింటి మీనాక్షమ్మ కాఫీపొడికి అప్పుకొచ్చింది.

"వదినా! ఏం చేస్తున్నావు?" వాకిటిలోనుండే పలకరింపుగా అంటూ వచ్చింది.

లోపల కూర్చుని ఉన్న శారదమ్మ "చేసేదేముందమ్మా" అంది మామూలుగా!

"ఏదో మంచోళ్ళకే దేవుడు అన్ని కష్టాలూ పెడతాడు. లేకుంటే బంగారం లాంటి అమ్మాయి బతుకు ఇలా బుగ్గిపాలు కావడం గ్రహచారం కదా" పక్కనే చతికిలబడుతూ అంది మీనాక్షమ్మ.

"అంతా మా ఖర్మ తల్లీ!" నోట్లో గుడ్డ పెట్టుకుంది శారదమ్మ.

"అయినా నా బాధ అదికాదు వదినా! బంగారంలాంటి అమ్మాయిలకే ఏవేవో వంకలు పెడుతుంటే, ఇక చెడిపోయిన పిల్ల అని తెలిసి తెలిసి ఎవరు పెళ్ళి చేసుకుంటారు" బాధంతా తనకే కలిగినట్టు అందామె.

పక్కగదిలోనుండి ఇవన్నీ వింటున్న విజయకు ఏడుపుతోపాటు కోపం కూడా వస్తోంది. అయినా వీళ్ళకు తను పక్కగదిలో ఉన్నానని తెలియదా తెలిసీ కూడా అంటున్నారంటే వీళ్ళకు విచక్షణాజ్ఞానం ఉందా? అసలే బాధతో ఉన్న తనకు ఇలాంటి మాటలు వింటుంటే పుండుమీద కారం చల్లినట్టు మరింత బాధవేస్తుంది. వచ్చిన ప్రతి ఒక్కరూ ఇలాగే మాట్లాడుతున్నారు. ఎప్పుడు ఎలా మాట్లాడవలసిందీ వీళ్ళకు తెలియదు కాబోలు!ఏడుస్తూ మనసులోనే అనుకుంది.

"అయినా అన్నయ్య ఎంత మంచివాడు వదినా! మీకేనా ఈ కష్టాలు రావలసింది? పాపం సుశీల చిన్నపిల్ల. దాని బతుకు ఎలాగుందో...."

కళ్ళు వత్తుకుంది శారదమ్మ.

'అంటే తన తండ్రికి తను కష్టాలు కొనితెచ్చి పెట్టిందా? అయినా ఇందులో తన తప్పేం ఉంది? ఆ కామాంధుడు తనపై అత్యాచారం చేశాడు. అలా అయితే అతగాడి తల్లిదండ్రులు కూడా తమ బిడ్డ చేసిన తప్పుకు కష్టపడాలి. అయినా వాళ్లు కష్టపడుతుంటారా... లేదే! తమ బిడ్డ అనవసరంగా ఓ 'కేసు' తెచ్చి పెట్టాడని ఆ కేసు కొట్టివేయించేందుకు కష్టపడుతుంటారు. తర్వాత కేసు మాఫీ అయిపోతే లక్షల కట్నంతో కొడుకు పెళ్ళిచేసేస్తారు. అంతే! తెలిసి ఏ తప్పు చెయ్యకుండానే తన బతుక్కి మాత్రం కష్టాలు, తప్పు చేసి కూడా అతడికి సుఖాలు... ఎందుకిలా జరుగుతోంది?

"అన్నట్టు మరిచేపోయాను వదినా! ఓ కప్పు కాఫీపొడి ఇవ్వు. మీ అన్నయ్యకు ఎనిమిది గంటల కంతా కాఫీ లేకపోతే ఏమీ తోచదు" చెప్పింది మీనాక్షమ్మ.

లేచి పక్కగదిలోకి వెళ్ళి కాఫీపొడి తెచ్చి ఇచ్చింది శారదమ్మ. "దిగులు పెట్టుకోకు వదినా! దాని రాత ఎలావుంటే అలా జరుగుతుంది" ఓదార్చి, వచ్చిన పని చేసుకుని వెళ్ళింది మీనాక్షమ్మ. కానీ ఆమె వెళ్ళిన తర్వాత ఆ ఇంట్లో ఒక యువతి అంతకుముందు ఆమె అని వెళ్ళిన మాటలను తలచుకొని ఏడుస్తుందని ఆమెకు తెలియదు. అసలా సంగతి చాలామందికి తెలియదు. తాము అనే మాటలు పక్కవారికి బాధకలిగిస్తాయనే జ్ఞానం ఏమాత్రం ఉండదు వారికి.

* * *

ఆ సాయంత్రం ఊరునుంచి దిగింది శ్యామలమ్మ. ఆమె వెంకట్రామయ్య పెద్ద అన్న కూతురు. తిరుపతిలో ఉంటుంది. విజయ వయసే! వాకిట్లోనే శోకాన్ని కురిపిస్తూ లోనికి వచ్చి ఇంట్లో ఎవరో పోయినట్టు ఏడుపు ఎత్తుకుందామె.

"ఎంత ఘోరం జరిగిపోయింది బాబాయ్!'' అంటూ అరగంట ఏడ్చింది.

"ఏం చేద్దామమ్మా'' ఆమెను ఓదార్చే ధోరణిలో అన్నాడు వెంకట్రామయ్య.

"ఇక మీరు తలెత్తుకుని బయట ఎలా తిరగ్గలరు బాబాయ్? అది తెచ్చిన మచ్చ ఎలా మాసిపోతుంది" ఏడుస్తూ అందామె.

పక్కనే గుడ్డ నోట్లో కుక్కుకుని ఏడుస్తోంది శారదమ్మ. ఆ పక్కగదిలోని విజయ ఈ మాటలన్నీ వింటూనే ఉంది.

"అయినా ఆడదానికి ఉద్యోగం పనికిరాదని ఎన్నోసార్లు చెప్పాను. కాదని షోకులు చేసుకుని వీధికెక్కింది. షోగ్గా తైతక్కలాడుతూ ఉంటే ఎవడో మగాడు వళ్ళుమరచి ఇలాంటిపని చెయ్యకుండా ఎలా ఉంటాడు"

ఈ దేశంలో ఈ తరహా ఆడ వాళ్ళు చాలామంది ఉన్నారు. తమకు షోకులు చేసుకుని, మొగుణ్ని వెంటేసుకుని వీధుల్లో తిరగాలని ఉన్నా, ఆ మొగుడు పడనివ్వకో, ఇంటి పరిస్థితుల వలనో, తమ పిరికితనం వలనో ఇంట్లోనే ఉంటారు. మరి బయట తిరిగే ఆడవాళ్ళను చూసి ఈర్ష్యతో వాళ్లేదో కాని పనిచేస్తున్నట్టు బుగ్గలు నొక్కుకుని పక్కవారికి చెడ్డపనిలా వర్ణించి చెబుతారు అదొక విధమైన మెంటాలిటీ!

"ఆరోజు ఉదయాన్నే ఓన్ని రేప్ చేసినట్టు పేపర్‌లో వేసి ఉంది. అంతే! నా గుండె ఆగినంత పనయింది. నాకు అన్నం సయించలేదనుకో. మనసు నిలవక ఇలా పరిగెత్తుకుని వచ్చేశాను. అయినా జరిగిందేదో జరిగిపోయింది కదా....సట్టు చప్పుడు కాకుండా ఆ విషయాన్ని




మనసులో పెట్టుకుని ఉండక ఇలా కోర్టులకు, పేపర్లకు ఎక్కించుకోవడం ఎందుకు?''

''నేను కాదమ్మా! ఎవరో కుర్రాడు అలా అన్యాయం చేసినవాణ్ని జైలుకు పంపించాలని పోలీసు రిపోర్టు ఇచ్చా దమ్మా!"

''వాడికదేం పోయేకాలం. అయినా ఒకర్నని ఏం లాభం.... మన బంగారం మంచిదయితే''

మౌనంగా ఉన్నాడు వెంకట్రామయ్య. కాసేపు తర్వాత మళ్ళీ ఎత్తుకుందామె.

''మా ఊళ్లో పక్కింటి అమ్మాయి ఒకణ్ని తీసుకుని వెళితే, వెతికివెతికి ఆ పిల్లను తీసుకొని వచ్చి ఎవ్వరికీ తెలియ కుండా ఇంకెవ్వరికో ఇచ్చి పెళ్లిచేశారు. దీని బతుకు అలాకాకపాయనే. ఇది చెడిపోయిందని రాష్ట్రమంతా తెలిసిపోయె. ఆఖరికి అడ్రసు కూడా వేసిరి. ఇక చెడిపోయిందని తెలిసి తెలిసి ఎవడు చేసుకుంటాడు?" తన బాధ గురించి చెప్పిందామె.

వెంకట్రామయ్య మౌనంగా కూర్చుని ఉన్నాడు. గదిలో నుండి బయటికొచ్చింది విజయ.

''చూడక్కా! నన్నెవ్వరూ చేసుకో నవసరంలేదు. నా బతుకేదో నేను బతుకు తాను. నా గురించి మీరేం బెంగపెట్టుకో నవసరం లేదు" అంది ఆవేశంగా.

''ఏదోనమ్మా ! నీ పెళ్లి ఎలా అవుతుందోనని నా బాధ. అయినా నిన్ను గురించి కాదులే, మా బాబాయ్ పడబోయే బాధ గురించి" అన్నది శ్యామలమ్మ.

"నా పెళ్లి గురించి నువ్వేం బాధ పడొద్దులే. నన్ను పెళ్లి చేసుకునేందుకు ఎవరో ఒకరు సిద్ధంగా ఉన్నారులే''

"ఎవరమ్మా.. అంత చెడిపోయినోడు"

"ఆ కేసు పెట్టినాడే నన్ను పెళ్లి చేసుకుంటాడు. ఇక దాన్ని గురించి నువ్వేం బాధపడొద్దు... సరేనా''

''సరేలేమ్మా! చెడిపోయిన ఆడదాన్ని పెళ్లిచేసుకునే మగాడు నీకు దొరికితే, ఇక మేము బాధపడాల్సిన అవసరం ఏముందమ్మా... మంచిదేగా'' మూతి మూడు వంకర్లు తిప్పుకొని అంది శ్యామలమ్మ.

"అక్కా ! చెడిపోయిన ఆడది అని నువ్వు నన్ను వేలెత్తి చూపనవసరం లేదు. అయినా నువ్వు నామీద సానుభూతి చూపుతున్నావో లేక సమయం వచ్చిందని ఎత్తిపొడుస్తున్నావో అర్థం కావడంలేదు"

ఆ మాటతో ఒక్కసారిగా రాగం తీసింది శ్యామలమ్మ.

"చూడు బాబాయ్...అది ఎంత మాటందో. అయినా నేను అంత దూరం నుంచి ఛార్జీలు పెట్టుకొని ఎత్తిపొడిచేదాని కొచ్చానా? ఇక ఒక్కక్షణం ఇక్కడ ఉండను బాబాయ్"

అప్పటివరకూ కుర్చీలో కూర్చుని తలనొప్పంతా భరిస్తున్న వెంకట్రామయ్య ఇక ఓర్చుకోలేకపోయాడు. లేచి వెళ్ళి విజయ చెంపమీద చెళ్ళున దెబ్బవేశాడు.

అది ఊహించలేదు విజయ. ఇంత వరకూ ఆమె జీవితంలో తండ్రి తనని పల్లెత్తు మాటకూడా అనలేదు. ఈరోజు ఏకంగా దెబ్బ వేయడంతో ఓర్చుకోలేక పోయింది. మంచమీదపడి ఏడవసాగింది.

ఆ ఇంట్లో అంతకుముందు అటు వంటివి ఎరగని మిగిలిన ఇద్దరూ ఆశ్చర్య పోయారు. శ్యామలమ్మ మాత్రం అంత టితో శాంతించి ఆ సాయంత్రం వెళ్ళిపో యింది.

ఆ ఇంటికి ఆరోజునుండే విచారింపుల పర్వం ప్రారంభమయింది. ఆ ఇంట్లో ఎవరో చనిపోయినట్లు ఒకొక్కరే వచ్చి వెంకట్రామయ్యకు సానుభూతి తెలియ జేసి వెళుతున్నారు.

ఏదైనా పెళ్ళికి రావొచ్చు, చావుకు రావొచ్చు. అంతేకానీ ఎవరైనా ఆత్మ హత్యకు ప్రయత్నిస్తేనో, రేప్ చెయ్య బడితేనో రానవసరంలేదు. ఎందుకంటే అలాంటివాటికి విచారింపునకు వస్తే, నేను చేసిన తప్పు ఇంతమందికి తెలిసిందా అని ఆ తప్పుచేసిన వ్యక్తికి తనమీద తనకే అసహ్యం వేస్తుంది.

బాధ కలిగినప్పుడు మనిషికి ఓదార్పు కావాలి. అందుకే ఆపద సమయంలో బంధువులు, స్నేహితులు వచ్చేది. ఆ వచ్చినవారు ఓదార్పు మాటలు చెబితే ఫర్వాలేదు. కానీ వాళ్ళకు తెలియకుండానే వాళ్ళు తమ మాటలతో ఇతరులకు బాధ కలిగిస్తారు.

అలాగే విజయ; వెంకట్రామయ్య, శారదమ్మలు కొద్ది రోజులుగా వచ్చే బంధువుల వలన, వాళ్ళ మాటల వలన చిత్రహింసలు పడుతున్నారు.

* * *

భోజనం చేసి వెంకట్రామయ్య మేనువాల్చి ఉన్నాడు. శారదమ్మ ఆయన దగ్గరగా వచ్చింది.

ఆయనకు ఈమధ్య ఊరికే కోపం వచ్చేస్తోంది. అందుకే వచ్చినపని మెల్లగా బయటపెట్టాలని చూసింది.

"ఏమండీ" పలకరించింది శారదమ్మ.

"ఏమిటి?" అన్నాడు వెంకట్రామయ్య.

''అమ్మాయిని చూస్తోంటే గుండె తరుక్కుపోతోంది. అది ఆ మూలగదిలో కూర్చుని ఎప్పుడూ, ఏదో ఆలోచిస్తుం టుంది....''

''అయితే నన్నేం చెయ్యమంటావు?'' విసుగ్గా అడిగాడు వెంకట్రామయ్య.

"ఆదే...ఆ మోహన్ని కనుక్కుని అతడి మనసు మారిపోకముందే అతడి కాళ్ళో, చేతులో పట్టుకొని, దాని మెళ్ళో ఆ మూడు ముళ్ళు...వేసేస్తే''

''నీకు బుద్ధుందా! ఇప్పుడు ఆ అబ్బాయిని ఏమని అడిగేది. ఇప్పుడు ఊరంతా దాని పేరు మారుమోగుతుంటే, ఇప్పుడే ఆ పెళ్ళికాస్తా చేసేస్తే, ఇక ఆ పెళ్ళికి పెద్ద పబ్లిసిటీ అవుతుంది.అందుకే ఈ గలభా కాస్త సద్దుమణిగిన తర్వాత చేసేద్దాం. అసలు ఇప్పుడే ఆ అబ్బాయిని పెళ్ళిచేసుకోమంటే నామీద అంత నమ్మకం లేదా అంటాడేమో!''

''అమ్మాయి అలాగే ఏడుస్తూ కూర్చుని ఉంటే బాధగా ఉంది. పైగా వచ్చేవాళ్ళ సూటిపోటి మాటలు విని ఏ అఘాయిత్యం చేసుకుంటుందోనని భయంగా ఉంది" అంది శారదమ్మ.

"నేనూ అదే ఆలోచిస్తూ ఉన్నాను. అమ్మాయిని మా తమ్ముడు దగ్గరకు పంపుదామని అనుకుంటున్నాను" అన్నాడు వెంకట్రామయ్య.

"ఎక్కడికి...రామ్మూర్తి దగ్గరకా! అక్కడికి అయితే ఫర్వాలేదు. అయినా ఇక్కడ ఏదయినా అవసరం అవుతుం దేమో.... కోర్టుకు వాటికి"

"అవసరం ఉండదు. అంతగా అవసరం అయితే ఆరోజు జాబురాస్తే రామ్మూర్తి తీసుకొచ్చి, మళ్ళీ పక్కరోజు తీసుకెళుతుంటాడు.ఎంతా ఇరవైమైళ్ళేగా" అన్నాడు వెంకట్రామయ్య.

''అలాగే చెయ్యండి! కానీ ఆ రాక్షసి ముందు అమ్మాయి ఉండగలదా!"

అనుమానంగా అంది శారదమ్మ.

"ఎవరూ... మహాలక్ష్మి గురించా! అదినిజమే. కానీ అమ్మాయితో చెప్పు పిన్నమ్మ జోలికి వెళ్ళొద్దని. ఇంకేంచేస్తాం"

"సరే మీ ఇష్టం. అలాగేకానివ్వండి''

''ఈరోజు వాడికి జాబు రాస్తాను. ఎందుకయినా మంచిది.... అమ్మాయిని ఒక్కమాట కనుక్కో. వెళ్ళడం ఇష్టముందో లేదో'' అడిగాడు.

"అలాగే" పక్కగదిలోకి వెళ్ళింది శారదమ్మ. అప్పటివరకూ ఆ మాటలు వింటున్నట్టుంది విజయ.

"మీ నాన్న మాటలు విన్నావుగా! మీ బాబాయ్ దగ్గరకి వెళ్తావా!"

"అలాగే వెళ్తాను" ఒప్పుకుంది విజయ.

తర్వాత ముందుగదిలోకెళ్ళి వెంకట్రామయ్యకు చెప్పింది శారదమ్మ 'వెళ్తుందట' అని.

"సరే...నేను వెళ్ళి జాబురాసివస్తాను" లేచి ఆ ఎండలోనే పక్కనే ఉన్న పోస్టాఫీసువైపు కదిలాడు వెంకట్రామయ్య.

* * *

బాంక్ నుంచి ఇంటికి వెళుతూ విజయ దగ్గరకు వచ్చాడు మోహన్. గదిలో సమస్తం కోల్పోయినదానిలా కూర్చుని ఉంది విజయ. మోహన్ని చూసి పలకరింపుగా నవ్వింది. పక్కనే కూర్చున్నాడు మోహన్.

"బాంక్నుంచేనా?" అడిగింది విజయ.

"అవును" చెప్పాడు. కాసేపు తర్వాత అంది విజయ.

"మోహన్! రేపు ఉదయాన్నే నేను ఊరికి వెళుతున్నాను"

"ఏ ఊరు?" అడిగాడు మోహన్.

''పక్కనే... ఓ ఇరవై మైళ్ళదూరంలో ఉన్న ఓ పల్లెకు''

"ఎవరున్నారక్కడ?"

"మా చిన్నాన్న ఉన్నాడు''

"ఎందుకు అక్కడికి?"

"ఏదో స్థలం మార్పులో ఆలోచనలు కొద్దిగా తగ్గుతాయని"

''మళ్ళీ ఎప్పుడొస్తావు?'' అడిగాడు.

''ఎప్పుడు రావాలనుకుంటే అప్పుడే వచ్చేస్తాను''

"సరే నీ ఇష్టం"

శారదమ్మ కాఫీ పట్టుకొని ఆ గదిలోకి వచ్చింది. కొద్దిసేపు మాటలు ఆపారు ఇద్దరూ. శారదమ్మ కాఫీ అక్కడ పెట్టేసి వెళ్ళిపోయింది.

"తీసుకోండి'' అతడికో కప్పు ఇచ్చి తనో కప్పు తీసుకుంది విజయ.

"రమణ రావడం లేదే?" అడిగింది విజయ.

"నేను రమ్మని పిలిస్తే అతడు ఏవేవో సాకులు చెబుతాడు. ఏదైనా ఓదార్పు కావాలంటే ప్రియమైనవాళ్ళు ఒకరిద్దరుంటే చాలు అంటాడు. అందరూ వెళ్ళి ఆమెను సానుభూతిమాటలతో ఆమె తప్పు గుర్తుచెయ్యడం ఎందుకు అంటాడు. ఒక్కోసారి అసలు ఏం జరిగిందని ఆమె బాధపడాలి, తప్పుచేసిన మగాడు– తను అన్యాయంగా ఓ స్త్రీపై అత్యాచారం చేశానని బాధపడాలి కానీ, ఆమె ఎందుకు బాధపడాలిఅని కూడా అంటాడు. అతని పద్ధతి ఏమిటో నాకర్థంకాదు"

"మంచివాడు" అంది విజయ.

"మనిషి మంచివాడే కానీ నీతి నియమం అంటూ 'అసమర్థుడి'గా మారిపోతున్నాడు'' అన్నాడు మోహన్.

కాసేపు మౌనంగా ఉన్నారిద్దరూ. కాఫీ తాగి కప్పు కిందపెట్టి పైకిలేచి నిలబడ్డాడు.





"నేను వెళ్ళి వస్తాను" అన్నాడు మోహన్.

"అలాగే. రేపు నేనుండను"

"సరే" వెళ్ళిపోయాడు మోహన్.

మోహన్ వెళ్ళిపోయిన దిక్కు చూస్తోంది విజయ. మోహన్‌లో ఏదో లోపించింది. ఏమిటి? అవును... అతడు అంతకుముందులా తనతో ప్రియంగా మాట్లాడటం లేదు. ఏదో తూచి తూచి మాట్లాడుతున్నాడు. ఊరికి వెళ్తానన్నందుకు అంతకు ముందయితే ఎంత బాధపడి ఉండేవాడు. 'మళ్ళీ ఎప్పుడు వస్తావు? నీ కోసం కన్నులు కాయలు కాసేలా ఎదురుచూస్తుంటాను' అని ఉండేవాడు. ఇప్పుడు కనీసం 'తొందరగా రావాలి' అని కూడా అనలేదు. విధిలేనట్టు మాట్లాడుతున్నాడు.

మోహన్‌కూ, తనకూ మధ్య ఏదో అడ్డుగోడ లేస్తున్నట్టు తొలిసారిగా గమనించింది విజయ.



# 7

మధ్యాహ్నం బస్సు ఊళ్ళోకి వచ్చింది. ముందుగా రామ్మూర్తి బస్సు దిగాడు. సూట్ కేస్ అందుకుని 'రామ్మా' అన్నాడు. అతడి వెనుకే కదిలింది విజయ.

రామ్మూర్తికి ఆ ఊళ్లో రెండెకరాల పొలం ఉంది. సంతానం ఓ కొడుకు, ఓ కూతురు. కొడుకు ఉద్యోగం చేసుకుంటూ హైదరాబాదులో ఉంటున్నాడు. కూతురు ఇంట్లోనే ఉంది.

"రా విజయా" పిలిచాడు రామ్మూర్తి. ఆలోచనలనుండి తేరుకుని ఎదురుగా ఇల్లు ఉండటం చూసి లోనికి నడిచింది.

ఆ ఇంటికి ఎప్పుడో చిన్నప్పుడు ఒకటి రెండుసార్లు వచ్చింది. తన పిన్ని గయ్యాళి అని ఆమెకు తెలుసు. బంధువుల ఇళ్ళకు పెళ్ళిళ్ళకు వెళితే చూసివుంది.

"రేవతీ! అక్కనులోపలికి తీసుకురా" లోపలికెళ్ళి కూతురుకు చెప్పాడు.

పద్దెనిమిదేళ్ళ అమ్మాయి లోనుండి వచ్చింది.

"రా అక్కా!" ఆప్యాయంగా చెయ్యి పట్టుకొని లోపలికి తీసుకెళ్ళింది. లోపల ఓ గొంతు పెద్దగా అరుస్తోంది.

"ఊళ్ళో శనంతా మీకే కావాలి. ఎక్కడెక్కడి పీడంతా నా నెత్తిమీదికే తీసుకొచ్చి వెయ్యాలా"

"నువ్వు ముందు నోర్మూసుకో" గద్దిస్తున్నాడు రామ్మూర్తి.

"వీధిలో చెప్పేదానికి లేదుకానీ, ఇంట్లోవాళ్ళనుమాత్రం దబాయించేందుకు పెద్ద నోరువుంది" పెద్దగా పక్కనవాళ్ళు వినాలనే అంటోందామె.

ఆ మాటలతో రేవతి ముఖం చిన్నబోవటం గమనించింది విజయ. విజయ ముఖం కూడా చిన్నబోయే ఉంది.

"అమ్మను గురించి పట్టించుకోకు అక్కా! అమ్మ ఎప్పుడూ అంతే"

కాసేపు తర్వాత రామ్మూర్తి గదిలోనుండి యుద్ధం విరమించి బయటికొచ్చి రేవతితో అన్నాడు.

"అమ్మా రేవతీ! లోపలికెళ్ళి నువ్వూ, అక్కా భోంచేసేరండి"

"అలాగే నాన్నా! రా అక్కా!" పిలి

చింది రేవతి.

కాళ్లు కడుక్కొని వంటగదిలోకెళ్లింది విజయ. లోపల ఎటువంటి పరిస్థితి ఎదుర్కోవాలో, ఎటువంటి అవమానం భరించాలో అని ఆలోచిస్తూనే ఉందామె. కానీ అందుకు వ్యతిరేకంగా జరిగింది.

లోపలికి వెళ్ళగానే ఆప్యాయంగా పలకరించింది మహాలక్ష్మమ్మ.

"ఏమ్మా! అమ్మా, నాన్నా బాగున్నారా?"

"బాగున్నారు పిన్నీ" చెప్పింది విజయ.

"రండి... భోంచేద్దురుగానీ"

మహాలక్ష్మమ్మ మనిషిని ఎప్పుడూ ఎదురుగా తిట్టదు. పక్కనుండి సూటిపోటి మాటలతో పొడుస్తుంటుంది.

అప్పటికి సద్దుమణిగిందని ఆలోచిస్తూనే భోజనానికి కూర్చుంది. కానీ ఆ తర్వాత కొద్దిసేపటికే మళ్ళీ పరిస్థితి యధాస్థితికి వచ్చింది.

పక్కింటినుండి ఎవరో మహాలక్ష్మమ్మ దగ్గరికి వచ్చారు. ఇంట్లో ఎవరో కొత్త మనిషి ఉండటం చూసి అడిగారు.

"ఎవరాదినా! ఆ అమ్మాయి?"

"ఈమధ్య నీకు చెప్పానుచూడు-మా బావగారి అమ్మాయిని ఒకడు చెడిపేసాడని... ఆ అమ్మాయే ఈ అమ్మాయి"

"అయ్యోపాపం! ఇంతకీ మీ ఇంటికి దేనికొచ్చింది?"

"ఇంకెందుకు అక్కడ అవమానాలు భరించలేక ఇక్కడ కొద్ది రోజులు తలదాచుకుందామని వచ్చింది"

"ఏదీ...అమ్మాయిని ఒక్కసారిచూసి వస్తాను" పక్క గదిలోనున్న విజయ దగ్గరకు వచ్చింది ఆమె. విజయను ఎగాదిగా చూసింది.

"పుత్తడి బొమ్మలాగా ఉన్నావు కదా తల్లీ! నీకెన్ని కష్టాలు వచ్చాయోకదమ్మా" జాలి కురిపిస్తూ అందామె.

మౌనంగా ఉండిపోయింది విజయ.

"ఆ దేవుడు నీలాంటివాళ్ళకే కష్టాలు రాసి పెట్టినట్టున్నాడు"

కాసేపు ఏవేవో మాట్లాడి వెళ్ళిపోయింది.

కొద్దిసేపటికి ఆ వార్త గాలికన్నా వేగంగా ఊరంతా తెలిసిపోయింది. ఆడవాళ్లు మహాలక్ష్మమ్మను పలకరించేందుకని వచ్చి విజయను చూసి, ఆమె బాధ గురించి విచారించి మరీ పోసాగారు. పల్లెటూరు జనం కావటంతో మరీ విచక్షణారహితంగా ఆమె ఎదుటే అన్నీ మాట్లాడసాగారు. వాళ్ళ మాటలతో మరిచిపోవాలనుకున్న బాధ మళ్ళీ రెట్టింపు అయింది. ఏ బాధ తప్పించుకుందామని ఇంతదూరం వచ్చిందో ఆ బాధ రెట్టింపు అయింది. పల్లెటూర్లో పొలాల వెంట తిరుగుతూ రేపటినుండి తన బాధ కొంత వరకు మరచిపోదామని వచ్చింది కానీ, ఊరంతా తన విషయం తెలిసిపోతే, ఇక వారిముందు ఎలా తలెత్తుకుని తిరగ్గలదు. ఊళ్ళో మగాళ్ళకంతా తన విషయం తెలిసే ఉంటుంది కాబోలు.

పోనీ ఇంట్లోనే కూర్చొని ఉందామన్నా తన ఇంట్లోకన్నా ఇక్కడకు ఎక్కువ జనమే వస్తున్నారు. తన ఇంట్లో ఇంకా ఇంట్లోవాళ్ళ బాధుండదు. కానీ ఇక్కడ మహాలక్ష్మమ్మ బాధ ఉంది.

సాయంత్రం పొలంనుండి తిరిగి వచ్చాడు రామ్మూర్తి. రేవతి జరిగింది నాన్నకు చెప్పింది. దాంతో రామ్మూర్తి మహాలక్ష్మమ్మ మీదకి ఎగిరాడు.

"ఇప్పుడు నేనేం చేశానని అపస్తు





న్నావు?" ఎదిరిస్తూ అంది ఆమె.

"అమ్మాయి గురించి ఎందుకు చెప్పాలి" అడిగాడు రామ్మూర్తి.

"ఏం చెప్పాను! ఎవరూ అని అడిగితే ఫలానా అని చెప్పాను"

"అలాగే చెప్పాలా... మా బంధువుల అమ్మాయి అని చెప్పితే పోదా"

"అలా దాచిపెట్టుకోవడం నాకు తెలియదు"

కోపం పట్టలేక బయటకు వెళ్ళిపోయాడు రామ్మూర్తి. పొద్దుపోయిన తర్వాత తిరిగొచ్చాడు. మౌనంగానే అందరి భోజనాలూ అయ్యాయి. తన రాక ఆ ఇంట్లో తగాదాలు సృష్టించడం భరించలేకపోయింది విజయ. తర్వాత రేవతి పక్కన పడుకుంది.

మర్నాటినుంచి ఆమెను గురించి తెలిసి చూసేందుకు ఏదో వంకతో ఆ ఇంటికి వస్తున్నారు గ్రామ ప్రజలు. తన ఇంట్లో లానే ఓ మూలగది విజయకు శరణ్యం అయింది. అంతేకాదు—తన ఇంట్లో అయితే తల్లిదండ్రుల బాధ లేదు. కానీ ఇక్కడ మహాలక్ష్మమ్మ బాధ ఒకటి. అందుకే వీలయినంత త్వరగా అక్కడినుండి వెళ్ళిపోవాలనుకుంది.

దూరంగా వచ్చినా ఎక్కడికి వెళ్ళినా తన బాధ తగ్గేట్టు లేదు. అందుకు ఏం చేయాలో అర్థం కావడంలేదు. ఆమెకు ఒక్కటే మార్గం తోచింది. తొందరగా మోహన్‌ని ఒప్పించి పెళ్ళి చేసుకుంటే, అతడి నీడలో తనకు కొద్దిగా శాంతి దొరకవచ్చు.

ఆ క్షణం ఆమె మదిలో మోహన్ మెదిలాడు. ఆమె హృదయం అతడిచుట్టూ కదలాడింది.

* * *

మోహన్ తన గదిలో కూర్చుని ఆలోచిస్తున్నాడు. తన జీవితంలోకొచ్చిన విజయ గురించే ఆలోచిస్తున్నాడు.

తను విజయను ఎంతగానో ప్రేమించాడు. ఆమెను ఓ దేవతలా ఆరాధించాడు. ఆమెను పెళ్లిచేసుకొని ఆమె సన్నిధిలో గడపాలనుకున్నాడు. కానీ కొద్దిరోజుల క్రితం ఏం జరిగింది? తను ప్రాణప్రదంగా ప్రేమించిన విజయను ఒకడు బలవంతంగా అనుభవించాడు. ఆమె శరీరం మలినమయింది. ఆమె చెడిపోవటమేకాదు.... ఆమె చెడిపోయిందని ఊరంతా తెలిసింది. ఆమెను పెళ్లిచేసుకుంటే రేపటినుండి తన బతుకేమిటి?

ఆమె చెడిపోయిన ఆడది అని ఊరందరికీ తెలుసుకదా! రేపు తనూ, విజయ రోడ్డుమీద వెళుతుంటే అందరూ తమను వింత జంతువుల్లా చూస్తారు. ఆమెను చెడిపోయిన ఆడదానిలా చూస్తే, తనను చెడిపోయిన ఆడదాని భర్తగా చూస్తారు. ఎక్కడైనా, ఎవరైనా మాటల మధ్యలో ఈ మాట ప్రస్తావిస్తారు. తన మనసు బాధపడుతుంది. తనూ, విజయా కలిసి ఎక్కడికీ షికారు వెళ్ళలేరు, కలిసి సినిమాకు కూడా వెళ్ళలేరు. అంటే ఈ సమాజాన్ని ఎదుర్కోవాలి.

ఈ సమాజానికన్నా ముందుగా తన వాళ్ళను ఎదుర్కోవాలి. ముందుగా ఇంట్లో పెద్దలతో గొడవపడాలి. అంతకు ముందు విజయను చేసుకుంటే ఏదో చిన్న సంసారం నుంచి, చిన్న కుటుంబం నుంచి ఆడపిల్లను చేసుకున్నామే అన్న బాధ మాత్రమే వాళ్ళకి ఉండేది. కానీ ఇప్పుడు ఓ చెడిపోయిన ఆడదాన్ని పెళ్లి చేసుకుంటానంటే అసలువాళ్లు ఒప్పుకోరు. వాళ్ళను ఎదిరించాలి. ఇక తన బంధువులు తన ఇంటికి రారు. వచ్చినా తన భార్యను




చెడిపోయిన ఆడదానిలా చూస్తారు. వాళ్ళ ఇళ్ళకు వెళ్లాలంటే గిల్టీగా ఫీలవ్వాలి.

పోనీ ఈ సమాజాన్ని, తల్లి దండ్రుల్ని అందర్నీ ఎదిరించొచ్చు. కానీ తనకు మానసిక తృప్తి ఉంటుందా? ఉండదు. అసలు తనకు కాబోయే భార్య ఎలా ఉండాలని భావించాడో ఆ భావానికి ప్రతిరూపమే విజయ. కానీ ఈనాడు ఆ ప్రతిరూపానికి మచ్చ ఏర్పడింది. ఆమెను పెళ్ళిచేసుకుంటే తన భార్య 'చెడిపోయినది' అన్న భావమే తన మన సులో ఉంటుంది. తన ప్రేయసి శీలవతి కాదు అన్న భావం ఈనాడే తను భరించ లేకున్నాడే? రేపు పెళ్ళయిన తర్వాత తన భార్య శీలవతి కాదు అన్న భావం తను భరించగలడా?

తను ఆమెను పెళ్లాడితే తన మన సుని తృప్తిపరచుకో లేడు. ఈ సమా జాన్ని కూడా ఎదిరించలేడు. అందు వల్ల ఆమెకు దూరంగా ఉండటమే మంచిదేమో!

తలుపు దగ్గర చప్పుడయింది. తిరిగి చూశాడు మోహన్. ఎదురుగా అమ్మ నిలబడివుంది.

"మోహన్! నిన్ను మీ నాన్న పిలు స్తున్నారు" చెప్పింది ఆమె.

లేచి ముందు గదిలోకి వచ్చాడు. శంక ర్రావు డైనింగ్ టేబుల్ ముందు కూర్చుని ఉన్నాడు.

"పిలిచారా నాన్నా?" అడిగాడు మోహన్.

"కూర్చో" అన్నాడు శంకర్రావు. కూర్చున్నాడు మోహన్. తల్లి లోపలికి వెళ్ళిపోయింది.

"మీ అన్న పెళ్ళి కుదిరింది. వచ్చే నెలలో మంచి ముహూర్తం చూసి చేసేద్దాం అనుకుంటున్నాను" అన్నాడు శంకర్రావు.

"ఆమెది ఏ వూరు?"

"మన ఊర్లోనే.వాళ్ళనాన్నకు బట్టలు కొట్టు ఉంది. ఆ పెళ్ళి కాగానే వారం తేడాలో ఉండే ముహూర్తానికి నీకు పెళ్ళి చేసేద్దామనుకుంటున్నాను"

ఉలిక్కిపడ్డాడు మోహన్. "ఇప్పుడు నా పెళ్ళికి తొందరేమొచ్చింది నాన్నా"

"రోజులు గడిస్తే ఎవరికి ఎలాంటి బుద్ధిపుడుతుందో చెప్పలేం కదా"

"మీరేమంటున్నారో నాకర్థం కావడం లేదు" అన్నాడు మోహన్.

"ఈమధ్య మన ఊర్లో విజయ అనే అమ్మాయిని రేప్ చేశారని పేపర్‌లో వేసారే, ఆ అమ్మాయితో నువ్వు తిరుగు తున్నావని తెలిసింది" కుండ బద్దలు కొట్టినట్టుగా అన్నాడు శంకర్రావు.

"ఎవరు చెప్పారు?" భయంగా అడి గాడు మోహన్.

"ఎవరు చెబితేనేం! జరిగిందా కాదా అన్నదే నాకు కావలసింది. ఇప్పుడు అబద్ధం చెప్పినా నిజం ఏనాటికైనా బయట పడుతుంది. నువ్వూ, ఆమె పెళ్ళి చేసుకో బోతున్నారని కూడా తెలిసింది. నిజం చెప్పు"

"అటువంటిదేం లేదు నాన్నా! కాక పోతే ఆమె నా స్నేహితురాలు. డిగ్రీలో నా క్లాస్‌మేట్. అందుకే ఆ సమయంలో కాస్త సహాయంగా ఉన్నాను...అంతే" అన్నాడు మోహన్.

"సరే...ఆమెకూ, నీకూ ఏ సంబంధం లేకుంటే మంచిదే. నేను నీకు పెళ్ళి చేయాలనుకుంటున్నాను.అమ్మాయికూడా రెడీగా ఉంది"

"ఇప్పుడే నా పెళ్ళికి తొందరేం

వచ్చింది నాన్నా"

"ఎప్పుడయినా కావలసిందే కదా! అది ఇప్పుడే చేసేద్దామని. అంతే కానీ నీకిష్టంలేని పెళ్ళిచెయ్యాలని కాదు. అమ్మాయిని చూడు... నీకు నచ్చితేనే ఆ అమ్మాయిని చేసుకో. లేకుంటే ఇంకొక అమ్మాయి అవుతుంది"

"నా పెళ్ళి గురించి నేను కొద్దిగా ఆలోచించుకోవాలికదా" భయంగానే అన్నాడు మోహన్.

"ఇందులో ఆలోచించుకునేదానికేముంది. సరే... అలాగే కానివ్వు. కానీ ఇంకొక్క విషయం. ఈ ఇంటికి పరువు తక్కువ చేసే పనులు మాత్రం చేస్తే ఊరుకోను. అలా చెయ్యదలచుకుంటే ఈ ఇల్లు వదిలి వెళ్ళిపో. నువ్వు కట్నం లేకుండా పెళ్ళి చేసుకుంటే ఊరుకుంటాను. కుంటి, గుడ్డి పిల్లను చేసుకుంటే ఊరుకుంటాను. కానీ చెడిపోయిన ఆడదాన్ని ఈ ఇంటికి కోడలుగా తెస్తే మాత్రం నేను ఊరుకోను. ఉరి వేసుకునయినా చచ్చిపోతాను"

ఆయన ఆ మాటలు ఎవర్ని మనసులో ఉంచుకుని అంటున్నాడో అర్థం అయింది మోహన్‌కు. మౌనంగా ఉన్నాడు మోహన్.

"సరే... నువ్వు ఏ విషయం నాకు వారం రోజుల్లో చెప్పు. ఆ తర్వాత ఆ అమ్మాయిని చూసి ముహూర్తాలు పెట్టుకుందాము"

"అలాగే నాన్నా! ఓ వారంరోజుల్లో ఏ విషయం చెబుతాను"

"సరే.... నువ్వెళ్ళు" అన్నాడు శంకర్రావు.

ఉస్సూరుమంటూ తన గదిలోకి వచ్చి కూలబడ్డాడు. విజయ తన మనస్సుకే కాదు, తన తల్లిదండ్రులకు కూడా నచ్చలేదు- ఇక ఆమెను ఎవరికోసం చేసుకోవాలి తను.

* * *

విజయ ఆ ఊరికి వచ్చి పదిహేను రోజులయింది. ఆ ఊళ్లో తన ఇంటిదగ్గర కన్నా ఎక్కువ బాధ అనుభవిస్తోంది. అసలు అక్కడ అన్నిరోజులు ఎలా ఉండగలుగుతుందో అర్థంకావడంలేదు. ఆ ఆరోజు ఆ సంఘటన జరక్కపోతే ఇంకొన్ని రోజులు ఉండేది. కానీ ఆరోజు జరిగిన ఆ సంఘటనతో ఇక అక్కడ ఉండదలచుకోలేదు ఆరోజు-

రేవతి, విజయ గదిలో కూర్చుని మాట్లాడుకుంటున్నారు.

"అక్కా! నువ్వు ఇంగ్లీషు నవలలు చదువుతావా?"

"చదువుతుంటాను... ఏం?"

"ఇంగ్లీషులో మంచి రచయితలు ఎవరక్కా?" అడిగింది రేవతి.

"జేమ్స్‌హాడ్లీ ఛేజ్, బార్బరా కార్ట్‌లాండ్, అగాథా క్రిస్టీ వాళ్లంతా ప్రముఖ రచయితలు"

"అయితే, వాళ్లలో ఎవరు బాగా రాస్తారు?"

"ఒక్కొక్కదాన్ని గురించి ఒక్కొక్కరు బాగా రాస్తారు. డిటెక్టివ్ నవలలు రాయటంలో ఛేజ్, ప్రణయకథలు బార్బరాకార్ట్‌లాండ్. ఒకొక్కరు ఒక్కోటి బాగా రాస్తారు" చెప్పింది విజయ.

వంటగదిలోనుండి మహాలక్ష్మమ్మ రేవతిని పిలిచింది.

"వస్తున్నానమ్మా" చెప్పింది రేవతి.

"ఆ గదిలోకెళితే నీకు మా మాటలు వినిపిస్తాయటే. అది నీకు ఏం బోధిస్తుందో కానీ ఆ గదినుండి ఇవతలకు రా.."

అన్నది.

"అమ్మ పిలుస్తోంది...వెళ్లు" అన్నది విజయ. రేవతి వంటగదిలోకెళ్ళింది.

"ఏమే! నీకెన్నిసార్లు చెప్పానే. దాని గదికి వెళ్ళొద్దని"

"ఏం వెడితే?'' ఎదిరించి అడిగింది రేవతి.

"అదొచ్చి నీకు ఎదిరించటం కూడా నేర్పిందటే" రేవతి జుట్టుపట్టుకుని రెండు దెబ్బలు వేసింది మహాలక్ష్మమ్మ.

''అప్పటివరకూ అదంతా వింటున్న రామ్మూర్తి లేచివచ్చాడు.

"అదేం చేసిందని దాన్ని కొడుతున్నావు?" కోపంగా అడిగాడు.

''దాని గదికి పోవద్దని ఎన్నోసార్లు చెప్పాను. ఇంకా పోతూనే ఉంది"

"ఆ గదికి పోతే నీదేంపోయింది"

"చెడిపోయిన ఆడదాని దగ్గరికి వెళితే చెడిపొయ్యే మాటలే చెబుతుంది'' చేతులు తిప్పుతూ అందామె.

ఇక ఓర్చుకోలేకపోయాడు రామ్మూర్తి. మహాలక్ష్మమ్మను బలంగా ఆ చెంపా ఈ చెంపా వాయించేశాడు. మహాలక్ష్మమ్మ నిర్ఘాంతపోయింది. అప్పటివరకూ ఆమె గయ్యాళితనాన్ని సహిస్తూనే ఉన్నా ఎన్నడూ ఆమెమీదికి చెయ్యి ఎత్తలేదు రామ్మూర్తి. దాంతో ఆమె పెద్దగా ఏడుపు ఎత్తుకుంది. ఓ మూల పడకేసింది. శోకంలో కూడా విజయపై తిట్లవర్షం కురిపిస్తూనే ఉంది. ఆమె వచ్చి తన సంసారంలో చిచ్చుపెట్టిందని పెద్దగా తిడుతూనే ఉంది.

రేవతి, విజయ ఆ పరిస్థితికి భయపడిపోయారు. ఆరోజు ఆ ఇంట్లో ఎవ్వరూ భోంచెయ్యలేదు. ఇక ఆ ఇంట్లో ఉండి ఆమెకు బాధ కలిగించదలచుకోలేదు విజయ. అందుకే ఇంటికి వెళ్ళిపోవాలని నిశ్చయించుకొని, ఆ రాత్రి పడుకునే ముందు అంది–

"బాబాయ్! రేపు నేను ఊరికి వెళ్లాలనుకుంటున్నాను"

"ఏమ్మా! మీ పిన్నిముందు నిలవలేక వెళ్ళిపోతున్నావా?" బాధగా అన్నాడు రామ్మూర్తి.

"అలాగని కాదు బాబాయ్! ఇంటికి వెళ్ళాలనిపించింది"

"అది అర్థం అవుతూనే ఉంది. సరే... అలాగే వెళ్దువులేమ్మా"

నిద్రపోయింది విజయ.

మర్నాడు ఉదయమే టిఫిన్ చేసి, గుడ్డలు సర్దుకుంది. రేవతి కళ్ళనీళ్ళు పెట్టుకుని అడిగింది–

"అక్కా! మళ్ళీ ఎప్పుడొస్తావు?"

"నీ పెళ్ళికి వస్తాలే" నవ్వుతూ అంది విజయ.

"నువ్వు రాకపోతే నేను నీ దగ్గరకు వస్తానక్కా"

"అలాగేలే" అని వంటగదిలోకెళ్ళి మహాలక్ష్మమ్మతో అంది–

"వస్తాను పిన్నీ"

ముఖం తిప్పుకుందామె.

రామ్మూర్తి సూట్ కేస్ అందుకున్నాడు. వస్తోంటే రేవతి ఏడ్చింది. ఆమెను ఏడవవద్దనీ, మళ్ళీ వస్తాననీ చెప్పి కదిలింది.

పదిగంటలకు కదిలిన బస్సు,పన్నెండు గంటలకు బస్టాండు చేరుకుంది.

"విజయా! ఇక్కడేఉండు కాసేపట్లో వస్తాను" చెప్పి కదిలాడు రామ్మూర్తి. విజయ అక్కడే ఉన్న ఓ రాతిబల్ల మీద కూర్చుంది. అప్పటివరకూ ఆమెను అనుమానంగా చూస్తున్న ఓ ఇరవయి




రెండేళ్ల అమ్మాయి దగ్గరకు వచ్చింది.

"మీ పేరువిజయకదూ?" అడిగిందామె.

అవునన్నట్టు తల వూపింది విజయ.

"ఈమధ్య రేప్‌చేసినట్టు పేపర్‌లో వేసారు. సారీ.... మీరేకదూ"

ఊపిరి బిగపట్టి తలవూపింది విజయ.

"ఆరోజు కోర్టుకి మిమ్మల్ని చూడాలని వచ్చానండీ. అప్పుడు చూసే, ఇప్పుడు మిమ్మల్ని గుర్తుపట్టాను" అన్నదామె.

మౌనంగా ఉన్నదామె.

"పాపం! మీ బతుకులో వాడు నిప్పులు పోశాడు కదూ!"

దానికి కూడామారుపలుకక మౌనంగా ఉంది విజయ.

"అసలు మీరు మీమీద అత్యాచారం జరుపుతున్నప్పుడు ఆ వెధవని అక్కడే చంపేసి ఉండాల్సింది. అప్పుడయితే మీ శీలం చెడిపోకుండా ఉండేదీ, మీకు శిక్ష పడకుండా ఉండేది. ఐ.పి.సి. 100వ సెక్షన్ కింద ఆత్మరక్షణకోసం చేసినట్టు అయ్యేది. నేను లా స్టూడెంట్‌నిలెండి. నా పేరు సుమతి" గడగడా మాట్లాడేస్తోంది సుమతి.

"అలాగా" ఏదో మాట్లాడాలి కనుక అన్నది విజయ.

"అసలు డాక్టర్ రిపోర్టు ఎలాగుంది?" అడిగింది సుమతి.

"ఏమో ! నేనసలు పరిశీలించలేదు. ఏదో అప్పుడు చూసినా గుర్తులేదు" అంది విజయ.

"రిపోర్ట్సు ఎలా ఉన్నా జడ్జి కాస్త లంచగొండి అయితే ఇక మీకు న్యాయం జరగదు" అన్నది సుమతి.

మౌనంగా ఉంది విజయ.

"ఓ సారీ! ఏమనుకోవద్దు బస్సు వచ్చేసింది. ఆ బస్సులో నేను మా ఊరికి వెళ్ళాలి... వస్తానూ" చెప్పి వేగంగా వెళ్ళిపోయింది సుమతి.

సగం తలనొప్పి తగ్గిపోయినట్టు హాయిగా ఊపిరి పీల్చుకుంది విజయ.

కాసేపటికి వచ్చాడు రామ్మూర్తి. అతడి చేతిలో ఓ గుడ్డల పాకెట్, పూలు, పళ్ళు ఉన్నాయి. వాటిని చూసి అడిగింది విజయ—

"ఏమిటి బాబాయ్! అవి ఎందుకు?"

"ఇంటికి వచ్చిన ఆడపిల్లకు పసుపు కుంకుమ పెట్టి పంపడం ఆడదానికి తెలియకపోయినా, మగాణ్ని నేనయినా చెయ్యాలికదమ్మా"

"నాకు అవన్నీ ఎందుకు బాబాయ్"

"అది పద్ధతిలేమ్మా"

రిక్షా మాట్లాడాడు రామ్మూర్తి. రిక్షాలో కూర్చున్నారిద్దరూ.

రిక్షా ఇంటి ముందు ఆగింది. విజయ, రామ్మూర్తి కిందికి దిగారు. వాళ్ళు అప్పుడే రావడం చూసి ఆశ్చర్యపడ్డారు వెంకట్రామయ్య, శారదమ్మలు.

భోజనాలు పూర్తయిన తర్వాత రామ్మూర్తి ముందు గదిలో అన్నతో ఏదో మాట్లాడుతున్నాడు — బహుశా విజయ రాక గురించి కాబోలు. శారదమ్మ విజయను అడిగింది—

"ఏమ్మా! అప్పుడే వచ్చేశావు. మీ పిన్నితో ఏదయినా తగువువేసుకున్నావా? ఏదయినా మాట్లాడుకున్నారా?"

"నేను తగువు వేసుకోలేదు. నా గురించి బాబాయ్, పిన్ని తగువు వేసుకుంటుంటే, వాళ్ళ మధ్య తగువెందుకు పెట్టాలని నేనే వచ్చేశాను" జరిగిందంతా తల్లికి చెప్పింది.

అన్నకు జరిగింది చెప్పాడురామ్మూర్తి. తన అసమర్థత గురించి కూడా చెప్ప

కున్నాడు. ఆరోజు సాయంత్రమే ఊరు వెళ్లిపోయాడు రామ్మూర్తి. వెంకట్రామయ్య దీర్ఘంగా నిట్టూర్చాడు.

విజయ మళ్లీ తన మూల గదిలోకి వెళ్ళిపోయింది. మళ్లీ మామూలే! కాకపోతే మహాలక్ష్మమ్మ లాంటిది కాదు తన తల్లి!

కానీ ఈ గదిలోనుండి వెలుపలికి వెళ్లే మార్గం తనకు లేదు! ఇది తనకు జైలుశిక్ష కాబోలు. ఏ రెండేళ్ళ తర్వాతో నిందితుడికి కోర్టు జైలు శిక్ష వేస్తే, ఏమీ లేకుండానే ఈ సమాజం తనకు ఈ జైలుశిక్ష విధించింది.

తను ఈ గదిలో నుండి బయటి ప్రపంచంలోకి రావాలంటే కేవలం ఒకే మార్గం ఉంది. అది- మోహన్‌కూ, తనకూ పెళ్ళి. మోహన్‌తో తన పెళ్లయితే ఇద్దరూ కలిసి బతకొచ్చు. అతడితో కాలం గడపవచ్చు అని ఆలోచిస్తోంది విజయ.

రేపు మోహన్‌ను ఇంటికి పిలిపించుకోవాలి. అతడింటికి తను వెళ్ళలేదు. మరి ఎవర్ని పంపిస్తుంది? ఆమె మదిలో రమణ మెదిలాడు. రెండు వీధులు దాటి వెళితే రమణ గది వస్తుంది. అతడి గదికి రేపు రాత్రికి వెళ్ళి తను వచ్చినట్టు మోహన్‌కు చెప్పి పంపించాలి. వీలయినంత త్వరలో ఈ జైలుశిక్ష నుండి తప్పించుకోవాలి.

ఆలోచిస్తూనే ఆ రాత్రి గడిపింది. ఎంతకీ నిద్ర పట్టలేదు. అంతకుముందు రమణ పంపించిన పుస్తకాలు తీసుకొని చదువుకోసాగింది. అలా ఎప్పటికి నిద్రపట్టిందో గానీ ఆ రాత్రంతా కలత నిద్రే.

మర్నాడు ఉదయమే మోహన్ విజయ ఇంటికి వచ్చాడు ఆమె ఉంటుందని కాదు– ఆమె అడ్రసు అడిగి, పెళ్లి గురించి, తనపై వస్తున్న వత్తిడి గురించి ఆమెకు జాబు రాయాలని. తను పెళ్లికి అంగీకరించబోయే ముందు ఆమెకు తెలపడం తన కనీసధర్మం అనుకున్నాడు మోహన్. కానీ అతడి ఊహకు వ్యతిరేకంగా అప్పటికే విజయ వచ్చింది.

మోహన్‌ను చూసి ఆనందంగా పలకరించింది విజయ.

"నేను వచ్చానని నీకెలా తెలుసు? ఈ రాత్రికి రమణతో చెప్పి నీకు తెలపాలనుకున్నాను"

"నీవు వచ్చావని తెలిసి రాలేదు. నీకు ఒక విషయం గురించి జాబు రాద్దామని, అడ్రసు కోసం వచ్చాను" అన్నాడు మోహన్.

"నాకు ఉత్తరం రాసేదానికా ! ఏదైనా ముఖ్యవిషయమా?"

"అవును.... ముఖ్యవిషయమే"

"ఏమిటి?" ఆత్రుతగా అడిగింది విజయ.

కాసేపు మౌనంగా ఉండి తర్వాత అన్నాడు.

"మా నాన్న నా పెళ్లి చేసెయ్యాలని ఓ అమ్మాయిని చూసి వచ్చాడు"

ఉలిక్కిపడింది విజయ.

"మరి....మన గురించి చెప్పావా?"

"మన గురించి కూడా ఆయనకు తెలిసింది. అసలు అందుకే ఈ హఠాత్ నిర్ణయం. నేను నిన్ను పెళ్ళిచేసుకుంటే తను చస్తానన్నాడు. నన్ను ఇంట్లోకి రావద్దన్నాడు. ఓ మామూలు ఇంటిలో నుండి కట్నం లేకుండా ఎవరినైనా చేసుకో ఒప్పుకుంటాం కానీ శీలం లేని ఆడది అని పేరుపడ్డ స్త్రీని మాత్రం చేసుకుంటే ఒప్పుకోం అన్నారు"

తెల్లబోయింది విజయ.

 

"మరి నువ్వేం అన్నావు?" గొంతు పెగుల్చుకుని అడిగింది.

"ఓ వారం రోజులుదాకా గడువు అడిగాను"

"ఎందుకు?" అడిగింది విజయ.

"నీకు చెప్పి నా నిర్ణయం తెలియజేద్దామని" అన్నాడు మోహన్.

"ఏమిటి నీ నిర్ణయం ?" అడిగింది విజయ.

''అదే నీతో చర్చిద్దామని వచ్చాను'' అన్నాడు మోహన్.

"నాతో మాట్లాడేదానికా. ఏమిటి నాతో మాట్లాడేది?" ఏదో అనుమానం రాగా అడిగింది విజయ.

''అదే! నీకు ఎన్నో ఆశలు కల్పించాను. వాటిని ఈనాడు కూలగొట్టబోతున్నాను'' బాధగా అన్నాడు మోహన్.

"అంటే...?" ఉలిక్కిపడుతూ అడిగిందామె.

"నావలన నా తల్లిదండ్రులు ఏదయినా అఘాయిత్యం చేసుకోవడం నేను భరించలేను''

బిత్తరపోయి చూసింది విజయ. కాసేపు తర్వాత అంది—

"మరి నన్ను పెళ్ళిచేసుకుంటానని మొదట్నుంచి నమ్మించావే.... ఆరోజు తెలియదా— నీవు నన్ను పెళ్ళిచేసుకుంటే నీ తల్లిదండ్రులు అఘాయిత్యం చేసుకుంటారని?"

''ఈనాడు కూడా మా తల్లిదండ్రులు ఎవరినైనా, కట్నం లేకుండా అయినాసరే పెళ్ళిచేసుకోమనే అంటున్నారు. శీలంలేని ఆడదాన్ని కోడలుగా తేవద్దు అని మాత్రమే అంటున్నారు"

"మోహన్" పెద్దగా అరవాలనుకుంది. కానీ ఆ మాట గొంతు పెగలి బయటికి రాలేదు.

"మరి నువ్వు నన్ను ప్రేమించలేదా?" ఆశగా అడిగింది విజయ.

"నిన్ను ప్రేమిస్తూనే ఉన్నాను. పెళ్ళి చేసుకోవాలని కూడా అనుకుంటున్నాను. కానీ నిన్ను పెళ్ళిచేసుకుంటే ఈ సమాజాన్ని ఎదిరించాలి.

అది నావల్ల కాదు. అంతేకాదు—నా భార్య శీలవతిగా ఉండాలని నేను కోరుకుంటున్నాను" అన్నాడు మోహన్.

''అంటే నా మనసుకంటే, నా శరీరమే నీకు ముఖ్యమా!"

మౌనంగా ఉన్నాడు మోహన్.

"ఈ సమాజాన్ని ఎదిరించాలని అన్నావే, ఈసమాజానికి తెలిసేట్లు నన్ను కోర్టుకు ఈడ్చి, నడివీధిలో నిలబెట్టి ఈనాడు ఇలాచెయ్యడం నీకు న్యాయమా మోహన్" ఏడుస్తూ అంది విజయ.

"నేను నీముందు చేసిన ఒకే ఒక పొరపాటు అది. దానికి నేను ఎంతో బాధపడుతున్నాను''

"బాధపడితే పోయిన నా పరువు తిరిగి వస్తుందా! ఈ సమాజం నన్ను మామూలుగాపాతవిజయలాచూస్తుందా?"

దానికి మోహన్ మౌనంగా ఉన్నాడు.

కాసేపు తర్వాత విజయ అంది-

"మోహన్! నా బతుకు ఏం చెయ్యాలనుకుంటున్నావు ?"

''ఏం చెయ్యాలో తోచకే, రాత్రంతా తలపగలకొట్టుకున్నాను. ఏమీ తోచలేదు"

"తల పగలకొట్టుకుంటే తోస్తుందా?'' అడిగింది విజయ.

దానికి బదులు పలకలేదు మోహన్.

"మరి నేనేం కావాలి?" అన్నదివిజయ.

"విజయా! నీకు ఏమీ జరక్కుండా పవిత్రంగా ఉంటే నిన్ను నేను పెళ్ళి




చేసుకుందామనుకున్నాను. నా తల్లి దండ్రులు అప్పుడు అభ్యంతరం కూడా పెట్టివుండరు. ఇప్పుడు అన్నీ అడ్డంకులే"

"అంటే ఇప్పుడు నేను చెడిపోయానని, నన్ను చేసుకోలేనని అంటావు. సరే! ఇంతవరకూ నిన్ను బ్రతిమలాడి నందుకు చెంపలేసుకుంటున్నాను. అలాగే మరో పవిత్రంగా ఉండే ఆడదాన్ని చూసి పెళ్ళిచేసుకో!"

"విజయా..." ఏదో చెప్పబోయాడు మోహన్.

"ప్లీజ్... గెటౌట్"

"సరే.... వెళ్తున్నాను" మోహన్ లేచాడు.తలదించుకొనివిసురుగా బయటకు వెళ్ళిపోయాడు.

విజయ మంచంమీద పడి వెక్కి వెక్కి ఏడవసాగింది.

"ఏం జరిగిందమ్మా?" అడిగింది శారదమ్మ.

"ఏముందీ... నన్ను పెళ్ళిచేసుకుంటే అతడి తల్లిదండ్రులు చస్తామని బెదిరించారట. అందుకని మరో పెళ్ళి చేసుకోబోతున్నాడట. అది చెప్పేందుకు వచ్చాడు" ఏడుస్తూ అంది విజయ.

"అలా ఎందుకన్నారట?''

"నేను చెడిపోయానని. చెడిపోయిన ఆడదాన్ని కోడలుగా తేవద్దు... ఇంకెవరినైనా పెళ్ళి చేసుకో అన్నారట"

"అయ్యో! ఇక నీ బతుకెలాగే"తనూ ఏడుపు అందుకుంది శారదమ్మ.

మధ్యాహ్నం వెంకట్రామయ్య వచ్చాడు. అతడికి విషయం చెప్పింది శారదమ్మ. కాసేపు తలపట్టుకుని కూర్చున్నాడు వెంకట్రామయ్య.

"సరే...విషయం కనుక్కుని వస్తాను" ఫోంచేసి బయటకు వెళ్ళాడు వెంకట్రామయ్య. తిన్నగా బాంక్ కి వెళ్ళాడు అతడు.

"మోహన్" కౌంటర్ దగ్గరికెళ్ళి పిలిచాడు వెంకట్రామయ్య.

వెంకట్రామయ్యను చూసి ఉలిక్కిపడి లోపలినుండి వచ్చాడు.

"నీతో కొద్దిగా మాట్లాడాలి బాబూ!"

"పదండి అలా హోటల్ లో కూర్చుందాం" హోటల్ వైపు దారి తీశాడు.

హోటల్ లో కూర్చున్న తర్వాత మోహన్ అన్నాడు "చెప్పండి"

"అమ్మాయితో ఏదో గొడవ పడ్డావని తెలిసింది" మెల్లగా అన్నాడు.

"గొడవేం కాదండీ. నా పరిస్థితి చెప్పాను"

"కానీ అమ్మాయి పరిస్థితి కూడా కొద్దిగా ఆలోచించు బాబూ"

"అన్నీ ఆలోచించాను. ఇంతకన్నా ఏ దారీ దొరకలేదు"

"నువ్వు ఈ నిర్ణయం తీసుకునేదానికి మా అమ్మాయి చేసిన తప్పేమిటి?"

"మీ అమ్మాయి చేసిన తప్పు మీకు తెలియదా?"

"కానీ అది ఆమె తెలిసి చేసిన తప్పు కాదుకదా"

"తెలియక చేసినా, ఆమె చేసినా, ఎవరు చేసినా పోయింది ఆమె శీలమే కదా"

"ఆమె బతుకు నడివీధిపాలు చేయడం న్యాయం కాదు"

"నిజమే....ఆమెను ప్రేమించాను కానీ ఆమెను గర్భవతిని చేసి రోడ్డుమీద వదల్లేదుకదా! పెళ్ళి చేసుకుంటానని చెప్పాను. ఈ విధంగా జరిగివుండకపోతే ఆమెను పెళ్ళిచేసుకుని ఉండివుండే

వాడినే"

"ఇప్పుడు ఆమె మీద అత్యాచారం జరిగిందని ఆమెను పెళ్లిచేసుకోవడం మానేస్తావా?" అడిగాడు వెంకట్రామయ్య.

"చూడండీ! మీ గుండెలమీద చెయ్యి వేసుకుని చెప్పండి. మీరు ఓ శీలంలేని ఆడదాన్ని తెలిసి తెలిసి పెళ్లిచేసుకో గలరా?" వెంకట్రామయ్య వైపు చూస్తూ అన్నాడు.

ఆయనా మగాడే. ఆడదాని శీలంమీద నమ్మకం ఉన్నవాడు. అందులో పాతకాలం మగాడు. అందుకే ఒక్కసారి తడ బడ్డాడు.

"బాబూ....ఇవి చేతులు కావు కాళ్లు నుకో. మా అమ్మాయి బతుకు నాశనం చెయ్యొద్దు" మోహన్ చేతులు పట్టుకు న్నాడు వెంకట్రామయ్య.

"నా తల్లిదండ్రుల్ని నేను పోగొట్టు కోలేను" ఖచ్చితంగా అన్నాడు మోహన్.

"బాబూ! ఈనాడు మా బతుకులు నడి వీధిలో ఉండేదానికి కారణం నువ్వు. పోలీస్ కేస్, కోర్టులవలన మా బతుకులు నాశనం అయ్యాయి"

"దానికి నేనూ బాధపడుతున్నాను. నేను చేసిన తప్పుకు ధనరూపంలో ఇచ్చి రుణం తీర్చుకుంటాను" అన్నాడు మోహన్.

అప్పటివరకూ ఓర్పు వహించిన వెంక ట్రామయ్యకు కోపంవచ్చింది.

"చాలా బాగా చెప్పావు. నువ్విచ్చే డబ్బుతో పోయిన పరువు తిరిగి కొనుక్కో మంటావా?" వ్యంగ్యంగా అన్నాడు వెంకట్రామయ్య.

"అలా అనికాదు..ఏదన్నా సంబంధం చూడండి. నేను ఇంతకన్నా చెయ్యగలి గింది ఏమీలేదు"

"చాలా మంచిది బాబూ....నీ డబ్బు నీ దగ్గరే ఉంచుకో. ఈ విషయం కూడా గుర్తుపెట్టుకో. మమ్మల్ని నడివీధిలో పెట్టిన పాపం నిన్ను ఊరికే వదలదు. నా బిడ్డను నమ్మించి ద్రోహంచేశావు. ఆ ఉసురు నీకు తప్పక తగులుతుంది" పెద్దగానే అని విసురుగా వెళ్ళిపోయాడు వెంకట్రా మయ్య.

భారంగా అడుగులేసుకుని వస్తున్న భర్తను చూసి శారదమ్మ అడిగింది-

"ఆ అబ్బాయి ఏమన్నాడండీ?"

"దాని బతుకు ఇక ఇంతే! దాన్ని ఆ దేవుడే కాపాడాలి" అన్నాడు వెంక ట్రామయ్య.

"అంటే....పెళ్ళి చేసుకోనన్నాడా?" అడిగింది శారదమ్మ.

"అవును....చెడిపోయిన ఆడదాన్ని చేసుకోలేడట. చెడిపోకుండా ఉండివుంటే చేసుకునివుండేవాడట"

"అయితే అమ్మాయి బతుకు ఏం కావాలి?" బాధగా అడిగింది శారదమ్మ.

"ఏదయినా మంచి నుయ్యి చూసుకుని దూకమను. అందరికీ బాధ లేకుండా పోతుంది" కోపంగా అన్నాడు వెంక ట్రామయ్య.

శారదమ్మ లోపలకెళ్ళి ఏడవసాగింది.

విజయ గదిలో నుండి అవన్నీ వింటోంది. తండ్రి అన్నట్టు తనకు ఇక ఏ నుయ్యో గొయ్యో శరణ్యమా! ఛీ.... చచ్చి సాధించేది ఏమీలేదు. ఏదయినా బతికే సాధించాలి. మనసులోనే అనుకుంది.

ఇంతవరకూ ఈ సమాజం నుండి దూరంగా ఉండిపోయింది. కానీ తనలో ఒక్క ఆశ వుండేది. అది తనను మోహన్ పెళ్లి చేసుకుంటాడని. ఇప్పుడు

ఆ ఆశ కూడా పోయింది. ఇక తను ఎందుకు బతకాలి? సమాజం అసహ్యించుకుంది. ప్రేమించిన వ్యక్తి దూరం అయ్యాడు. ఇక తల్లిదండ్రులకోసమా! వాళ్లు కూడా తనని ఇంకెంతకాలం ప్రేమగా చూస్తారు? నిప్పుల కుంపటిని గుండెలమీదనుండి త్వరగా దించుకోవాలనే ప్రయత్నిస్తారు. తొలిసారి విరక్తిగా నవ్వుకుంది విజయ. ఆ క్షణమే ఆమెలో విరక్తి ప్రవేశించింది. కానీ అది కొద్దిసేపే. మళ్ళీ ఆమె ఆలోచనలు మోహన్ చుట్టూ తిరగాడసాగాయి.

ఆరోజు రాత్రి మోహన్ ఇంటిలో- డైనింగ్ టేబుల్ ముందు కూర్చుని ఉన్నాడు శంకర్రావు. మోహన్ ఎదురుగా కూర్చున్నాడు.

"నాన్నా! నీకు నచ్చిన అమ్మాయినే పెళ్ళిచేసుకుంటాను. కానీ ఒక్క నెల రోజుల వరకూ నా పెళ్ళి గురించి ఏమీ అనుకోవద్దు. ముందు అన్న పెళ్ళి చేసెయ్యండి" అన్నాడు మోహన్.

"ఎందుకని?" అడిగాడు శంకర్రావు.

"కారణాలు అడగవద్దు. ఒక్క నెల తర్వాత నువ్వు చూపించిన అమ్మాయి మెడలో తాళికడతాను. కానీ ఈ నెల రోజులు నన్ను వదిలెయ్యి" బతిమలాడినట్లు అన్నాడు మోహన్.

శంకర్రావు మరి బలవంతం చెయ్యలేదు. వయసు వచ్చిన పిల్లల్ని బలవంతం చేస్తే తిరగబడే ప్రమాదముందని ఆయనకు తెలుసు. అందుకే ఆయన అన్నాడు-

"సరే మోహన్! నీ ఇష్టప్రకారమే కానివ్వు. మరో నెలరోజుల వరకూ నీ పెళ్ళి ప్రస్తావన ఎత్తను. కానీ ఈ నెల రోజుల్లో నువ్వు మాకు అపకారం చేసే పని చెయ్యవని ఆశిస్తాను"



# 8

విజయ మీద అత్యాచారం జరిగి రెండు నెలలయింది. ఆ గదిలోనే కాపురం చేసి చేసి లోకం ముఖం చూడటం మానుకున్నాక ఇప్పుడు ఒకవిధమైన తిరుగుబాటు తత్వం కలుగుతోంది. అసలు తను చేసిన తప్పేమిటి? ఎవడో చేసిన అత్యాచారానికి తను బాధపడాలా? తన తప్పు లేకుండానే తను చెడిపోయిందని అంటున్నారుకదా! తనతోపాటు ఆ మగవాడు ప్రకాష్ని కూడా చెడిపోయినవాడని అంటున్నారా? ఏం... మగవాడయితే చెడిపోడా? వాళ్లు ఏంచేసినా చెడిపోని ఒక ప్రత్యేక జాతా? మగవాడు చెడిపోకపోతే ఆడది ఎలా చెడిపోతుంది? అసలు చెడిపోవడం అంటే అర్థం ఏమిటి? ఈ లోకంలో కష్టాలు, అపవాదులు ఆడదానికేనా! ఆలోచిస్తోంది విజయ.

ఆమెకు ఇంకొక్క విషయం కూడా అర్థమయింది. అది తను తల్లిదండ్రులకు భారంగా మారానని. ప్రస్తుత సమాజంలో ఆడపిల్ల తల్లిదండ్రుల గుండెలమీద కుంపటిలా మారిపోయింది. తమ ఆడపిల్లనుఇక ఎవ్వరూ పెళ్ళిచేసుకోరంటే ఆ తల్లిదండ్రుల బాధ మామూలేకదా! ఆడపిల్లకు వరకట్నం ఇచ్చి తమ బాధలు తాముపడి ఎలాగో సాగనంపాలనుకుంటే




ఇప్పుడు ఈ బాధ ఒకటి వచ్చిపడింది.

తన తల్లిదండ్రులు కూడా తను బాధ పడేవిధంగా మాట్లాడటం మొదలు పెట్టారని గమనించింది విజయ.

ఒక్కోరోజు 'ఇంటికి శని పట్టింది తల్లీ' అనేది అమ్మ.

ఇంకొకరోజు 'బిడ్డలు శత్రువులుగా మారుతారంటే ఏమో అనుకున్నానమ్మా! ఇప్పుడు ప్రత్యక్షంగా అనుభవిస్తున్నాను' అనేది.

మరోరోజు 'పుణ్యంకొద్దీ పురుషుడు, దానంకొద్దీ బిడ్డలు అంటారు. నేను ఏ జన్మలో దానం చెయ్యలేదోమ్మా' అంటుండేది.

తర్వాత రోజు 'బిడ్డలవలన సుఖపడాలి అన్నా రాసిపెట్టివుండాలి. మాకు భగవంతుడు బిడ్డలవలన కష్టాలు పడాలి అని రాసిపెట్టాడు కాబోలు' అంది.

ఆ మాటలు విజయగుండెల్లో దూసుకుపోసాగాయి. ఆ ఇంట్లో కూడా ఉండాలనిపించటం లేదు. బయటకు ఎక్కడికైనా కాసేపు వెళ్ళాలనిపించింది. తన బాధ ఎవరితోనైనా కాసేపు చెప్పుకోవాలనిపించింది. ఎవరున్నారు? తనకు మిత్రురాలు అంటూ ఎవరూ లేరు. మరెవరున్నారు? తన మాటల్ని సహృదయంతో విని తనను అర్థంచేసుకునేవాళ్లు ఎవరున్నారు? ఆ క్షణం ఆమె మదిలో మెదిలాడు రమణ. అవును... అతడయితే తన మాటల్ని విని సహృదయంతో అర్థం చేసుకోగలడు. మగవాణ్ని నమ్మి వెళ్ళేందుకు దెబ్బతిన్న ఆమె హృదయం ఒక్కక్షణం శంకించింది. ఛీ..అందరూ అలాగే ఉంటారా! మనుషుల్లో మంచివారే లేకుండా ఉన్నారా! అయినా మనుషుల్ని నమ్మకుండా ఈ లోకంలో ఎంతకాలం బతకగలం– మనసులోనే అనుకుని, ఆలోచించి పోవాలనే నిశ్చయించుకుంది.

సాయంత్రం కనుచీకటి పడే సమయంలో రమణ గదికి వెళ్ళేందుకు సిద్ధమయింది విజయ. చాలారోజుల తర్వాత తన కూతురు ఎక్కడికో బయలుదేరడం చూసి శారదమ్మ అడిగింది–

"ఎక్కడికి?"

"అలా ఓ స్నేహితురాలు ఇంటికి వెళ్ళివస్తాను" అని చెప్పి వీధిలో కొచ్చింది విజయ. చాలాకాలం తర్వాత వీధిలోకి ఒంటరిగా అడుగుపెట్టడంతో కొద్దిగా భయం వేసింది.

వీధి చివరి ఓ రౌడీమూక కూర్చుని సిగిరెట్స్ కాలుస్తున్నారు. విజయను చూసి కళ్ళెగరేసి ఉషారుగా ఈల వేశారు. విజయ వాళ్ళముందు నుంచే వెళ్ళవలసివచ్చింది. తల వంచుకొని నడుస్తోంది.

"ఏరా! ఈ పిట్టనే కదా మొన్న ఎవడో రేప్ చేసింది" అన్నాడు ఒకడు.

"అవున్రా... వాడు ఎవడో లక్షాధికారేరా. వాడూ మంచివాడే పాపం. కానీ దీని అందాన్ని చూస్తూ ఏ మగాడు మాత్రం ఊరుకోగలడు"

"చూడరా! ఎలా కులుకుతోందో!"

"ఇంతకీ ఈవేళప్పుడు ఎక్కడికిరా?" అన్నాడు మరొకడు.

"రుచిమరిగిన పెట్టకదరా! ఎక్కడికో పుంజుకోసం వెళుతున్నట్టుంది" అన్నాడు మరొకడు.

"మనం డబ్బులు కూడా ఇస్తాం రమ్మనరా! ఎలాగూ ఒకసారి చెడిపోయిందే కదా! ఇంకా పోజులెందుకు"

వంచిన తల ఎత్తకుండా ముందుకు

పోతోంది విజయ. కొద్దిదూరం వెనకే ఈలలు వేస్తూ వెంబడించారు.

విజయకు ఏడుపు ముంచుకొస్తోంది. గద్దల్లా మాటలతో పొడిచే ఈ మనుషుల మధ్యకు ఎందుకు వచ్చానా అనిపించింది.

కొద్దిదూరం వెంబడించి, వెనక్కు తిరిగి వెళ్ళిపోయారు వాళ్లు.

రమణ గది సమీపించింది. కంటి నీటిని తుడుచుకొని రమణ గది లోపలికి వెళ్ళింది.

రమణ ఏవో కాగితాలు చదువు కుంటున్నాడు. వాకిట్లో చప్పుడు కావటం చూసి తిరిగి చూశాడు. వాకిట్లో నిలబడి ఉంది విజయ.

ఆ సమయంలో ఆమెరావటం ఆశ్చర్య మేసింది రమణకు.

"రండి... చాలాకాలానికి వచ్చారు" హడావుడిగా పిలిచాడు రమణ.

"ఏదో ఇంట్లో ఏమీ తోచలేదు. అందుకని ఇలా వచ్చాను" తను ఎందుకు వచ్చిందో సంజాయిషీ ఇచ్చుకుంటున్నట్లు అంది.

"మీరెందుకు వచ్చారు అని నేను అడిగానా! అసలు మీరు రావటమే సంతోషం. కాకపోతే ఒక్కటే బాధగా ఉంది"

"ఏమిటి?" ఆశ్చర్యంగా అడిగింది.

"మీతోపాటు కూడా వర్షం రాలేదే అని"

నవ్వేసింది విజయ. "ఎప్పుడో ఓసారి వచ్చిందని ప్రతిసారీ వస్తుందా"

తనూ నవ్వేశాడు రమణ.

"ఏమిటి ఆ కాగితాలు, నవల పూర్త యిందా?" అడిగింది విజయ.

"ఈమధ్య రాయకుండా మూల పడేసి ఉన్నాను. మొన్ననే తీసి పూర్తి చేశాను. కానీ ఇంకా ఓ పదిపేజీలు మిగిలి పోయాయి. అదే ముగింపు పూర్తి చెయ్య లేదు. రేపు పూర్తిచేసి, ఎల్లుండి ఏదయినా పత్రికకు పంపిస్తాను"

కాసేపు తర్వాత అంది విజయ-

"మీరు మా ఇంటికి రావటంలేదే"

"నేనెందుకండీ? మోహన్ వస్తున్నాడుగా!"

"లేదండీ... ఇప్పుడు రావటంలేదు" బాధగా అంది విజయ.

"ఏం...ఎందుకని?" అడిగాడు రమణ.

"అతడికి పెళ్ళి కుదిరిందట. మీకు తెలియదా?"

"లేదు. ఈమధ్య నా దగ్గరకు రావటం లేదు. వచ్చినా ఈ విషయాలన్నీ నాకు చెప్పడు. చెబితే తిడతానని భయం. అయినా మీరు ఒకరినొకరు ప్రేమించుకున్నారుగా! ప్రేమించిన మనిషిని పెళ్ళిచేసుకునేం దుకు ఏమొచ్చిందట" అడిగాడు రమణ.

"నేను శీలం లేని ఆడదాన్నట" జీరగా అంది విజయ.

"స్టుపిడ్" అసహ్యంగా అన్నాడు రమణ.

కాసేపు తర్వాత విజయ అడిగింది-

"రమణగారూ! నాకు తెలియక అడుగుతానూ... ఈ ప్రపంచంలో ఆడది, మగాడు సమానులే కదా! సంసారరథంకి ఇద్దరూ చెరో చక్రం కదా! మరి అలాం టప్పుడు ఆడదాన్ని ఇంట్లోనే ఉంచి, కట్టుబాట్లు పెట్టి, వారిని అందమైన బొమ్మలుగా చులకనగా చూస్తారెందుకని? మగవాడు తప్పుచేసినా ఆడదాన్నే శిక్షిస్తారెందుకని?"

ఆమె బాధగా అన్న ఆ మాటలతో అతడు చలించిపోయాడు. ఎంతగా బాధపడి ఉండకపోతే ఆమెకు ఆ




భావాలు ఏర్పడతాయి.

"ఇందుకు చాలా చెప్పాల్సి ఉంటుంది. మీరు వినగలరా"

"వినాలనే అడిగాను. చెప్పండి" అంది విజయ.

"చెబుతానువిజయగారూ!తరతరాలుగా మగవాడు ఆడదాన్ని అబలగా మార్చి మూల కూచుండ బెట్టాడు. పాతకాలంలో స్త్రీ, పురుషలిద్దరూ తమ ఆహారాన్ని వేటాడుకునేవారు. క్రమంగా కుటుంబ వ్యవస్థ వచ్చింది. అప్పుడు స్త్రీ, పురుషులు ఇద్దరూ బాధ్యతను పంచుకున్నారు. ఆహార సంపాదన పురుషుడి కర్తవ్యం. స్త్రీ ఇంటిలోవుండి అతడికి కావలసిన సదుపాయాలుచేయడం చేస్తుం దేది. అతడి ద్వారా తనకు కలిగిన బిడ్డలకు సరియైన పోషణ ఇవ్వడం తన కర్తవ్యంగా భావించేది. క్రమంగా పురుషుడు తన ఆధిక్యతను సంపాదించుకొని స్త్రీ మీద పెత్తనం చెలాయించడం మొదలుపెట్టాడు. ఆమెకు కొన్ని కట్టుబాట్లు ఏర్పరిచాడు. స్త్రీ శీలానికి ప్రాధాన్యత కల్పించాడు. అదే సమయంలో మగవాడు ఎలాగయినా ప్రవర్తించవచ్చుననే విధంగా ప్రచారం చేసుకున్నాడు. ఆవిధంగానే పురాణాలు, కథలు రాయబడ్డాయి...

"స్త్రీలు సహజంగా సున్నిత హృదయులు. వారు వీలయినంత వరకూ తాము అణగివుండేదానికే ప్రయత్నిస్తారు. ఆ అణగివుండే తత్వాన్ని ఆసరాగా తీసుకుని పురుషుడు స్త్రీపై పెత్తనం చెలాయించటం మొదలుపెట్టాడు...

"మతగ్రంథాలను ప్రామాణికంగా చూపించాడు. అన్ని మత గ్రంథాలలో అలాగే ఉంది. క్రైస్తవ మతంలో స్త్రీ మగవాడి పక్క ఎముకనుండి తయారు చేయబడి అతడికి అన్ని పనులలో సహాయం చేసేదిగా రాయబడింది.హిందూ మతంలో స్త్రీ మగవాడి అడుగుజాడల్లో నడిచేందుకు సృష్టించబడినట్లు రాసివుంది. ఇస్లాం మతంలో స్త్రీ ఇంటిలోనే ఉండి మగవాడికి ఆనందాన్ని ఇచ్చే యంత్రంలా వర్ణించబడింది. అందుకే ఇస్లాం మతంలో ఒక పురుషుడు ఎందరు స్త్రీలనయినా పెళ్ళిచేసుకోవచ్చు.

"క్రమంగా స్త్రీ మగవాడి ఆధిక్యతకు లోబడిపోయింది. అతడి అడుగుజాడల్లో నడుచుకోవటం మొదలుపెట్టింది. నిజానికి స్త్రీలు అబలలు కారు. నేడు స్త్రీలు ఎన్నోరంగాలలో బలవంతులుగానే గుర్తింపబడుతున్నారు. అంతేకాదు సైన్సు ప్రకారం కూడా స్త్రీ బలవంతురాలే" ఆగాడు రమణ.

"ఆడదానికి ఈ స్థితి మనదేశంలోనేనా? లేక మరేదైనా దేశాల్లో ఉందా?"

"చెప్తాను. కానీ ఇలాంటివి వినాలంటే తలనొప్పిగా ఉంటుంది. అందుకని డికాషన్ కాసుకుని తాగుతూ మాట్లాడుకుందాం"

"ఇప్పుడు అవన్నీ ఎందుకండీ ?" మొహమాటంగా అంది విజయ.

"ఎంత... రెండు నిముషాలేగా" లేచి నీళ్ళు స్టౌమీద పెట్టి, స్టౌ వెలిగించాడు.

"స్త్రీకి అన్యాయం మనదేశంలోనే కాదు... మరికొన్ని దేశాల్లో కూడా జరుగుతోంది. అరబ్బు దేశాలలో స్త్రీ ఓ అందమైన, ఆనందాన్ని ఇచ్చే విలాస వస్తువుగా చూడబడుతోంది. అక్కడిస్త్రీలు మనదేశంలోని స్త్రీలకన్నా అధ్వాన్నంగా బతుకుతున్నారు. వారి అభిప్రాయాలను గౌరవించాలనే నియమంలేదు అక్కడ.




అయితే మరికొన్ని దేశాలలో మరో విధమైన సాంప్రదాయాలు ఉన్నాయి. ఉదాహరణకు దక్షిణ అమెరికాలోని ఓ జాతి స్త్రీలు మొగుళ్లు తమను ఎంతగా కొడితే అంతగా ఆనందిస్తారట. అంటే ఎంతగా కొడితే అంతగా ప్రేమున్నట్టు వారి అభిప్రాయమట" చెప్పాడు రమణ.

"చాలా వింతగా ఉందే" అన్నది విజయ.

రమణ లేచి వేడిచేసిన నీళ్ళలో కాఫీ పొడి, చక్కెర వేసి తెచ్చి చెరొక గ్లాసు అందుకొని కూర్చున్నాడు.

"అది వింతగానే ఉంది. అయితే ప్రపంచం మొత్తంమీద పాశ్చాత్య దేశాలలో స్త్రీలు ఎక్కువగా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు అనుభవిస్తున్నారు. వారికి ఉన్న కట్టుబాట్లు చాలాకొద్ది. అక్కడ మొగుణ్ని వరకట్నమిచ్చి కొనుక్కోనవసరంలేదు. ఆడబిడ్డకు లాంఛనాలిచ్చి తృప్తిపరచ నవసరంలేదు. మనం ముఖ్యంగా చూడవలసిన దేమిటంటే పాశ్చాత్యుల ప్రభావం మన దేశస్థుల మీద ఎంతో ఉంది. వారి వేషభాషలు నేర్చుకున్నారు. వాళ్లు చలినుండి తట్టుకునేందుకు టీ, సిగరెట్, విస్కీలాంటివి తాగితే మనవాళ్ళు అవి లేనిదే బతకలేనంతగా అలవాటు చేసుకున్నారు. వారి దుర్వ్యసనాలన్నీ నేర్చుకున్నారు. కానీ వారి మంచిలక్షణాలు నేర్చుకోలేదు. స్త్రీని నీచంగా చూడటం, వరకట్నం లాంటివి తీసుకోవడం ద్వారా భారతీయ సంస్కృతిని నిలబెడుతున్నారు. ఒక దేశ ఔన్నత్యం ఆ దేశ స్త్రీలు అనుభవించే స్వేచ్ఛా స్వాతంత్ర్యాలమీద ఆధారపడి ఉంటుంది. దాన్నిబట్టి మనదేశంలోని స్త్రీల స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు చూస్తే మన దేశం ఎంత అధ్వాన్న స్థితిలో ఉందో అర్థంఅవుతుంది"

"అంటే పాశ్చాత్య దేశాలలోలా స్త్రీకి శీలం అవసరం లేదంటావా?" అసుమానంగా అడిగింది విజయ.

"ఈ లోకంలో స్త్రీ, పురుషులు ఇద్దరూ సమానులే. అలాంటప్పుడు పురుషుడు పది మందితో తిరుగుతుంటే, అతడిని శ్రీ కృష్ణుడు అంటున్నారు. మరి స్త్రీ నలుగురితో తిరిగితే ఆమె ద్రౌపదిలా మరో కర్ణుడికోసం వెతుక్కుంటోంది అని ఎందుకు అనకూడదు. కానీ ఆమెను వేశ్య, లంజ అంటారు. మగవాడికి శీలం అవసరం లేనప్పుడు స్త్రీకి మాత్రం ఎందుకుండాలి అని నేను అంటాను. పురుషుడు నీతిగా ఉంటే స్త్రీ కూడా నీతిగా ఉండాలి. అంతేకానీ - స్త్రీ పురుషులకు అసమాన న్యాయం మంచిది కాదంటాను" ఆవేశంగా అన్నాడు రమణ.

"మీ వాదన మరీ దారుణంగా ఉంది"

"నిజం చెప్పడం ఎప్పుడూ దారుణంగానే అనిపిస్తూ ఉంటుంది"

"మీరు కాఫీ అక్కడే పెట్టేశారు. చల్లారిపోతాయి తాగండి" గుర్తుచేసింది విజయ. అప్పటికే చల్లారి పోయిన ఆ కాఫీని రెండు గుక్కల్లో నోట్లో పోసుకున్నాడు. రెండు గ్లాసులు తీసి దూరంగా పెట్టివచ్చాడు.

"ఈ దేశంలో స్త్రీ స్థితి ఎప్పుడు మారుతుంది?" అడిగింది విజయ.

"ఈ సమాజంలో మార్పు వచ్చిన నాడు"

"ఆ మార్పు ఎప్పుడు వస్తుంది?"

"స్త్రీలంతా ఐక్యంగా నిలబడిననాడు. ఈనాటి స్త్రీ స్థితికి కారణాన్ని పురుషుడితోపాటు స్త్రీ కూడా పాలుపంచుకోవ

టమే చేస్తుంది. ఓ పురుషుడు పక్కింటి పురుషుడి గురించి పట్టించుకోడు. అదే ఓ స్త్రీ పక్కింటి స్త్రీని గుచ్చి గుచ్చి చూస్తుంది. ఆమె బట్టలను, నగలను తన అలంకరణతో పోల్చి చూసుకుని ఈర్ష్య పడుతుంది. అసలు స్త్రీకి స్త్రీయే శత్రువుగా ప్రవర్తిస్తుంది. నీకు తెలుసుకదా! ఈనాడు వరకట్నాన్ని అడిగేది అత్తగారే. పుట్టింటి నుండి సొమ్ములు తెమ్మని పోరేది అత్తగారే. మరో స్త్రీ ఆడపడుచు లాంఛనాలు అడుగుతుంది. అంటే స్త్రీకి స్త్రీయే ద్రోహంచేస్తోంది. ఈ పరిస్థితి మారే దానికి స్త్రీ ముందుగా ఓ స్త్రీలా పరాయిస్త్రీ స్థితిలో తనేఉంటే ఎలా బాధపడేదో ఆలోచించాలి. ఒకనాడు తన తండ్రి కట్నం ఇచ్చేదానికి ఎంత కష్టపడ్డాడో గుర్తు చేసుకోవాలి. ఒక స్త్రీ చెడిపోయిందని హేళన చేసేముందు, తన కూతురుపై ఎవరైనా అత్యాచారం చేస్తే తను ఎంత బాధపడి ఉండేదో ఆలోచించాలి. అలా సాటిస్త్రీ గురించి స్త్రీ సహృదయంతో ఆలోచించిననాడు చాలావరకూ 'ఈ సమాజంలో స్త్రీ' స్థితి బాగుపడుతుంది. అంతేకాదు-మగవాడు కూడాస్త్రీని తనతో సమానంగాచూడగలగటం నేర్చుకోవాలి" అన్నాడు రమణ.

"రమణగారూ! ఇన్ని విషయాలు చెప్పారు కానీ నాకు ఒక్క విషయం తెలుసుకోవాలని ఉంది. ఆ విషయం గురించి మీరు ఎవ్వరికీ చెప్పరని తెలుసు. కానీ నాకు ఆ విషయం గురించి చెప్తారా!" అడిగింది విజయ.

"ఏ విషయం గురించి" ఆశ్చర్యంగా అడిగాడు రమణ.

"మీరు చెప్తానంటే ఆ విషయం గురించి అడుగుతాను"

"చెప్పగలిగిందయితే తప్పకుండా చెబుతాను" అన్నాడు రమణ.

"మీరు చెప్పగలిగిందే! అదే... మీ ప్రేమ విషయం...."

ఒక్కక్షణం రమణ ముఖం వెలవెల బోయింది.

"ఏం చెప్పకూడదనిదా మీ ప్రేమకథ" నిరాశగా అడిగింది విజయ.

"చెప్పకూడనిదీ కాదు, దాచిపెట్టుకునేంత గొప్పదీకాదు. కాని ప్రేమను గురించి ఒకరికి చెప్పకుంటే చులకనగా మారుతుంది. నవలలలో చదివినట్లు, సినిమాలలో చూసినట్లుగా నిజజీవితంలో ప్రేమను రిసీవ్ చేసుకోలేరు"

"సహృదయంతో అర్థం చేసుకునే వాళ్ళకు చెప్పడంలో తప్పులేదు"

"తప్పులేదు సరే...మీకు చెబుతాను. కానీ ఒక్క షరతు"

"ఏమిటి?" అడిగిందామె.

"ఆమె పేరేమిటి,ఆమె ఎక్కడుంది, ఆమె భర్త ఏం చేస్తాడు లాంటి ప్రశ్నలు వెయ్యకూడదు" అన్నాడు రమణ.

"అలాగే" నవ్వుతూ అందామె.

కొద్దిసేపటికి రమణ పాత జ్ఞాపకాలు గుర్తుతెచ్చుకుంటున్నట్లు మౌనం వహించాడు.

"విజయగారూ! నాది అందరిలాంటి ప్రేమకథే. ఇందులో ఏ ప్రత్యేకతాలేదు. కానీ అడిగారు గనుక చెబుతున్నాను నేనూ, ఆమె ఇద్దరం ఒకే స్కూలులో కలిసి చదువుకున్నాం. నేను పేదవాణ్ని, ఆమెధనవంతులబిడ్డ. ఎలా ఏర్పడిందో ఏమో కానీ మామధ్య స్నేహం ఏర్పడింది. చిన్నప్పటి నుండి ఒకరికొకరు స్నేహంగా కలసి ఉండేవాళ్ళం. ఆమె ఆడపిల్ల, నేను మగాణ్ని అన్న భేదం

లేకుండా ఉండేది మామధ్య. అలా చిన్ననాటి స్నేహం, పెద్దయ్యేసరికి ప్రేమగా మారింది. అన్ని ప్రేమల్లోకెల్లా చిన్ననాటి ప్రేమ చాలా గాఢమైనది అంటారు. ఆ తర్వాత ఇంటర్మీడియట్ లో చేరాను నేను. ఆమె స్కూల్ ఫైనల్ తో ఆపేసింది. నేను ఇంటర్మీడియెట్ పూర్తిచేశాను. డిగ్రీలో మీతోపాటుచేరాను నేను ఊరు వెళ్లినప్పుడు ఆమె తండ్రికి తెలియకుండా పొలాలలో, తోటల్లో తిరిగే వాళ్ళం. మా ప్రేమకుహద్దులు లేవన్నట్లు మమ్మల్ని ఈ లోకంలో ఎవ్వరూ కూడా విడదీయలేరన్నట్లు తిరిగేవాళ్ళం. లోకంలోని అందమంతా మాకోసమే అన్నట్లు భావించేవాళ్ళం. వసంతకాలం, కోయిలపాట, పండు వెన్నెల, పచ్చని పొలాలు,ఎగిరేపక్షులు-అన్నీ మాకోసమే అని అనుకునేవాళ్ళం.

గుడివెనుక కొలను, ఊరిచివరి తోట ఇవి మేము కలుసుకునేస్థలాలు. అలా ఆనందంగా, లోకమంతా మాదే అనుకుని గడిపే సమయంలో, ఎలా తెలిసిందోకాని ఆమె నాన్నకు తెలిసింది అలా తెలిసిందని నాకు తెలియదు. నేను కాలేజీకి వచ్చేశాను. హాస్టలులో చేరాను.

ఈలోగా ఆమె పెళ్ళి మరొకరితో నిశ్చయమైపోయింది. ఈలోకంలో మనిషి డబ్బుకు లొంగిపోతాడు. డబ్బుకు ఇచ్చినంత విలువ మరి దేనికీ ఇవ్వడు. ఆ డబ్బు ఉంటే ఏ తప్పూ కనపడదు. డబ్బులేకపోతే ఎంత మంచిమనసు ఉన్నా వాడు పనికిమాలినవాడు. అందుకే డబ్బులేని నన్నుకాదని,డబ్బున్న వ్యక్తితో ఆమె పెళ్ళి జరిపించేశారు.

సెలవులకు నేను ఊరు వెళ్ళేసరికే ఆమె పెళ్ళి జరిగిపోయింది. నాకు పిచ్చి పట్టినట్లు అయింది. ఈ లోకమే శూన్యం అనిపించింది. అప్పుడే ఓ మిత్రుడు చెప్పాడు. ఆమెకూడా ఈ పెళ్ళి ఇష్టం లేదనీ, తండ్రిని ఎదిరించిందనీ, చివరికి ఆత్మహత్య కూడా చేసుకోబోయిందనీ తెలిపాడు.

నన్ను నమ్ముకున్న నా చెలికి నేనులేని పరిస్థితుల్లో వివాహం చేసేశారు. ఇష్టంలేని పెళ్లి నుండి ఆమెను నేను ఎలాగూ కాపాడలేకపోయాను. ఇంతకీ మమ్మల్ని విడదీసింది డబ్బు. మనుషులు సృష్టించిన డబ్బే మనుషుల్ని విడదీసింది" ఎక్కడో చూస్తూ, ఏదో లోకంలో నుండి ఇవన్నీ చెబుతున్నట్లు ఉన్నాడు రమణ.

"ఇంతకీ ఆమె పేరు ఏమిటి?" అడిగింది విజయ. ఆ మాటలతో ఈ లోకంలోకి వచ్చాడు రమణ.

"ముందుగానే చెప్పాను పేర్లు అడగవద్దని" బాధనుండి తేరుకుని నవ్వుతూ అన్నాడు రమణ.

కొద్దిసేపు వారిమధ్య మౌనం రాజ్య మేలింది. మౌనాన్ని చీల్చుతూ రమణ అన్నాడు.

"ఇప్పుడు మీ భవిష్యత్తు గురించి మీరేం ఆలోచించుకున్నారు"

"ఏం చెయ్యాలో అర్థం కావడంలేదు. ఈ సమాజం పతిత అని ముద్రవేసింది. ఈ సమాజానికి నా ముఖం చూపించ లేకున్నాను. నన్ను ప్రేమించినవాడు నన్ను మోసం చేశాడు. ఇక నన్ను ఎవ్వరూ పెళ్ళిచేసుకోరు. తప్పుల్ని కప్పెట్టే ధనం లేదు. ఇంట్లోవారికి భారం అయ్యాను. ఇక నాకు ఏమీ తోచడం లేదు రమణగారూ"

కాసేపు తర్వాత ఆమె అడిగింది-

"టైము ఎంతయింది?"




"ఎనిమిది ముప్పావు" వాచ్ వంక చూసి చెప్పాడు రమణ.

"చాలా పొద్దుపోయింది.నేనువెళ్ళాలి"

"అలాగే.... వెళ్ళేముందు నేనొక్క విషయం చెబుతాను... పాటిస్తారా?" అన్నాడు రమణ.

"ఏమిటి"? అడిగింది విజయ.

"మీరు తప్పు చెయ్యలేదు. తప్పు చెయ్యనప్పుడు తలదించుకొని బతక వలసిన అవసరం లేదు. అందుకే తలెత్తుకుని తిరగండి. ఎటువంటి ఆలోచనలూ దరిచేరనివ్వకండి. ఈ లోకాన్ని ఎదిరించండి. అలా చేస్తానని నాకు మాటివ్వండి" అన్నాడు రమణ.

"నాకు సాధ్యం అయినంతవరకూ మీ మాటలు పాటిస్తాను" అంది విజయ.

"సరే పదండి.మిమ్మల్ని ఇంటివరకూ విడిచివస్తాను" పైకి లేచాడు.

"ఫర్వాలేదు....నేను వెళ్ళగలను"

"వద్దు...పదండి. ఒక్క నిముషం ఉండండి" లోపల పెట్టెలో ఉన్న ఓ కార్డు తీసి విజయకు ఇచ్చాడు.

"ఇందులో మా ఆఫీసు అడ్రసు,ఫోన్ నెంబర్ ఉన్నాయి. మీకు ఎప్పుడయినా ఏదయినా అవసరం వస్తే నాకు ఫోన్ చెయ్యండి. నన్ను ఓ స్నేహితుడిగా భావించుకోండి. దేనికీ మొహమాటం లేకుండా అడగండి" అన్నాడు రమణ.

"అలాగే" అంది విజయ.

"ఇక పదండి" తాళంవేసి ముందుకు కదిలారు ఇద్దరూ.

"ఇపుడు వీధిలోకి రావాలంటే భయం వేస్తోంది. బయటకు వస్తే ఏ తెలిసిన వ్యక్తి కనిపిస్తాడో, ఎలాంటి మాట అంటారో అని భయపడి చస్తున్నాను"

"అలా భయపడుతుంటే ఈ లోకం ఇంకా భయపెడుతూనే ఉంటుంది. ఈ లోకాన్ని ఎదిరిస్తే,అదే లోక ముడుచుకుని పారిపోతుంది. మనం తప్పు చెయ్యలేదన్న ఆత్మతృప్తి మనకు ఉంటే చాలు...ఎవరినైనా ఎదిరించొచ్చు"

ఇద్దరూ నడుస్తూనే ఉన్నారు.

"అంటే నేను చేసింది తప్పు కాదంటారు కదూ"

"ఇందులో మీ తప్పేంవుందో ఆలోచించుకోండి. అతడి తప్పువలన మీరు ఎందుకు బాధపడాలి. తప్పుచేసినవాడు తలెత్తుకుని తిరుగుతుంటే మీరు తల దించుకొని పోవలసిన అవసరం లేదు"

"కానీ ఈ సమాజంలో ఇంతకాలం బతికినదాన్నికదా ! ఒక్కసారి నాలో మార్పు రావాలంటే కష్టమే"

మౌనంగా ఉన్నాడు రమణ.

"రమణగారూ! మీకు స్త్రీ అంటే ఎందుకింత అభిమానం?" అడిగింది విజయ.

"ఒక్క స్త్రీ అంటేనే కాదు – ఈ లోకంలో నేను మూడింటిని అభిమానిస్తాను... గౌరవిస్తాను. అవి ఆకలి, స్త్రీ, ప్రేమ. ఆకలి అంటే నాకు గౌరవం, స్త్రీ అంటే అభిమానం, ప్రేమ అంటే అనురాగం. ఎందుకంటే నేను ఆకలి కడుపుతో స్త్రీ ప్రేమలో బతికాను కాబట్టి" అన్నాడు రమణ.

నడుస్తూ వీధి చివరకు వచ్చారు. వీధి చివర చూసి ఉలిక్కిపడింది విజయ. పోయేప్పుడు కూర్చుని ఉన్న రౌడీమూక ఇంకా అక్కడే ఉంది.

ఆమె ఎందుకో ఉలిక్కిపడటం గమనించాడు రమణ. అప్పుడు చూశాడు అక్కడ కూర్చుని ఉన్న నలుగురిని. ఇద్దరు ముందుకు అడుగులేశారు.

"నేను ఇంతకు ముందే అన్నాను కదరా! రుచి మరిగిన పెట్ట పుంజును వెతుక్కునేందుకు బయలుదేరిందని. ఇప్పుడు పని అయిపోయినట్టుంది. తిరిగి వచ్చేసింది. పాపం వాడు వదిలేందుకు వచ్చినట్టున్నాడు" అన్నాడు ఒకడు.

"మొత్తంమీద అది పెద్దచెయ్యి లాగుందిరా! లేకుంటే మగాణ్ణి తీసుకుని ఇంటికే వస్తుందా!"

"ఎట్టయితేనేం—మన గురుడు అదృష్ట వంతుడు. రంజైన పిట్టని పట్టాడు. ఇక ఆ షోకులు, కులుకులు, అందం అంతా వాడిదేగా" అన్నాడు మరొకడు.

"వాడిదేముందిరా! అదృష్టం అంటే ఆ పిట్టదేరా. రోజుకో మగాణ్ణి రుచి చూస్తుంది.రోజుకో వెరైటీఅనుభవిస్తుంది"

రమణ కళ్ల ఎర్రబడ్డాయి. వాళ్ళ దగ్గరగా వెళ్ళాడు. ఒకడితో అన్నాడు—

"నీకు చెల్లెళ్లుంటే రోజుకో మగాడి దగ్గరకు పంపించు. ఆమె కూడా అదృష్టవంతురాలు అవుతుంది"

ఆ మాట అన్నవాడి ముఖం ఎర్రగా కందిపోయింది.

"ఏం కూశావ్?" కోపంగా ముందుకు వచ్చాడు.

రమణ పిడికిలి బిగించి స్థిరంగా నిల బడ్డాడు. దగ్గరకు రాగానే మెడకింద బలంగా కొట్టాడు రమణ. దూరంగా పడ్డాడు వాడు.

విజయ పరిగెత్తుకొచ్చి రమణ చెయ్యి భయంగా పట్టుకుంది.

పడినవాడు పైకి లేచి మళ్ళీ మీదికి రాబోయాడు. అతడి చెయ్యి వెనక మరో స్నేహితుడు పట్టుకున్నాడు.

"వద్దురా! రేపు ఎప్పుడయినా చూసుకుందాం....ఇప్పుడొద్దు"

"ఇప్పుడయితేనేం. ముందు నన్ను వదులు" గట్టిగా విదిలించబోయాడు వాడు.

"వద్దు ... నా మాట విను. నీకు తెలుసుగా యస్.ఐ. ఎవరో"

ఆ మాటతో వాడు కొద్దిగా జంకాడు.

"నిన్ను ఎప్పుడోకప్పుడు సున్నం లోకి ఎముకలు లేకుండా చేస్తాను" రమణవైపు చూస్తూ అరచినట్టు అన్నాడు వాడు.

"పోరా...నువ్వేం చెయ్యగలవు"

విజయ చెయ్యి పట్టుకుని ముందుకు నడిచాడు రమణ. అప్పటివరకు ఆమె చెయ్యి గుండె మీదే ఉంది. కొద్దిదూరం నడిచిన తర్వాత గుండెల మీద నుండి చెయ్యి తీసి అడిగింది.

"ఆ రౌడీ మూకతో కొట్లాటకు పోతి యారే! మీరు ఒక్కరు, వాళ్లు నలుగురు. వాళ్లు మిమ్మల్ని కొడితే"

"ఏదయినా లక్ష్యం నిర్ణయించుకుని, ప్రమాదాలతో పోరాడాలి అని ఆశ ఉన్నవాడికి బుద్ధిబలంతోపాటు, శారీరక బలం కూడా కావాలని అనుకునేవాడిని. అందుకే ఆత్మరక్షణకు ఉపయోగపడే విద్యలు కూడా నేర్చుకుని ఉన్నాను"

"అంటే...?" ఆశ్చర్యంగా అడిగింది విజయ.

"మార్షల్ ఆర్ట్స్‌లో నాకు ప్రవేశం ఉంది. నిరాయుధంగా నలుగురి నుండి నన్ను నేను రక్షించుకోగలను"

"నిజంగానా" అడిగింది విజయ.

అవునన్నట్లు తలూపాడు రమణ.

"నేను మాత్రం ఎంత భయపడ్డానో తెలుసా" గుండెలమీద చెయ్యివేసుకుని అంది విజయ.

"నేను చెప్పాసుగా భయపడితే ఈ





లోకం ఇంకా భయపెడుతుందని, ఎదిరిస్తే ఏమీకాదని" నవ్వుతూ అన్నాడు రమణ.

విజయ ఇల్లు రెండిళ్ళ అవతల ఉంది. అక్కడే నిలబడిపోయాడు రమణ.

"నేను ఇక్కడినుండి వెనక్కి పోతాను" అన్నాడు రమణ.

ఇంటివరకు రమ్మనలేదు విజయ.

"అలాగే" అంది.

వెనక్కి తిరిగి కదిలాడు రమణ. వీధి చివర కూర్చుని ఉన్న రౌడీమూక అతడిని చూసి కిక్కురుమనలేదు. వాళ్లను చూసి నవ్వుకొని ముందుకు వెళ్లిపోయాడు రమణ.

* * *

సాయంత్రం బాంక్‌కు వెళ్లాడు రమణ. అప్పటికే బాంక్ క్లోజ్ చెయ్యబోతున్నారు. మోహన్ రమణను చూసి పలకరింపుగా నవ్వాడు.

"ఏమిటి ఇలా వచ్చావు?" అడిగాడు మోహన్.

"నీతో కొద్దిగా మాట్లాడాలి"

"నాతోనా! సరే పద" బయటకు వచ్చాడు మోహన్.

"ఎక్కడికి వెళ్దాం?" అడిగాడు.

"అలా బీచ్‌కి వెళ్దాం" చెప్పాడురమణ.

స్కూటర్‌ని స్టార్ట్‌చేసి బీచ్‌వేపు పోనిచ్చాడు మోహన్. బీచ్‌దగ్గర దిగి దూరంగా ఇసుకలో కూర్చున్నారు.

"ఇప్పుడు చెప్పు. ఏమిటి నాతో మాట్లాడేది" అడిగాడు మోహన్.

"నేను కొన్ని ప్రశ్నలు అడుగుతాను. నిజమయిన సమాధానాలు చెబుతావా?" అడిగాడు రమణ.

ఇదేదో సీరియస్ మేటర్ అని అనుకున్నాడు మోహన్.

"అలాగే... చెబుతాను"

"నీకు పెళ్ళి కుదిరిందా?" సూటిగా అడిగాడు రమణ.

"అవును రమణా! ఈమధ్య నా మనసు బాగోలేక నీ దగ్గరకు రాలేదు. అందుకే నీకు చెప్పలేకపోయాను. మొన్న మా అన్న పెళ్ళయిన తర్వాత మా నాన్న నాకు ఓ అమ్మాయిని చూసిపెట్టాడు. ఇంకొక వారంరోజులలో ముహూర్తాలు పెట్టుకోబోతున్నాము. నీకు ఈ విషయం చెప్పనందుకు క్షమించు"

"నువ్వు విజయను ప్రేమించావు కదూ!"

ఆ మాటతో గతుక్కుమన్నాడు మోహన్. అప్పటికి అర్థంఅయింది రమణ ఏ విషయం గురించిఅడిగేందుకువచ్చాడో.

"అవును.. ప్రేమించాను" అన్నాడు మోహన్.

"మరి మరొకర్ని ఎందుకు పెళ్ళిచేసుకుంటున్నావు ?"

"ప్రేమించేనాటికి ఆమె పవిత్రంగా ఉంది. నేడు శీలంలేని ఆడది అయింది కనుక మరొకర్ని పెళ్ళి చేసుకుంటున్నాను"

"అంటే ఆమె మనస్సుకన్నా శరీరాన్నే ప్రేమించావా?"

"ఇవన్నీ ఎందుకు అడుగుతున్నావో తెలుసుకోవచ్చా" విసుగ్గా అడిగాడు మోహన్.

"ఓ స్త్రీకి అన్యాయం జరిగింది కనుక అడిగేందుకు వచ్చాను"

"ఆమెను గురించిఅడిగేందుకు ఆమెకు, నీకు ఏ సంబంధం ఉంది?" వ్యంగ్యంగా అడిగాడు మోహన్.

"అన్యాయాన్ని గురించి అడిగేందుకు ఏ సంబంధమూ ఉండనవసరంలేదు. ఎవరయినా ఒక్కటే'' స్థిరంగా

అన్నాడు రమణ.

"సరే... ఇప్పుడు ఏం అంటావు"

"ఒక ఆడదాన్ని మోసం చెయ్యడం మంచిది కాదంటాను. ఆమెను పెళ్ళి చేసుకోమని ఓ స్నేహితుడిగా చెబుతున్నాను"

"ఆమెను పెళ్ళిచేసుకుంటే నా తల్లిదండ్రులు ఏదయినా అఘాయిత్యం చేసుకుంటామన్నారు" చెప్పాడు మోహన్.

"ప్రతి తల్లిదండ్రులూ బెదిరించే విధానమే అది. అంతమాత్రాన తల్లిదండ్రుల బెదిరింపులకు భయపడి నమ్ముకున్న ఆడదాన్ని పెళ్ళిచేసుకోకపోవడం మంచిది కాదు'' మోహన్ వేపు సూటిగా చూస్తూ అన్నాడు రమణ.

ఆ చూపులకు తట్టుకోలేక తల దించుకున్నాడు మోహన్.

"అబద్ధం చెప్పడం ఎందుకు రమణా! నా తల్లిదండ్రులు బెదిరించారని కూడా కాదు. అసలు శీలంలేని ఆడదాన్ని పెళ్ళి చేసుకోవడం నాకిష్టంలేదు''

ఆ మాటకు నిరుత్తరుడయినట్లు చూశాడు రమణ. కాసేపటికి తేరుకుని అన్నాడు-

"అంటే ప్రేమించే ఆమె మనసు కంటే, ఆమె శరీరమే నీకు ముఖ్యమన్న మాట. సరే! ఈనాడు మనదేశంలో కనీసం పదిశాతం మంది అమ్మాయిలు పెళ్లి కాకముందే లైంగికసుఖం అనుభవించిన వాళ్లే ఉంటున్నారు. రేపు నువ్వు పెళ్లి చేసుకోబోతున్నావుగా! అప్పుడు నీకొచ్చే భార్యకు ముందుగానే ఎవరైనా పురుషుడితో సంబంధం ఉంటే ఏంచేస్తావు? అలాగే ఏదైనా అబార్షన్ కూడా జరిగిన కేస్ అయితే ఏంచేస్తావు?"

"అంటే రాబోయే భార్యమీద ముందుగానే అనుమానం పెట్టుకుని కూర్చోమంటావా?"

"స్త్రీని అనుమానించమని చెప్పటం లేదు. ఒకవేళ ఆమె అంతకు ముందు తప్పు చేసి ఉన్నా మనసులో దాచుకుని, చూసుకోవాలని చెబుతున్నాను. కానీ నువ్వు శీలానికి ప్రాధాన్యత ఇస్తున్నావు కదా! నీకు వచ్చే భార్య శీలవతి కాకుంటే ఏంచేస్తావు అని అడుగుతున్నాను"

"ఆమె శీలవతి కాకపోవచ్చు. కానీ ఈమెలా చెడిపోయిన ఆడది అని పేరు తెచ్చుకుని లేదుగా" అన్నాడు మోహన్.

"అంటే రాబోయే భార్య తన ఇష్టపూర్వకంగా మరొకడితో ఇష్టం వచ్చినంతకాలం తిరిగి ఉండొచ్చు. అబార్షన్ అయిన స్త్రీ అయినా ఫర్వాలేదు. కానీ లోకం దృష్టిలో పతివ్రతగా ఉంటే చాలు. ఆమెను పెళ్లి చేసుకోవచ్చు. అంతేకాని ఆమె ఇష్టం లేకుండానే మరొకడు ఆమె మీద ఒకే ఒకసారి అత్యాచారం జరిపితే ఆమె చెడిపోయింది. ఆమెను పెళ్లిచేసుకో కూడదు ... అంతేనా?" వ్యంగ్యంగా అన్నాడు రమణ.

"అయితే ఆమెను పెళ్లిచేసుకుని, ఎక్కడికెళ్లినా చెడిపోయిన ఆడదాని మొగుడు అని పిలిపించుకోమంటావా?"

"ఈ సమాజాన్ని ఎదిరించే ధైర్యం ఉండాలి మోహన్! మనలో సామర్థ్యం ఉంటే శీలంలేని ఆడది అని వేలెత్తి చూపించే ఈ సమాజం చేతోనే ఆమె ఉత్తమురాలు అనిపించవచ్చు" పిడికిలి బిగించి చూపిస్తూ అన్నాడు రమణ.

"ఈ మాటలు కథల్లో రాసుకుంటే బాగుంటుంది రమణా! నీకు ఎలాగూ సాహిత్యం అంటే ఇష్టమేగా. అందుకే ఇలాంటి కథలు రాసుకో. అంతేకానీ నిజ జీవితంలో ఇలాంటి మాటలు ఆచరణలో

పెడితే తర్వాత బాధపడాల్సి ఉంటుంది" అన్నాడు మోహన్.

కాసేపు మౌనంగా ఉన్నాడు రమణ. తర్వాత అన్నాడు-

"ఆరోజు నీకు చెప్పాను. ఆమెను గురించి పోలీసు రిపోర్టు ఇవ్వవద్దని, కోర్టుల చుట్టూ తిప్పవద్దని. కానీ నువ్వు వినలేదు. వాడు నిన్ను కొట్టాడని వాడిని జైలుకు పంపాలని ఆవేశంతోపోలీసులకు తెలిపావు. వాడిని కోర్టుకు ఈడ్చావు. వాడికి రేపు శిక్ష పడొచ్చు. లేదా తప్పించుకోవచ్చు. కానీ ఇక్కడ నీ ఆవేశం వలన ఓ స్త్రీ బతుకు నాశనమయింది. ఈనాటి ఆమె స్థితికి కారణం నువ్వే" మోహన్‌వైపు వేలు చూపిస్తూ అన్నాడు రమణ.

"నిజమే. జరిగింది తప్పు అని చింతిస్తున్నాను. ఈనాటి ఆమె స్థితికి కారణం నేనేనని ఒప్పుకుంటాను. జరిగిన పొరపాటుకు బాధపడుతున్నాను"

"నువ్వు బాధపడినందువల్ల ఆమెకు లాభం ఏమిటి?"

"అయితే నన్నేం చెయ్యమంటావు?" అడిగాడు మోహన్.

"ఆమెను పెళ్లి చేసుకో"

ఒక్క క్షణం మౌనంగా ఉన్నాడు మోహన్. తర్వాత అన్నాడు-

"ఆమెను గురించి నువ్వు ఇంతగా బాధపడుతున్నావే. పోనీ నువ్వే ఆమెను పెళ్లి చేసుకోకూడదా! నువ్వే ఈ సమాజాన్ని ఎదిరించి, ఈ సమాజం చేత ఆమె ఉత్తమురాలు అనిపించకూడదా?"

ఒక్క క్షణం నివ్వెరపోయాడు రమణ. నాలిక్కరుచుకున్నాడు మోహన్. తను ఎంత పొరపాటుగా మాట్లాడాడో అర్థం చేసుకున్నాడు. కానీ మళ్లీ మాట్లాడలేకపోయాడు.

"మోహన్! ఆమెను పెళ్లిచేసుకునేందుకు నాకు ఎటువంటి పట్టింపులు లేవు. కానీ నా మనసు ఇంతకు ముందే మరొకరికి ఇచ్చేశాను. నా గుండెనిండా ఆమె నిండి ఉంది. నా భార్య స్థానంలో ఆమెనే ఊహించుకుని ఉన్నాను. అందుకే నా జీవితంలోకి ఇంతవరకూ మరొకరిని రానివ్వలేకపోతున్నాను. అందుకే ఆమెను పెళ్లి చేసుకోలేకపోతున్నాను"

మోహన్ మౌనంగా ఉన్నాడు. కొద్దిసేపు తర్వాత రమణే అన్నాడు-

"సరే మోహన్! ఒక్కమాట చెప్పు. ఆమెను పెళ్లి చేసుకుంటావా..చేసుకోవా?"

"రమణా! నిన్ను ఓ మంచి స్నేహితుడుగా భావించుకున్నాను నేను. నిరుద్యోగిగారోడ్డుపట్టుకొని తిరుగుతున్న నిన్ను ఓ ఉద్యోగిని చేశాను.కానీ ఈనాడు ఆ కృతజ్ఞత అనేది లేకుండా నాకు ఓ చెడిపోయిన ఆడదాన్ని పెళ్లి చేసుకోమని, జీవితాన్ని నరకం చేసుకోమని సలహా ఇస్తున్నావు" మెల్లగానే అన్నాడు మోహన్.

రమణ ముఖం వెలవెలబోయింది. ఆ ముఖం చూసి కంగారుపడ్డాడు మోహన్.

"చాలా మంచిది మోహన్! నీవు నాకు ఉద్యోగం ఇప్పించావని, నీయందు కృతజ్ఞతతో ఓ స్త్రీకి అన్యాయంజరుగుతూ ఉన్నా చూస్తూ ఊరుకోమంటావా? అది నా వల్ల కాదు. స్నేహితుడి మీద కృతజ్ఞతతో అతడు మరొకరికిఅన్యాయం చేస్తుంటే చూస్తూ సహించలేను. కాబట్టి నీకు కృతఘ్నుడిగా కాకుండా ఉద్యోగం మానివేస్తాను" నిశ్చలంగా అన్నాడు రమణ.

"రమణా! నేను మామూలుగానే అన్నాను. కానీ నువ్వింత సీరియస్‌గా

 

తీసుకుంటావని అనుకోలేదు" తడబాటుగా అన్నాడు మోహన్.

"మామూలుగా అన్నా, సీరియస్‌గా అన్నా వేలెత్తి చూపించే విషయాన్ని మనస్సుకు తృప్తి కలిగించని విషయాన్ని తెలుసుకుని ముందుగానే తప్పుకోవడం మంచిది"

"నేను పొరపాటున అన్నాను. దానికి సారీ కూడా చెప్పుకుంటున్నాను. ఈ చిన్న విషయానికే ఉద్యోగం మానెయ్యద్దు. మానేస్తే నీ కుటుంబాన్ని పోషించటం ఎలాగో ఆలోచించుకో" కంగారుగా అన్నాడు మోహన్.

"ఇంతకుముందే అన్నావుగా కథలు రాసుకోమని. నా గ్రామానికి వెళతాను. ఆ కథలే రాసుకుని బతుకుతాను ... సరేనా" తొణక్కుండానే అన్నాడు.

"ప్లీజ్ రమణా! ఉద్యోగం మానెయ్యొద్దు. ఈ ఉద్యోగం మానేస్తే ఇంకొక ఉద్యోగం దొరకడం కష్టం"

రమణ తమాషాగా నవ్వాడు.

"అంటే నేను అసమర్థుణ్ణనీ, ఇంత మాత్రం ఉద్యోగం సంపాదించుకోలేని వాడిననీ అనుకుంటున్నావు. పొరపాటు పడుతున్నావు! ఎందుకంటే నేను నీకంటే తెలివయినవాణ్ణనే అనుకుంటున్నాను. నువ్వు ఉద్యోగం కోసం చదివావు. నేను చదువుకోసం, లోకం తెలుసుకునేందుకూ చదివాను. ఈనాడు నేను సంపాదించ దలుచుకుంటే నువ్వు ఉద్యోగం ద్వారా సంపాదించేదానికన్నా ఎన్నో రెట్లు ఎక్కువ సంపాదించుకోగలను. కానీ కొన్ని సిద్ధాంతాలకు లోబడి బతుకుతున్నాను. అందుకే నాలాంటివాళ్ళు నీకు అసమర్థులుగా, చేతకానివాళ్ళలాగా కనిపించవచ్చు. అంతమాత్రాన మేము అసమర్థులం కాదు, సంపాదించుకోవడం చేతకానివాళ్ళమూ కాదు ఓకే...నేను చెప్పదలచుకున్నది చెప్పాను. ఇక నీ ఇష్టం... గుడ్‌బై" పైకి లేచాడు.

"రమణా!ప్లీజ్...కూర్చో" అన్నాడు మోహన్.

"నేనింక ఏం చెప్పనవసరం లేదు. నువ్వు చెప్పేది వినదలచుకోలేదు. నువ్వు చేసుకోదలచుకుంటే ఆమెను పెళ్ళిచేసుకో, లేకుంటే లేదు... గుడ్‌బై"

"రమణా!" పిలిచాడు మోహన్.

ఆ మాటలు వినకుండా ముందుకే కదిలిపోయాడు రమణ. అతడి వెనుకే వెళ్ళడం ఇష్టంలేక అక్కడే కూర్చుండి పోయాడు మోహన్.

* * *

ఆ రాత్రి రమణకు నిద్రపట్టలేదు. మోహన్ ఏమన్నాడు? తను ఆమెను పెళ్ళిచేసుకోమని, ఆమెను ఈ సమాజం చేత ఉత్తమురాలు అనిపించమని అన్నాడు. అవును... ఆమెను తనే ఎందుకు పెళ్ళిచేసుకోకూడదు ? తను కోరుకున్న తన ప్రియురాలు తనకు ఎలాగూ దక్కదు. ఆమె ఎక్కడో గుట్టుగా కాపురం చేసుకుంటోంది. మరి తన బతుకు ఇలాగే మోడువారిపోవలసిందేనా? ఈ జీవితం మోడు కాకముందే, తన బతుకు నీడలో మరొకరు సుఖపడే ట్టుంటే, వారికి చేయూతనివ్వడం మంచిదే కదూ! అందుకే ఆమెను పెళ్ళి చేసుకుంటాను.విజయకు చేయూతనిస్తాను.ఆమెతో నేను సంసారం చెయ్యకపోయినా కనీసం 'తాళి' ఇచ్చే రక్షణను ఆమెకు కల్పిస్తాను. మనసులోనే అనుకున్నాడు రమణ.

ఫొటో తీసి చెలిని చూసుకున్నాడు.

"చెలీ! నిన్ను నేను మోసంచెయ్యడంలేదు. ఈ సమాజం నుండి ఓ స్త్రీని రక్షించేందుకు ఈ పని చెయ్యబోతున్నాను. తప్పు ఉంటే నన్ను క్షమించు" ఫొటో భద్రంగా దాచిపెట్టాడు.

ఆ రాత్రి అతడు నిద్రపోలేదు.

ఉదయమే ఆఫీసుకు వెళ్ళాడు రమణ. తిన్నగా ప్రొప్రయిటర్ దగ్గరకు వెళ్ళాడు.

"ఏం రమణా! ఏంకావాలి?" అడిగాడు అతడు.

"నేను ఉద్యోగం మానెయ్యబోతున్నాను" చెప్పాడు రమణ.

"మీకు ఏదయినా ఉద్యోగం



వచ్చిందా?"

"అలాంటిదేం లేదు"

"మరేదైనా బిజినెస్ చెయ్యబోతున్నారా?"

"అటువంటిది కూడా కాదు. కావపోతే మానెయ్యాలనిపించింది.. మానేస్తున్నాను"

"పోనీ మా ఆఫీసులో ఏదయినా ఇబ్బంది కలుగుతోందా ?" అన్నాడు అతడు.

"అటువంటి ఇబ్బంది ఏమీలేదు"

అప్పుడే ఏదో తోచినట్టు అన్నాడు అతడు "మేము ఇచ్చే జీతం చాల్లేదేమో చెప్పండి. మరికొంత పెంచేందుకు ఏర్పాటు చేస్తాను"

"ఇవేవీ కారణాలు కావండీ! కొన్ని అనుకోని కారణాలవలన మానేస్తున్నాను"

"నీలాంటి మంచివాడు మానెయ్యడం బాధేస్తుంది. అదిసరే... చిన్న రిక్వెస్ట్ మొన్న అకౌంటెంట్ మానేశాడు... తెలుసుకదా! ఇప్పుడు మీరూ మానేస్తే మేము ఇబ్బంది పడాల్సి ఉంటుంది. అందుకే మరో నమ్మకమైన వ్యక్తిని చూసుకునేంతవరకూ అంటేఓ వారం రోజులు మీరు వుంటే మంచిది"

"అలాగే... మరో వారం రోజులు ఉంటాను" అన్నాడు రమణ.

"థాంక్స్" అన్నాడు అతడు.

ఆరోజు మధ్యాహ్నం వరకూ ఆఫీసు లోనే ఉన్నాడు. మధ్యాహ్నం లేచి పోస్టాఫీసుకు వెళ్ళాడు. కవరు తీసుకుని మూడు మాటల్లో ఉత్తరం రాసాడు.

'విజయగారూ!

ఈ ఉత్తరం చూసిన వెంటనే నా గదికి రావలసింది. మీతో మాట్లాడాలి.

—రమణ'

ఉత్తరం మడిచి పోస్టు డబ్బాలో వేశాడు. అతడికి తెలుసు. ఆ ఉత్తరం మర్నాడు మధ్యాహ్నం విజయకు అందు తుందని, ఆరోజు రాత్రి విజయవస్తుందని. ఆమె రాగానే ఆమెతో పెళ్ళి విషయం మాట్లాడాలి! ఆలోచిస్తూ ఆఫీసుకు చేరుకున్నాడు. సాయంత్రంవరకూ ఉండి రూమువైపు కదిలాడు.

* * *

గదిలో నిద్రపట్టలేదు విజయకు. పక్కనే సుశీల పడుకుని ఉంది. కాసేపు తర్వాత దాహమైతే మెల్లగా తలుపు తీసుకుని, ఇవతలకు వచ్చి వంటగదివైపు వెళ్ళబోయింది. పక్కగదిలో నుండి మెల్లగా మాటలు వినిపిస్తున్నాయి. అవి ఆమె తల్లిదండ్రుల గొంతులు. అందులో తన ప్రస్తావన వినిపించడంతో అక్కడే ఆగిపోయి వినసాగింది విజయ.

"అయితే అంతేనంటారా?" అది శారదమ్మ గొంతు.

"అంతేకదా" వెంకట్రామయ్య గొంతు అది.

"అది ఇంట్లో ఉన్నంతకాలం సుశీల పెళ్ళి కూడా కాదా?" అడిగింది శారదమ్మ.

"ఎలా అవుతుంది? 'మీ పెద్దమ్మా యిని చెడిపేశారు కదూ' అంటారు. అసలు పెద్దమ్మాయి పెళ్ళి కాకుండా చిన్నమ్మాయిని పెళ్ళి చేసుకునేందుకు ఎవరూ రారు"

"అంటే పెద్దదాన్ని ఇక ఎవరూ పెళ్ళి చేసుకోరా?"

"ఇక ఆ ఆశ కూడా ఉందా?" నిట్టూర్చాడు వెంకట్రామయ్య.

"అంటే దాన్ని ఎవరూ పెళ్ళి చేసుకోరు. దానివలన దాని చెల్లెలి పెళ్ళి కూడా కాదు. పోనీ ఇంట్లో కూర్చోబెట్టి ఒకరినయితే పోషిస్తాం. ఇద్దర్ని పోషించా లంటే ఎంతకష్టం" బాధగా అంటోంది శారదమ్మ.

"వాళ్ళను ఎలాగోలా పోషించుకో వచ్చు. కానీ ఆడపిల్లలు ఇంట్లో ఉంటే మళ్ళీ ఏ బాధ కొనితెస్తారో అని భయం"

"ఛీ... పాపిష్టి ముండ! ఎన్నికష్టాలు తెచ్చిపెట్టింది"

"ఆడపిల్లల్ని కన్నప్పుడు ఎన్ని కష్టాలయినా భరించాలి తప్పదు"

"పోనీ ఎక్కడైనా దూరంగా ఓ ఉద్యోగం చూసి తరిమెయ్యకూడదూ"

"ఆ మాట మననోటితో మనం ఎలా చెబుతాము"

"సరే ఎలా జరగాల్సి ఉంటే అలాగే జరుగుతుంది. చాలా పొద్దుపోయింది. మీరు పడుకోండి" చెప్పింది శారదమ్మ.

"గుండెల మీద కుంపటిని పెట్టుకుని నిద్రపొమ్మంటే ఎలా నిద్రపడుతుంది" అన్నాడు వెంకట్రామయ్య.

"అలాగని ఆలోచిస్తూ కూర్చుంటే జరిగేది జరగక మానదు కదా" అంది శారదమ్మ.

తర్వాత మాటలు వినిపించలేదు.

ఆ మాటలు విన్న విజయకు గుండెలు మండినట్లయింది. ఆమెకు దాహం తీరి పోయింది. మెల్లగా పడగ్గదికి చేరింది. సుశీల పక్కనే పడుకుంది. ఏమిటి తన బతుకు? తల్లిదండ్రులకు కూడా తను భారమయిందా? ఇంతకాలం తను సమాజం చేత, ప్రియుడిచేత మాత్రమే అసహ్యించుకోబడిందని అనుకుంటోంది. ఈనాడు తల్లితండ్రులచేత కూడా అసహ్యించుకోబడుతుందా? ఇంతకాలం ఈ సమాజం ఏమన్నా తన తల్లిదండ్రుల కోసమే బతికింది. తను ఏమయినా అఘాయిత్యం చేసుకుంటే తన తల్లిదండ్రులకు బాధ కలిగించినట్లు అవుతుందని మిన్నకుండి పోయింది. కానీ ఈనాడు తెలుసుకుంది- తను లేకపోవడం, తన తల్లిదండ్రులకు ఆనందం కలిగిస్తుందని, తను ఉంటే తన చెల్లాయి పెళ్ళి కాదని తెలుసుకోలేక పోయింది. తను తన తల్లిదండ్రులకు భారమయిందని తెలుసుకోలేకపోయింది. ఇక తను బతికి ఉండి ఎవర్ని సుఖ పెట్టాలి? అవును... తను చనిపోవాలి అనుకుంది విజయ. వెంటనే ఆమెకు రమణ గుర్తొచ్చాడు. అతడి మాటలు గుర్తొచ్చాయి. "ఈ లోకాన్ని చూసి భయపడి పారిపోతే ఇంకా భయపడుతూ తరుముతూనే ఉంటుంది. ఎదిరిస్తే తోక ముడుచుకొని పారిపోతుంది?"

అవును... ఈ లోకాన్ని ఎదిరించాలి. కానీ తల్లిదండ్రుల దగ్గరే ఉంటే వారికి భారంగా ఉంటుంది.

ఆ రాత్రి తల బద్దలుకొట్టుకుంది విజయ. ఆలోచనలు తెగలేదు. తెల్లవార్లూ ఆలోచించింది. తెల్లారబోయేముందు ఓ నిర్ణయం తీసుకుంది.



## 9

ఉదయమే ఆ ఇంటి ముందు ఓ రిక్షా ఆగింది. ఆ రిక్షాలో నుండి ఓ ఇరవై ఏళ్ళ పడుచు దిగింది. రిక్షావాడికి డబ్బు లిచ్చి ఇంట్లోకి వచ్చింది.

వెంకట్రామయ్య వరండాలో కూర్చుని ఉన్నాడు. వస్తున్న అమ్మాయిని ఆశ్చర్యంగా చూశాడు ఎవరా అని.

"నమస్కారమండీ! నా పేరు జయంతి. నేను విజయకు స్నేహితురాలను. విజయతో కాసేపు మాట్లాడి వెళ్ళాలని వచ్చాను" అన్నది ఆమె.

"అమ్మాయి లోపలవుంది... వెళ్ళండి" చెప్పాడు వెంకట్రామయ్య.

లోపలికి నడిచింది ఆమె. లోపల

శారదమ్మ ఆమెవైపు ప్రశార్థకంగా చూసింది.

"మీ అమ్మాయి విజయ స్నేహితురాలినండీ"

"ఆ గదిలోఉంది ..వెళ్ళండి"చెప్పింది శారదమ్మ.

తనకోసం ఎవరో వచ్చినట్టు తెలవ దంతో చదువుతున్న పుస్తకం మూసి వాకిలివైపు చూసింది విజయ.

"నమస్తే... నా పేరు జయంతి. నేను మీ స్నేహితురాలినని మీ నాన్నగారికి అమ్మగారికి అబద్ధంచెప్పి మీ దగ్గరకు వచ్చాను" నవ్వుతూ చెప్పిందామె.

"కూర్చోండి. ఇంతకీ మీరెవరు?" అడిగింది విజయ.

"నా పేరు చెప్పానుకదూ! నేను ఓ జర్నలిస్టుని. ఓ వ్యాసం కోసం మీతో కొద్దిగా మాట్లాడాలని వచ్చాను" అన్నది ఆమె.

"పేపర్కోసం వచ్చారా! పత్రికల కయితే నేను ఏమీ చెప్పదలచుకోలేదు"

"ఏం.... ఎందుకని" ఆశ్చర్యంగా అడిగిందామె.

"మీ పేపర్వాళ్ళు గుట్టుగా ఉన్న దానిని బట్టబయలుచేస్తారు. అందువలన నలాంటివారి బతుకులు తెరిచిన పుస్తకాలుగా మారిపోతున్నాయి"

"అంటే...?"

"నా గురించి తీసుకోండి. నన్ను రేప్ చేశారు. అది ఓ బుద్ధితక్కువ వ్యక్తివలన కోర్టువరకూ వెళ్ళింది. మీరు దాన్ని ఓ వార్తగా తీసుకుని ప్రచురించారు. దానితో నా గురించి అందరికీ తెలిసిపోయింది. రాష్ట్ర వ్యాపితంగా నన్ను గుర్తుపెట్టు కునేట్టు మీ పేపర్లు రాశాయి. మీకది ఓ వార్త. పేపర్ నింపేందుకు, మీ పాఠ కులకు తెలిసేందుకు ప్రచురించారు. కానీ నాకు అది ఓ చెడ్డ గుర్తింపు అని తెలుసా!"

"పొరపడ్డారు. మీకు అన్యాయం జరి గిందని, ఆ అన్యాయం చేసినవాడిని శిక్షించమని కోరుతూ- అది ప్రజలదృష్టికి తీసుకువచ్చారు. ఆఫ్కోర్స్ అందువలన మీ గురించి ప్రచారం జరిగిఉండొచ్చు. చెడ్డ గుర్తింపు కలిగి ఉండొచ్చు. కానీ ఒక నాణానికి బొమ్మ, బొరుసు రెండూ ఉంటాయి" చెప్పింది జయంతి.

"సరే. ఆడదానికి న్యాయం జరగాలని మీరు రాశానంటారు. నిందితుడికి శిక్ష పడాలని ప్రజల దృష్టికి తీసుకువచ్చాము అంటారు. కానీ ఆ తర్వాత ఆ కేసు గురించి ఆ న్యాయస్థానం విధించే శిక్ష నుండి నిందితుడు ఎలాతప్పించుకున్నాడో ప్రజల దృష్టికి తీసుకువస్తున్నారా? అప్పటికప్పుడు ఆ వేడి వార్తను అమ్ము కోవడమేకాని ఆ తర్వాత ఆ కేస్ ఏమ యిందో, ఆ స్త్రీకి ఎటువంటి న్యాయం జరిగిందో మీరు రాస్తున్నారా?" అడి గింది విజయ.

"నాకు ఆ పేపర్ల గురించి ఎక్కువ తెలియదు. కానీ నేను వ్యాసాలు మాత్రమే రాస్తుంటాను" తల దించుకుని చెప్పింది జయంతి.

"ఇంతకీ మీరెందుకు వచ్చారు?" అడి గింది విజయ.

"ఏమీలేదండీ! అందరూ రేప్ జరిగితే, రేప్ గురించి, చట్టాల గురించి చర్చించు తుంటారు. కానీ ఆ విషయంలో స్త్రీ అభి ప్రాయం ఎలావుంది, అసలు రేప్ తర్వాత ఆమె ఎలా గడుపుతుంది, ఆమె భావా లేమిటి, ఆమె భవిష్యత్తు గురించి ఆమె ఎలా ఆలోచించుకుంటుంది అని ఎవ్వరూ




ఆలోచించను. మీ మీద అత్యాచారం జరిగినప్పుడే నాకీ ఆలోచన వచ్చింది. ఓ కొంత కాలం జరిగిన తర్వాత మీ అనుభవాల గురించి రాయాలనుకున్నాను. అందుకే ఈరోజు మిమ్మల్ని కలుసుకున్నాను. రేప్ తర్వాత మీ బతుకు, ఆలోచనల గురించి చెప్పండి" అడిగింది జయంతి.

"నేను చెప్పను" ఖచ్చితంగా అంది విజయ.

"ఏం... ఎందుకని?" ఆశ్చర్యంగా అడిగింది జయంతి.

"రేపు పత్రికలో ఫలానా రేప్ చెయ్యబడ్డ విజయ అనే అమ్మాయి, తన బతుకు గురించి, తన భావాలు, అనుభవాలు ఇలాచెప్పిందిఅని రాసి నాకు మరింత చెడ్డ గుర్తింపు తేవాలని చూస్తున్నారా? మీకిచ్చే వందరూపాయల కోసం నా పేరు వాడుకోవాలనుకుంటున్నారా!" సీరియస్‌గా అడిగింది విజయ.

జయంతి దెబ్బతిన్నట్టుగా చూసింది. కాసేపు తర్వాత అంది-

"పొరపడ్డారు విజయగారూ! నేను ఓ వందరూపాయల కోసమో, లేకపోతే నేను రాసింది అచ్చులో చూసుకోవాలనే ఉత్సాహంతోనో ఇలా రాయటంలేదు. పత్రికలిచ్చే వందరూపాయలు నాకు లెక్కకాదు. ఒక్కోసారి వ్యాసం కోసం ఎన్నో వందల రూపాయలు తగలేస్తుంటాను. ఆ వ్యాసానికి వాళ్ళు ఇచ్చేది వందయినా, అంతకుమించి ఖర్చుపెడుతుంటాను. డబ్బుకోసం కాదు - ఆత్మ తృప్తి కోసం. ఇక అచ్చులో చూసుకోవాలనే దురదే ఉంటే ఇటువంటి వ్యాసాలే రాయనవసరంలేదు. ఇంట్లో ఓ మూల కూర్చుని నవలో, కథో రాసి పత్రికలకు పంపించినా వేసుకుంటారు"

"సారీ" అంది విజయ - ఆవిడ ఆవేశాన్ని గమనించి.

"పర్వాలేదు. ఓసారి దెబ్బతిన్నప్పుడు ప్రతి ఒక్కరినీఅనుమానించడంసహజమే నేను మీకు మాటిస్తున్నాను. మీ పేరు నా వ్యాసంలో ఎక్కడా ఉపయోగించుకోను. సరేనా. ఇంతకీ మీకు ఇష్టంవుందేనే చెప్పండి"

"ఇంతకీ నేను ఏం చెప్పాలి?" అడిగింది విజయ.

"ఏవయినా చెప్పండి. కోర్టుల గురించి మీరేమి అనుకుంటున్నారో చెప్పండి. అలాగే నిందితుడి మీద మీకెలాంటి భావముందో చెప్పండి. ముఖ్యంగా రేప్ తర్వాత ఇంట్లో, బయటా మీ పరిస్థితి ఎలాగుందో చెప్పండి"

"అలాగే...చెబుతాను. ఈ చట్టాలు మారాలని అనుకుంటున్నాను"

"ఎలాగ?" అడిగింది జయంతి.

"ఒక దొంగ దొంగతనం చేసేప్పుడు నలుగుర్ని పెట్టుకుని దొంగతనం చెయ్యడు. అలాగే ఓ వ్యక్తి ఓ స్త్రీపై అత్యాచారం జరపదలచుకున్నప్పుడు నలుగుర్ని ముందుంచుకుని అత్యాచారం చెయ్యడు. అసలు సృష్టికార్యాన్నే నాలుగు గోడలమధ్య చేసుకుంటారు. అటువంటిది ఇక బలవంతంగా చేసేప్పుడు మరింత జాగ్రత్తగా చేస్తారు"

"అందుకని?" అడిగింది జయంతి.

"సృష్టికార్యానికి స్త్రీ పురుషులిద్దరే సాక్షి. తప్పుచేసినమగాడు తప్పుచేశానని చెప్పడు. ఎంత అవసరమయినా ఓ స్త్రీ తను శీలం కోల్పోయిందని ఈ దేశంలో చెప్పుకోలేదు. అందుకే సాక్ష్యాన్ని ముఖ్యంగా పరిగణించాలంటాను"

"ఒక్కోసారి స్త్రీ కూడా అబద్ధం



చెప్పొచ్చుగదా! ఓ ఉదాహరణ చెబుతాను. మా బంధువు ఒకాయన చాలా స్ట్రిక్ట్ ఆఫీసరు. ఆయన ఓసారి అధికార హోదాలో ఓ గ్రామం వెళ్ళాడు. ఆ రాత్రి అక్కడే బస. ఆ ఊరి గ్రామాధికారులకు ఆయనంటే కోపంగా ఉండేది. అందుకని వారు ఓ పథకం ఆలోచించారు. ఆ ఊరిలో పేరుపడ్డ ఓ వేశ్యతో ఆయనగదికి కారియర్ ఇచ్చి పంపారు. ఆమె వయ్యారంగా ఆయన గదికి వెళ్ళి కారియర్ పెట్టి తన కోరిక తీర్చమంది. ఆయన ఒప్పుకోలేదు. అంతే! తన రవిక చించుకొని, జుట్టు పీక్కొని అవతలి వ్యక్తి తనను మాన భంగం చేశాడని కేసుపెట్టింది.... కాదు అవతలి మనుషులు పెట్టించారు. కథ కోర్టు కెక్కింది. కోర్టులో ఆమె గత చరిత్ర తీసుకోబడింది. అన్నిసాక్ష్యాలూ పరిశీలించి కోర్టులో కేసు కొట్టివేశారు. కానీ అదే కేసులో ఒక్క స్త్రీ సాక్ష్యమే తీసుకుని ఉంటే తప్పు చెయ్యకుండానే అతడికి శిక్ష పడి ఉండేది కదూ?"

"అందులో నిజమే కావచ్చు. కానీ ఈ కోర్టుల్లో దోషులు కూడా శిక్షనుండి తప్పించుకుంటున్నారు కదా!"

"తప్పించుకుంటున్నారు. అందుకు కారణం ఏమంటారు?"

"అధికారం, లంచగొండితనాలకు న్యాయం లొంగిపోతుందంటాను. అంతే కాదు-ఈచట్టాలుకూడా దోషులు తప్పించు కోలేనంత పటిష్టంగా ఏర్పడాలంటాను" అన్నది విజయ.

"కరక్టే...అందుకు ఒప్పుకుంటున్నాను. ఇంతకీ అత్యాచారం జరిగిన తర్వాత మీ జీవితం ఎలా ఉంది?" అడిగింది జయంతి.

"కుళ్ళి కృశించి నశించిపోయేవిధంగా ఉంది. రోడ్డుమీదికి వెళ్ళాలంటే భయం. వెళితే లోకులు కాకుల్లా పొడుస్తారు. ఓ వింతమృగాన్ని చూసినట్లు చూస్తారు. కొందరయితే పచ్చిగా అవతలి హృదయం బాధపడుతుందని కూడా లేకుండా, మన ఎదుటే మన గురించి విమర్శిస్తారు. రౌడీమూక వెంటపడుతుంది. ఎవరయినా తెలిసినవాళ్ళుకనిపిస్తే ఎక్కడ ఈ ప్రస్తావన తీసుకుని వస్తారో అని భయంగా ఉంటుంది. ఇక రేప్‌చెయ్యబడ్డ ఆడదానిని ఎవరూ పెళ్ళిచేసుకోరు. ఆమె బతుకంతా ఒంటరిగానే గడపాలి"

"ఇవన్నీ మీరు ఈ సమాజంనుండి ఎదుర్కొంటున్న బాధలు. మరి ఇంట్లో ఎటువంటిబాధలు అనుభవిస్తున్నారో చెప్ప గలరా?"

"అదీ చెబుతాను. ఏ తల్లిదండ్రు లయినా తమ బిడ్డలు సుఖసంతోషాలతో ఉండాలనే కోరుకుంటారు. అందుకు వ్యతిరేకంగా జరిగినపుడు వారికి బాధ వేస్తుంది. ఆ భారం తమమీదనే పడినప్పుడు ఆ బిడ్డమీద విరక్తికలిగి తీరుతుంది. అంతే కాదు-తమ పెద్దకూతురువలన తమ చిన్న కూతురు భవిష్యత్తుకు దెబ్బకలిగే పరిస్థితుల్లో, పెద్దకూతుర్ని మాటలతో బాధ పెట్టటం మామూలే. అంతెందుకు - ఒక కొడుకు మీద ప్రేమున్నా అతడు సంపాదించకపోతే, అదే మరొకడు సంపాదిస్తుంటే ఆ రెండవవాడికే తల్లిదండ్రులు భయంతో సమాధానం ఇస్తారు. అటువంటిది ఓ ఆడపిల్ల అన్నివిధాలా కుటుంబానికి భారమయినపుడు ఆ బిడ్డను మాటలతో హింసించడం జరుగుతున్న చర్యే. నా తల్లిదండ్రులుకూడా అందుకు అతీతులేం కాదు. నా కన్నవారి గురించి అంత కంటే ఎక్కువ చెప్పలేను'' అంది విజయ.

నవ్వింది జయంతి.




''మిమ్మల్ని సమాజం చేత, ఇంట్లో వారిచేత ఇన్నిబాధలు పెట్టిస్తున్న ఆ నిందితుడిమీద మీకు ఎలాంటి కోపం ఉంది. అతణ్ని ఏం చెయ్యాలి? అని అంది?"

"నన్ను ఈ స్థితికి తెచ్చినవాణ్ని చంపెయ్యాలని ఉంది. కానీ వాడు దొరకడుకదా!ఆరోజు నామీద అత్యాచారం చేసేప్పుడే చంపేసి ఉంటే బాగుండేదని ఇప్పుడు అనిపిస్తోంది.కానీ ఆ సమయంలో ఏమీ తోచలేదు. ఎప్పటికైనా వాణ్ని వదలను. సమయం కలిసివస్తే వాణ్ని సరయిన దెబ్బ తీస్తాను" ఆత్మవిశ్వాసంతో అంది విజయ.

ఆమె 'ఆత్మవిశ్వాసానికి' అభినందనగా చూసింది జయంతి. తర్వాత మరో ప్రశ్న వేసిందామె.

"చివరగా ఓ ప్రశ్న. మీ భవిష్యత్తు గురించి మీరు ఇంకా ఏమీ ఆలోచించుకో లేదా?"

అప్పటివరకు ఆమె ప్రశ్నలకు సమాధానం ఇస్తున్న విజయ అప్పుడే ఏదో గుర్తు తెచ్చుకుంది. ఆమె ముఖం తెల్లబడింది. తర్వాత అందామె.

"రాత్రి ఓ నిర్ణయం తీసుకున్నాను"

"ఏమిటి?" ఆత్రుతగా అడిగింది జయంతి.

"ఇప్పుడు చెప్పలేను.రేపుసాయంత్రం రండి... తెలుస్తుంది. లేదా మీ అడ్రసు ఇవ్వండి. నా నిర్ణయం జాబు ద్వారా తెలియజేస్తాను. ఆ నిర్ణయం తెలుసుకున్న తర్వాతే ఆ వ్యాసం పూర్తిచేసి పత్రికిక్కి పంపండి. ఈ లోపల పంపవద్దు"

"అంత చెప్పకూడనిదా?" నిరాశగా అడిగింది జయంతి.

"ప్లీజ్ ....దాన్ని గురించి బలవంతం చెయ్యవద్దు" అంది విజయ.

"సరే...రేపు సాయంత్రం వస్తాను. లేకుంటే ఇదుగో నాఅడ్రసు. ఈ అడ్రసుకు ఆ నిర్ణయం గురించి ఉత్తరం రాయండి" ఓ కార్డు తీసి విజయకు అందిస్తూ అంది జయంతి.

"అలాగే" అంది విజయ.

"అడిగినదానికి ఓపిగ్గా సమాధానాలు ఇచ్చినందుకు చాలా కృతజ్ఞతలు. మీపై జరిగిన అత్యాచారాన్ని మర్చిపోయి ఓ మామూలు మనిషిగా మారాలని, అందరిలోకి రావాలని ఆశిస్తున్నాను" అంది జయంతి.

నవ్వింది విజయ. చెయ్యి ఊపి వెళ్ళిపోయింది జయంతి.

మళ్ళీ పుస్తకం తీసుకుని మంచం మీద పడుకుంది. ఆమె ఆలోచనలు పుస్తకంమీద నిలవడంలేదు. ఎక్కడో ఏవో ఆలోచనలు...

"ఇదిగో...నీకు ఉత్తరం వచ్చింది" కారమ్మ ఉత్తరం తెచ్చి అక్కడ పెట్టి వెళ్ళిపోయింది.

విజయ ఆశ్చర్యంగా పైకి లేచింది– తనకు ఉత్తరం రాసేవాళ్ళు ఎవరా అని. ఉత్తరం చింపి చదివింది.

రమణ రాశాడు అది. తనను వెంటనే రమ్మని ఉందా ఉత్తరంలో. అంత అవసరం లేకపోతే తనని రమ్మని రాయడు రమణ. ఇంతకీ తనని ఎందుకు రమ్మన్నాడు? ఆలోచించిందామె. ఆమెకు ఏమీ తోచలేదు.

సాయంత్రం రమణ గదికి వెళ్ళాలని నిశ్చయించుకుందామె. ఉత్తరం చించేసింది.

భోజనం పూర్తి చేసి, మంచం మీద పడుకుంది పుస్తకం తీసుకుని.



సాయంత్రం వీధిలోకి బయలుదేరింది.

"ఎక్కడికి?" అడిగింది శారదమ్మ.

"స్నేహితురాలింటికి"

బదులు పలకలేదు శారదమ్మ.

వీధిలోకొచ్చి నడవసాగింది విజయ.

వీధి చివర రౌడీ మూక కూర్చుని ఉంది. వాళ్లను చూసి కొద్దిగా బెదిరిందామె. కానీ ఆమెను ఎలాంటి మాటలు అనలేదు వాళ్లు. వాళ్లకు రమణ గుర్తున్నాడు. అందుకే పలకలేదు వాళ్లు.

రమణ గదికి చేరింది విజయ. అతడు ఆమెకోసమే ఎదురు చూస్తున్నట్టు ఉన్నాడు. వెళ్ళగానే అన్నాడు–

"రండి... మీకోసమే ఎదురు చూస్తున్నాను"

"ఏమిటి బాబు రానాడు?" కూర్చుంటూ అడిగిందామె.

"మీతో కొద్దిగా మాట్లాడాలని"

"ఏమిటి! నాతో మాట్లాడాలా?" ఆశ్చర్యంగా అడిగిందామె.

కొద్దిసేపు మౌనంగా ఉన్నాడు రమణ. తర్వాత అన్నాడు.

"నేను ఓ మాటడుగుతాను ... ఏమీ అనుకోవుగా"

ఆమె ఆశ్చర్యంగా అతడివైపు చూసింది.

"అనుకోను....చెప్పండి"

"నేను మిమ్మల్ని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను"

ఆ మాట విని ఆమె ఉలిక్కిపడింది. తర్వాత సర్దుకుని అంది-

"ఇది మీకు పుట్టిన బుద్ధి కాదనుకుంటాను"

"అలా ఎందుకనుకుంటున్నారు"ఆశ్చర్యంగా అడిగాడు అతడు.

"మీ ప్రేమ ఎంత గాఢమయిందో నాకు తెలుసు. అటువంటిది మీరు నన్ను పెళ్ళి చేసుకుంటాననడం వెనుక ఏదో కారణం తప్పక ఉంటుంది. ఏ కారణం లేకుండా మీరిలా అనరు" అన్నది విజయ.

మౌనంగా ఉన్నాడు రమణ.

"చెప్పండి... ఈ ఊహ మీకెలా కలిగింది" అడిగిందామె.

"మొన్న మోహన్ దగ్గరకు మిమ్మల్ని పెళ్ళిచేసుకోమని అడిగేందుకు వెళ్ళాను. అప్పుడు మోహన్ మిమ్మల్ని నన్నే పెళ్ళిచేసుకోమన్నాడు. ఆ రాత్రంతా ఆలోచించాను. మిమ్మల్ని పెళ్లి చేసుకునేందుకు నిశ్చయించుకున్నాను" చెప్పాడు.

విజయ ముఖం ఎర్రబడింది.

"అతడిదగ్గరకు మీరెందుకు వెళ్లారు?" కోపంగా అడిగిందామె.

"మనిషి మనసు గురించి తెలుసుకుందామని వెళ్ళాను. అతడు చేస్తున్న తప్పు గుర్తుచేసి మారేట్టు చూద్దామని వెళ్ళాను. కానీ అతడు ఎంతగా చెప్పినా వినలేదు. నా మాటల గురించి పట్టించుకోలేదు. చివరకు నన్నే పెళ్లిచేసుకోమన్నాడు"

"ఒకర్ని బతిమిలాడి, కాళ్ళావేళ్ళాపడి పెళ్ళి చేసుకోవాల్సిన అవసరంలేదండీ! మీరు అనవసరంగా శ్రమపడ్డారు"

"అందుకే అతడి ముఖంమీద కొట్టినట్లు మిమ్మల్ని నేనే పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాను" చెప్పాడు రమణ.

"క్షమించండి రమణగారూ!మీ కోరిక కాదంటున్నందుకు నన్ను క్షమించండి"

బిత్తరపోయి చూశాడు రమణ.

"ఏం....ఏం నేను మీకు భర్తగా తగనా?"గొంతు పెగుల్చుకొని అన్నాడు.

"మీలాంటి మనసున్నవారిని భర్తగా పొందే అదృష్టమే నాకు లేదు"

"నిన్ను నేను పెళ్ళిచేసుకుంటానని అంటున్నాను కదా!"

"వద్దండీ... మీరు నాకు ఓ మంచి స్నేహితులు. నాకు అదృష్టంవుంటే ఓ మంచి భర్త నాకు దొరకవచ్చు కానీ మీలాంటి మంచి స్నేహితుడు నాకు ఈ జన్మలో దొరకరు. అందుకే మీలాంటి మంచి స్నేహితుణ్ని పోగొట్టుకోలేను."

"ఈ మిత్రుణ్ని భర్తగా చేసుకోవచ్చు కదా?"

"చేసుకోవచ్చు. కానీ మిమ్మల్ని నా దురదృష్టంతో బాధపెట్టలేను. మీరు ఎంతో అభ్యుదయభావాలు కలిగినవాళ్లు.మీ అభ్యుదయ భావాలు ఈ సమాజాన్ని మేలుకొలిపేందుకు ఉపయోగించాలి. మీ విలువయిన బతుకును ఒక్క స్త్రీని ఉద్ధరించేందుకే వినియోగించకూడదు. రేపు మీరు నన్ను పెళ్ళిచేసుకుంటే మీ బతుకంతా ఈ సమాజాన్ని ఎదిరించేందుకే సరిపోతుంది. మీ మేధాసంపత్తి అంతా నాశనమయిపోతుంది. ఆనాడు లోకాన్ని ఉద్ధరించేందుకు ఉపయోగించాల్సిన మీ తెలివి ఒక్క స్త్రీ జీవితాన్ని బాగుచేసేందుకు సరిపోతుంది. అందుకే మీ




జీవితంలోకి నేను రాదలచుకోలేదు"

"పొరపడ్డారు. రేపు నేను ఎంత మందిని ఉద్ధరించగలనో తెలియదు. అటువంటప్పుడు ఓ స్త్రీ బతుకుని ఈనాడు ప్రత్యక్షంగా ఉద్ధరించడంలో ఎంతో ఆనందం ఉంది. నా జీవితం ధన్యమైందని భావిస్తాను."

"వద్దండీ... నేను మీ జీవితంలో ప్రవేశిస్తే రేపు మీరు లేప్‌చెయ్యబడ్డ స్త్రీని పెళ్ళిచేసుకోవటం గొప్పతనం అని చెపితే తను చేసిన పనిని గొప్పగా చెప్పుకుంటున్నాడు అంటారు అందరూ"

"అలా ఎందుకు అనుకోవాలి? తను ఆచరణలో పెట్టిందే చెబుతున్నాడు అని అంటారని ఎందుకు అనుకోకూడదు?''

"ఆచరణలో పెట్టింది చెప్పడంకన్నా చెప్పింది ఆచరణలో పెట్టడం గొప్పగా ఉంటుంది. అదే ఆమోదయోగ్యం అవుతుంది''

"అవన్నీ ఇప్పుడెందుకు విజయగారూ నేను మిమ్మల్ని పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాను. మీరు ఏం చెబుతారు?''అడిగాడు రమణ.

"క్షమించండి రమణగారు! ఈ విషయంలో నన్ను బలవంతం చెయ్యవద్దు. మీ మాట కాదంటున్నందుకు ఎంతో బాధ పడుతున్నాను."

"అయితే పెళ్ళి చేసుకోకుండానే ఎప్పుడూ ఇలాగే ఉంటారా! ఆనాడు మీరు ఎంతమందికి భారంఅవుతారో ఆలోచించారా! అసలు ఈ సమాజంలో మీరు అలా బతుకగలనని అనుకుంటున్నారా? మీ భవిష్యత్తు గురించి ఏమైనా ఆలోచించారా?'' బాధగా అడిగాడు రమణ.

"మిమ్మల్ని పెళ్ళిచేసుకోకపోవడానికి కారణం నా భవిష్యత్తుగురించి నేను తీసుకున్న నిర్ణయమే. నా భవిష్యత్తు గురించి నేను ఆలోచించానండీ. రాత్రి ఓ నిర్ణయం కూడా తీసుకున్నాను. నా భవిష్యత్తుకు ఎటువంటి ఇబ్బందీ కలుగదు.''

"ఏమిటి ఆ నిర్ణయం'' అడిగాడు రమణ.

"రేపు చెపుతాను" అంది విజయ.

"ఏం.... ఇప్పుడు చెప్పకూడదా?''

"ప్లీజ్... ఏమనుకోవద్దు. రేపు మధ్యాహ్నం మీ ఆఫీసుకు నేనే ఫోన్‌చేసి చెబుతాను''

"సరే ఫోన్‌నెంబర్ ఉందిగా?" అడిగాడు రమణ.

"ఇంట్లో ఉంది"

"సరే విజయగారూ! మిమ్మల్ని పెళ్లి చేసుకోలేకపోవడం బాధ కలిగిస్తోంది. పోనీలెండి. మీరయినా ఆనందంగా ఉంటే అంతే చాలు. మీ భవిష్యత్తు కోసం మీరు మంచి నిర్ణయం తీసుకుంటారని ఆశిస్తాను" అన్నాడు రమణ.

"మీరు బాధపడాల్సిన అవసరం లేదండీ! మీరు నాయందు జాలిపడి పెళ్లి చేసుకోబోయారు. అందుకు నేను ఎంతో సంతోషిస్తున్నాను"

అతడు మౌనంగా ఉన్నాడు.

"నేను వెళ్తాను" లేచిందామె.

"పొద్దుపోలేదుగా" అన్నాడు రమణ.

"లేదండీ... ఇంటి దగ్గర కొద్దిగా పని ఉంది'' చెప్పిందామె.

"సరే పదండి. మిమ్మల్ని విడిచి వస్తాను''

"ఫర్వాలేదు... నేను వెళ్ళగలను'' చెప్పింది విజయ.

"మీ వీధి చివర రౌడీమూక ఉంటుందేమో'' అనుమానంగా అన్నాడు రమణ

"మీ దెబ్బకు భయపడి నా జోలికి

రావడం మానేశారు. మీరు చెప్పింది నిజం. ఎదిరిస్తే లోకం తోకముడుచుకుని పారిపోతుంది'' అన్నది విజయ.

నవ్వాడు రమణ.

చెప్పి వెళ్ళిపోయిందామె.




గదిలో కూర్చుని ఆలోచిస్తోందామె. తను తీసుకున్న నిర్ణయం గురించి చివరిసారిగా ఆలోచించింది. అది తప్ప వేరే మార్గం కనిపించలేదు.

సుశీల భోజనం చేసి వచ్చి పడుకుంది కాసేపు తర్వాత లైటు తీసేసింది సుశీల. నిద్రపట్టలేదు విజయకు. కాసేపు ఆలోచించింది. లేచి లైటు వేసింది. టేబిల్ ముందు కూర్చుని ఉత్తరాలు రాయడం మొదలుపెట్టింది.

"ఏమిటక్కా రాస్తున్నావు?" లేచి అడిగింది సుశీల.

"ఏమీలేదు నువ్వుపడుకో" చెప్పింది విజయ.

సుశీల పడుకుంది.

ముందుగా జయంతికి ఉత్తరంరాసింది. తర్వాత తన తండ్రికి ఒక ఉత్తరం రాసి పెట్టింది. కొద్దిసేపు ఆలోచించి, మోహన్‌కి కూడా ఓ ఉత్తరం రాసి పూర్తి చేసింది. పూర్తి చేసిన ఉత్తరాలు భద్రంగా ఓ పుస్తకంలో పెట్టింది. పుస్తకాన్ని అన్ని పుస్తకాల అడుగున పెట్టింది. ఆమెకు తెలుసు ఆ ఉత్తరాలు మరురోజు మధ్యాహ్నం లోపల ఎవరైనా చూస్తే తను నిశ్చయించుకున్న నిర్ణయం అందరికీ తెలిసిపోతుందని. అందుకే వాటిని చాలా భద్రంగా దాచింది.

వచ్చి మంచం మీద పడుకుంది. ఆలోచనలు..ఎడతెగనిఆలోచనలు ఆమెను చుట్టుముట్టాయి.

ఈ లోకంలో స్త్రీకి ఎందుకిన్ని బాధలు, కష్టాలు, కన్నీళ్లు?అన్నీ స్త్రీకేనా? సుఖాలు, సంతోషాలు మగవాడి సొత్తా!

సృష్టికి మనుగడనిచ్చేది స్త్రీ. నవ మాసాలు మోసి కనేది స్త్రీ, బిడ్డల మల మూత్రాదులు తీసేది స్త్రీ, బిడ్డల్ని తీర్చి దిద్దేది స్త్రీ, బిడ్డల ఎంగిలి తినేది స్త్రీ. అటువంటి స్త్రీకేనా ఇన్ని కష్టాలు.

అందుకే ఈ కష్టాల నుండి సెలవు తీసుకోవాలి!

నాలుగు గోడల మధ్య ఉంచి కొడితే పిల్లి పులి అయి ఎదురుతిరుగుతుంది. సమాజం తనను ఎన్నో బాధలు పెట్టబట్టే తను ఎదురు తిరిగి ఈ నిర్ణయం తీసుకుంది. ఇంతకీ తను తీసుకున్న నిర్ణయం ఏమిటి?

"ఈ ఇంట్లో నుండి దూరంగా వెళ్ళి ఈ సమాజాన్ని ఎదిరించడం; స్త్రీ అబల కాదని, సబల అని నిరూపించడం"

* * *

జయంతికి తను రాసిన ఉత్తరం తీసి చదువసాగింది విజయ.

"మా ఇంట్లోనుండి నేను దూరంగా వెళ్ళిపోతున్నాను జయంతిగారూ! 'ఇంత పిరికి నిర్ణయమా?' అని మీరు అనుకోవచ్చు. కానీ మీకు తెలియదు. ఓ మామూలు ఆడది తనపై అత్యాచారం జరిగితే అసలు తట్టుకోలేదు. చనిపోవా




లనే అనుకుంటుంది. వీధిలో, ఇంట్లో ఆమెకు అటువంటి భయంకర పరిస్థితులు ఎదురవుతాయి. ఆ పరిస్థితులను తట్టుకోవడం కష్టం. ఎంతో మానసిక సంఘర్షణ అనుభవించాలి. అటువంటి మానసిక సంఘర్షణను కూడా ఓ స్త్రీ ఎదుర్కొంటోంది అంటే దానికి కారణాలు, ఆమెకు ఉన్న బిడ్డల్లాంటి బంధనాలు అయి ఉండాలి, లేదా ఈ సమాజాన్ని ఎదిరించాలనే పట్టుదల అన్నా అయి ఉండాలి. కాకుంటే చావును గురించిన భయమైనా అయివుండాలి.

"నేను మాత్రం ఈ మానసిక సంఘర్షణకు తట్టుకొని ఈ సమాజాన్ని ఎదిరించి నిలబడాలనే అనుకుంటున్నాను. పురుషాధికక్యత కల ఈ సమాజంపై తిరగబడ్డ ఓ స్త్రీలా పోరాడాలనే నిశ్చయించుకున్నాను. పురుషుడు ఏర్పరచిన కట్టుబాట్లు ఎదిరించి, శీల ప్రాధాన్యతను ధిక్కరించి ఒక గొప్ప స్థితికి రావాలనే అనుకుంటున్నాను. స్త్రీ పురుషులు అన్నింటా సమానులే అని చాటిచెప్పేందుకే వెళుతున్నాను. పిరికితనంతోనో, భయపడో వెళ్ళడం మాత్రంకాదు.

"నాలాగా మగాడి దౌర్జన్యానికి గురయ్యే అందరు యువతులకు నా ద్వారా ఓ కొత్త నీతిని నేర్పుదామనే ఉద్దేశంతో కూడా వెళుతున్నాను. ఎవ్వరూ చనిపోయి సాధించలేరు. బ్రతికి ఏదయినా సాధించవచ్చు. అందుకే తమ తమ ఇళ్ళలో బతకలేని పరిస్థితులు ఏర్పడిన స్త్రీలు అక్కడే ఉండనవసరం లేదు. అక్కడ వదిలేస్తే ఎక్కడైనా హాయిగా బతకొచ్చు. ఒకవేళ బయట బతకలేని పరిస్థితులు ఏర్పడినా, అలా పోరాడటంలో ఒక ఆనందం ఉంది. అందుకే జీవితంలో పోరాడటం నేర్చుకోమని తెలియజెయ్యబోతున్నాను.

"సంపాదించడం చాతకాని మగాడు, స్త్రీని పుట్టింటి నుండి డబ్బులు తెమ్మని పోరడము, ఆ బాధ భరించలేక స్త్రీ ఆత్మహత్య చేసుకోవడం మనం రోజూ పేపర్లలో చూస్తూనే ఉంటాము. ఆ స్త్రీలు అలా బతకనవసరం లేదని, ఆ చాతకాని మొగుణ్ని వదిలేసి నాలా ధైర్యంగా బ్రతికేందుకు రమ్మని చెప్పబోతున్నాను. నా భవిష్యత్తు ఆడదాని చైతన్యానికి ప్రతిబింబంలా మార్చబోతున్నాను.

"అయితే మీరో ప్రశ్న వెయ్యొచ్చు. ఆ పోరాటం ఇక్కడినుండే ఎందుకు చెయ్యకూడదని. ఇక్కడే ఉంది ఈ సమాజాన్ని ఎదిరిద్దామంటే నా తల్లి దండ్రులకు, నా ఉనికి బాధ కలుగుతుంది. నా ప్రభావం నా చెల్లెలి ఆశల్ని కూలగొడుతుంది. ఎంతయినా వారు తల్లి దండ్రులు కదా! అందుకే నాపోరాటాన్ని వేరే ప్రాంతంనుండి ప్రారంభించబోతున్నాను."

కింద సంతకంచేసి ఆ ఉత్తరం మడిచి పెట్టింది.

వాటిని హేండ్‌బాగ్‌లో పెట్టుకుని మెల్లగా వరండాలోకెళ్ళి చూసింది. శారదమ్మను నిద్రాదేవత అప్పటికే ఆవరించేసి ఉంది. ఇవతలకు వచ్చేసింది విజయ.

శబ్దంకాకుండా బీరువాతీసి అంతకు ముందు తను తీసిపెట్టిన సర్టిఫికెట్స్ తీసి ఎయిర్‌బాగ్‌లో పెట్టుకుంది. పైన ఓ మూలవున్న నగలలో కొన్ని తీసుకుంది. రెండుజతల గుడ్డలను కుక్కుకుంది. మరో అరలో ఉన్న డబ్బులలో రెండువందల రూపాయలు లెక్కపెట్టి తీసుకుంది.

బీరువా తలుపు వేసేసింది. ఎయిర్

బాగ్ జిప్ అందుకుని లాగేసింది. ఇక తనకు ముఖ్యమైనవి ఏమున్నాయి అని ఆలోచించింది. ఏమీలేవు. అవతలకు నడిచి శారదమ్మ నిద్రపోతున్న గది దగ్గరకు వెళ్ళింది. ఆమె నిద్రపోతూనేవుంది.

ఇవతలకు వచ్చి ఎయిర్ బాగ్ అందుకుంది. మరో చేత్తో హేండ్ బాగ్ అందుకుంది. ఇంటి తలుపు గడియ తీసుకుని గడప దాటి తలుపు దగ్గరకు వేసింది. రెండు అడుగులు ముందుకు వేసింది. ఇంటిని చివరిసారిగా కంటినిండా చూసుకుంది. ఆ ఇంటికి, తనకి ఋణం తీరిపోయింది.

వడివడిగా వీధిలోకి నడిచింది. మిట్ట మధ్యాహ్నం కావటంతో అందరూ తలుపులు వేసుకుని ఇళ్లలో ఉన్నారు.

వీధి దాటి మెయిన్ రోడ్లోకి వచ్చింది విజయ. మెయిన్‌రోడ్ పక్కనే ఉన్న ఓ పోస్టాఫీసులోకి వెళ్ళింది.

లోపలికెళ్ళి రెండు కవర్లు తీసుకుంది. హేండ్ బాగ్‌లో నుండి ఉత్తరాలు తీసుకుంది. ముందుగా జయంతికి రాసిన ఉత్తరం తీసి చూసింది. ఉత్తరం కవర్లో పెట్టి అంటించి అడ్రసు రాసింది. తర్వాత మోహన్ ఉత్తరం కవర్లో పెట్టి అడ్రసు రాసింది. బయటకువచ్చి రెండు ఉత్తరాలూ పోస్టుడబ్బాలో వేసింది.

మళ్ళీ లోపలకు వెళ్లింది. లోకల్‌కాల్ చేసుకునే పబ్లిక్ బూత్‌లోకెళ్ళి ఓ నంబర్ డయల్ చేసింది. అవతలి కంఠం 'ప్రకాష్ హియర్' అని వినిపించిన తర్వాత యాభై పైసల నాణం వేసింది.

"హలో" అంది విజయ.

"హలో... ఎవరు మాట్లాడేది?" అడిగాడు ప్రకాష్.

"నేను.... విజయను మాట్లాడుతున్నాను"

"ఏ విజయ?" అడిగాడు.

"అదే కొద్దికాలం క్రితం నీ ఆఫీసులో పనిచేస్తూ కొన్ని నెలల క్రితం మీచే చెరచబడిన విజయని"

అవతలిగొంతు కాసేపు నిశ్శబ్దంగా వుంది. ఆమెకు తెలుసు అవతలి వ్యక్తికి తను ఎందుకు ఫోన్ చేసిందో అర్థంకాక బిత్తరపోయి ఉంటాడని. కొద్దిసేపుతర్వాత అవతలిగొంతు వినిపించింది.

"అయితే ఇప్పుడేమంటావు"

"నేను నువ్వు చేసిన పనికి ఈ ఊరు విడిచిపెట్టి వెళ్లిపోతున్నాను... ఇప్పుడే వెళ్లిపోతున్నాను" అంది విజయ.

అవతలి గొంతు పలకలేదు. అతడు ఆ మాటతో సంతోషంగా ఉన్నాడని అర్థంచేసుకుందామె.

"నేను వెళ్ళిపోతున్నానని సంతోషంగా ఉన్నావా! నేను వెళ్లిపోతే కోర్టుల్లో కేసు కొట్టివేస్తారని అనుకుంటున్నావు కదూ! అంతటితో శిక్ష తప్పిపోతుందని ఆనందంగావుంది కదూ!" అడిగింది విజయ.

అందుకు కూడా అవతలి గొంతు పలకలేదు.

"నేను వెళ్లిపోయినా నిన్నుమాత్రం నేను వదలను. కోర్టులో శిక్షనుండి నువ్వు తప్పించుకుంటావని నాకు అర్థంఅయింది. నాకు న్యాయం జరగని ఆ తీర్పుకోసం నేను కాచుకుని ఉండలేకపోతున్నాను."

"మరి నువ్వేంచేస్తావు?" అప్పటికి అడిగాడు ప్రకాష్.

"ఎదురుదెబ్బ తీస్తాను... నిన్ను నడివీధిలో నిలబెడతాను"

"పగటికలలు కంటున్నావా! లేక సినిమాలు చూసి అందులో హీరోయిన్ విలన్




మీద పగతీర్చుకున్నట్టు నా మీద పగ తీర్చుకోవాలని ఆలోచిస్తున్నావా?" హేళనగా అడిగాడు ప్రకాష్.

"అవును...నీమీద పగ తీర్చుకోవాలనే వెళుతున్నాను. అందుకు కావలసిన దృఢ విశ్వాసం ఉంది నాకు"

"ఓ ఆడదానివి నువ్వు నన్నెలా దెబ్బ తీస్తావు?" అడిగాడు ప్రకాష్.

"ఇప్పుడు నాకు స్త్రీ శీలం మీద నమ్మకంలేదు. స్త్రీ తెగిస్తే ఏమవుతుందో నీకు చూపిస్తాను"

అవతలి వ్యక్తి ఆ విషయాన్ని జీర్ణించుకునేందుకు కొద్దిసేపు పడుతుంది. అతడికి అర్థంఅయింది. అవతలి స్త్రీ తను ఊహించినంత తెలివితక్కువగా ప్రవర్తించడంలేదు.

"ఓకే! ఇప్పటినుంచే ఎప్పుడు నీమీద విరుచుకుపడుతానో అని ఆలోచించు కుంటూ కూర్చో... గుడ్‌బై"

అవతలి గొంతు మళ్ళీ వినకుండా ఫోన్ పెట్టేసింది.

మళ్ళీ ఫోన్ తీసి మరో నెంబర్ డయల్ చేసింది.

"హలో'' అన్నది అవతలి గొంతు.

అర్థరూపాయి నాణంవేసి అన్నదామె-

"రమణ కావాలి"

"ఏ రమణ ?" అడిగింది అవతలి గొంతు.

''మీ ఆఫీసులో పనిచేస్తుంటాడే ఆ రమణ'' చెప్పింది విజయ.

''లైన్లోఉండండి...పిలుస్తాను"అన్నది అవతలి కంఠం.

కొద్దిసేపు తర్వాత రమణ లైన్లోకి వచ్చాడు.

"హలో... రమణా స్పీకింగ్''

''హలోరమణగారూ!నేను..విజయను మాట్లాడుతున్నాను" అంది విజయ.

"విజయగారా! మీరు ఫోన్ చేస్తారని అనుకుంటూనే ఉన్నాను. ఇప్పుడయినా చెప్పండి ఏమిటి మీరు తీసుకున్న నిర్ణయం?'' అడిగాడు రమణ.

''నేను ఇంట్లోంచి వెళ్ళిపోవాలను కుంటున్నానండీ. ఆ నిర్ణయం రెండు రోజులక్రితమే తీసుకున్నాను. మీకు ఆ నిర్ణయం గురించి చెబితే మీరు ఒప్పుకోరని ఇప్పుడు వెళ్ళిపోబోయే ముందు మీకు చెబుతున్నాను''

''వాట్ డు యూ మీన్ ! మీరు ఇంట్లోంచి వెళ్ళిపోతున్నారా ? అంత అవసరం ఏమొచ్చింది?"

అవతలి గొంతులోని ఆదుర్దా గమనించింది విజయ.

"నేను తెలిపిన ఈ వ్యక్తుల మధ్య చెడిపోయిన ఆడదానిలా నేను బతకలేను. నా తల్లిదండ్రులకు భారంగా ఉండలేను"

''అందుకని వెళ్ళిపోవాలని నిశ్చయించుకున్నారా!ఇంత పిరికినిర్ణయమా!''

"ఆ మాట మీరు అంటారని నాకు తెలుసు. కానీ నేను పిరికితనంతో పారిపోవడం లేదు. నేను పిరికిదాన్నయి ఉంటే ఈ లోకులు పెట్టే బాధలకు ఎప్పుడో ఆత్మహత్య చేసుకుని ఉందును. నాకు తెలుసు చచ్చి సాధించేది ఏమీలేదని. అందుకే బతకాలని నిశ్చయించుకున్నాను. ఈ సమాజాన్ని ఎదిరించాలని నిశ్చయించుకున్నాను. అంతేకాదుమీరు చెప్పిన మాటలు నాకుబాగా గుర్తున్నాయి. ఈ సమాజాన్ని ఎదిరించడం నేర్చుకున్ననాడే ఈ సమాజంలో స్త్రీ స్థితి బాగుపడుతుందన్నారు. అందుకే ముందుకు వెళుతున్నాను" చెప్పింది విజయ.

"వద్దండి...మీరు ఎక్కడికీ వెళ్ళవద్దు.

నా మాట వినండి" ఆందోళనగా అన్నాడు.

"మీరు రమణేనా మాట్లాడేది! నాకు అనుమానం వస్తోంది. స్త్రీజాతి ధైర్యంగా ఎక్కడికైనా వెళ్ళి బతకాలి అన్న చైతన్యమూర్తి రమణేనా ఇలా పిరికిగా మాట్లాడుతున్నాడు" అంది విజయ.

"నేను పిరికిగా అనటం లేదు. విజయ గారూ....సమాజాన్ని ఎదిరించాలన్న మీ ధైర్యాన్ని అభినందిస్తున్నాను. కానీ మీరు ఎక్కడికో వెళ్ళడం భరించలేకపోతున్నాను. మీరు సమాజంలోని అంతర్గత శత్రువుల్ని ఎదుర్కోవాలని చెప్పాను. కానీ బహిర్గతంగా ఉండే శత్రువులు దొంగలు, తార్పుడుగాళ్ళు, మోసగాళ్ల గురించి చెప్పలేను. మీరు ఒంటరిగా వెళితే, అలాంటి శత్రువులు ఎందరో ఎదురవుతారు. వారికి ఆడా మగా భేదం లేదు. అందుకే మీరు ఈ సమాజాన్ని ఎదిరించదలచుకుంటే ఇక్కడే మా అందరి ముందు వుండే ఎదిరించండి. అందుకు నాలాంటివారి ప్రోత్సాహం కూడా ఉంటుంది"

"నేను ఇక్కడ ఉండలేనండీ! ఇక్కడ ఉంటే నా ఉనికి నా తల్లిదండ్రులకు బాధ కలిగిస్తుంది. నా వలన నా చెల్లెలి పెళ్ళి కాదు. అందుకే దూరంగా వెళ్ళిపోవాలనుకుంటున్నాను" చెప్పింది విజయ.

"ఆపది ఎదిరించి బతకడాన్ని



నేనూ ప్రోత్సహిస్తాను.కానీ ఈ సమాజంలో స్త్రీ ఒంటరిగా దూరంగా వెళితే ఎన్ని ఇబ్బందులలో మీకు తెలియదు. బతుకు తెరువు మొదలుకొని ఉన్న ధనాన్ని, మానాన్ని కాపాడుకోవడం వరకూ బాధ పడాలి. ఇప్పుడు మీరు మీ ఇంటికే వెళ్ళ నవసరం లేదు. వేరుగా మరోగదిలో ఒంటరిగా ఉండి సమాజాన్ని ఎదిరించండి. నేను మీకు అండగా ఉంటాను"

"అలాచేస్తే నా తల్లిదండ్రులు బాధ పడతారు. అందుకే నేను ఇక్కడ ఉండ లేను. అంతేకాదు- నేను నా మనసులో మరో ఆశయం నెరవేర్చుకోవాలను కున్నాను. ఇక్కడ ఉంటే ఆ ఆశయం నెరవేర్చుకోలేను. అందుకే దూరంగా వెళ్ళిపోతున్నాను"

"ఏమిటి మీ ఆశయం?" అడిగాడు రమణ.

"దీనంతటికీ కారకుడయిన ఆ ప్రకాష్‌ని ఎదురుదెబ్బ తియ్యడం. స్త్రీ ఎదురుతిరిగితే సారీ దాన్ని లోకం బరితెగించటం అంటుందేమో, అదే అలా బరితెగిస్తే ఏం జరుగుతుందో చూపిద్దామని నిశ్చయించు కున్నాను"

"అది జరిగేపనికాదు విజయగారూ! నా మాట విని దయచేసి ఆగిపొండి"

"చాలా పిరికిగా మాట్లాడుతున్నారు రమణగారూ! మీలో స్త్రీని ఉద్ధరించాలనే ఆశయం ఉంది. కానీ స్త్రీ గురించిన అవగాహన తక్కువగా ఉంది. స్త్రీ మన స్తత్వం గురించి తెలియదు. ముందు మీరు స్త్రీ మనస్సు గురించి తెలుసుకోండి. అంతేకాదు - మీ ఆశయాల్ని గురించి క్షుణ్ణంగా అర్థంచేసుకోండి. విమర్శకులు వేలెత్తి చూపించలేనివిధంగా నడుచుకోండి.

ఇది నా సలహా. ఇక నేను అనుకున్నది సాధిస్తాను. నాకు టైము అయింది .... వస్తాను" ఫోన్ పెట్టేసింది విజయ.

వేగంగా రోడ్డులోకి వచ్చింది. వెళ్తున్న ఓ ఆటోని ఆపింది.

"ఎక్కడికి?" అడిగాడు ఆటోడ్రైవర్.

"రైల్వేస్టేషన్‌కి" చెప్పింది విజయ.

"కూర్చోండి" చెప్పాడు అతడు.

కూర్చుంది విజయ. ఆటో కదిలింది. వాచ్ వంక చూసుకుంది. మరో అయిదు నిమిషాలలో ఎక్స్‌ప్రెస్ ఉంది. ఆలోచిస్తూ వెనక్కు వాలింది.

తన కోసం ఎవరైనా వస్తారేమో! ఎవరొస్తారు? తన తల్లి మరో గంట వరకూ లేవదు.అంటే ఇంట్లోవాళ్ళకు మరో గంట వరకూ తెలవదు.ఇక ఎవ్వరికీ తెలిసే అవకాశం లేదు. అయితే తను వెళ్తున్నా నని తెలిసిన మరో వ్యక్తి రమణ. అతడు సామాన్యంగా తనకోసం రాడు. ఒకవేళ వచ్చినా అతడి ఆఫీసు ఇక్కడికి ఎంతో దూరం. ఎంత వేగంగా వచ్చినా మరో పది, పన్నెండు నిముషాలు పడుతుంది. అప్పటికి తను టిక్కెట్ తీసుకుని ట్రైన్ ఎక్కేసి ఉంటుంది. ట్రైన్ ఎక్కితేచాలు తను ఇక ఎవ్వరికీ కనిపించదు. మూడు నిముషాలలో ఆటో రైల్వేస్టేషన్ ముందు ఆగింది. ఆటోకి డబ్బులు ఇచ్చి లోపలికి వెళ్ళింది. ఎంక్వయిరీ మూసేసి ఉంది. టిక్కెట్ క్యూలో నలుగురయిదు గురు నిలబడి వున్నారు. క్యూలో నిల బడింది విజయ. తన వంతువచ్చింది.

"మద్రాసు వైపు వెళ్ళే ఎక్స్‌ప్రెస్ ప్లాట్‌ఫాం మీద ఉందా?" అడిగింది విజయ.

"లేదండీ .... ఈరోజు అరగంట ఆలస్యంగా వస్తుంది"

"పోనీ బొంబాయి వైపు వెళ్ళే

ఎక్స్ప్రెస్ వెంటనే వస్తుందా?" గుండె గుభేలుమనగా అడిగింది.

టిక్కెట్ ఇచ్చే వ్యక్తికి ఎదుటిమనిషి వాలకం అర్థం అయింది.

"మరో అరగంటవరకూ ఏ ఎక్స్‌ప్రెస్ లేదండీ! కనీసం పాసింజర్ బండి వచ్చేందుకు కూడా మరో ముప్పావుగంట పడుతుంది.

విజయలో భయం మొదలయింది.

"ఇంతకీ టిక్కెట్ ఇవ్వమంటారా?" అడిగాడు అతడు.

"ఇవ్వండి" వందరూపాయలనోటు ఇస్తూ అంది.

"ఎక్కడికి?"

"మద్రాసుకివ్వండి" చెప్పింది విజయ.

"సినిమాల్లో వేషం కోసం వెళ్తున్నారా!" వ్యంగ్యంగా అడిగాడు అతడు.

"ముందు టిక్కెట్ ఇవ్వండి" మర్యాదగా అడిగింది విజయ.

ఆ మాటతో ఎదుటి వ్యక్తి మౌనంగా టిక్కెట్ ఇచ్చి చిల్లర ఇచ్చాడు. టిక్కెట్ తీసుకుని ప్లాట్‌ఫాం మీదికి వెళ్ళింది. దిక్కులు చూసింది — తనకు తెలిసినవాళ్ళెవరయినా ఉన్నారా అని. లేరు. వడివడిగా లేడీస్ వెయిటింగ్ హాల్లోకి వెళ్ళి కూర్చుంది బితుకు బితుకుమనే గుండెతో. కాసేపు తర్వాత అలసటగా తల వెనక్కువాల్చి ఆలోచించసాగింది.

* * *

ఫోన్ పెట్టేశాడు రమణ. అతడి ముఖం బాధగా ఉంది. ఒక్క క్షణంలో అతడిలో ఎన్నో భావాలు కదిలాయి. విజయ వెళ్ళిపోతుందా? ఆమె ఎక్కడికో దూరంగా వెళ్ళిపోతుంది. ఆమె ఇక తనకు కనిపించదా! ఆమె వెళ్ళి ఎక్కడయినా ఒంటరిగా బతకగలిగితే ఫర్వాలేదు. తనకు సంతోషమే. కానీ ఈ సమాజంలో ఒంటరి స్త్రీకి ఎన్ని బాధలో ఆమెకు తెలియదు. అంతేకాదు– ఈ లోకంలో అంతా మోసాలమయం. ఈ లోకంలో దొంగలు, మోసగాళ్లు, తార్పుడుగాళ్లు ఉన్నారు. విజయ అలాంటివారి చేతిలోపడితే ఇక బతుకు దుర్భరమైపోతుంది. ఈ దేశంలో ఆడది ఎక్కడికో దూరంగావెళ్ళి ఎందుకు బతకలేకుందంటే అలాంటి ఏ వెధవచేతిలో నయినా తను పడి నాశనమయిపోతుందని ఆమె భయం. నిజమే.... కానీ భయపడి ఇంట్లోనే కూర్చుంటే స్త్రీ సమాజాన్ని ఎలా ఎదిరించగలదు? ఈ సమాజంతో పాటు ఈ బహిశ్శత్రువుల్ని కూడా ఎదుర్కొన్నపుడే స్త్రీ చైతన్యమూర్తి అయ్యేది. ఆ యజ్ఞంలో విజయలాంటి కొందరు స్త్రీలు సమిధలయి కాలిపోవచ్చు. తిరుగుబాటు జరిగేప్పుడు కొంత జననష్టంకాక తప్పదు. అందుకే చైతన్యమూర్తి అయిన విజయలాంటి స్త్రీలను తనలాంటివారు ప్రోత్సహించాలి. అంతేకానీ అలాంటివారిని నిరుత్సాహపరచకూడదు. అయితే విజయకు ఈ లోకం గురించి అంతగా తెలీదు. అవును...ఆమెవెళ్ళేలోగా ఆమెను కలుసుకోవాలి. ఆమెకు కొన్ని జాగ్రత్తలు చెప్పాలి.

పక్కకుతిరిగి ప్రొప్రయిటర్ వంక చూసాడు. అప్పటివరకూ రమణనే చూస్తున్నాడు అతడు.

"ఎవరోఇంట్లోనుంచి వెళ్ళిపోతున్నట్టున్నారు?" అడిగాడు అతడు.

"అవును" చెప్పాడు రమణ. "మీ బుల్లెట్ కాస్త ఇస్తారా! ఓ అరగంటలో తెచ్చి ఇచ్చేస్తాను"

"ఇదిగో తాళాలు తీసుకో. తొందరగా

వెళ్ళు. ముందు బస్టాండు, తర్వాత రైల్వే స్టేషన్ చూడు'' అన్నాడు అతడు.

తాళాలు తీసుకుని గదిదాటి ఇవతలకు వచ్చాడు. మళ్ళీ ఏదో గుర్తొచ్చినట్టు గదిలో కెళ్ళాడు.

"ఒకసారి ఫోన్ వాడుకుంటాను" అన్నాడు రమణ.

''అది కూడా అడగాలా! వాడుకో'' అన్నాడు అతడు.

ఫోన్ ఎత్తి డయల్ చేశాడు. అవతల రిసీవర్ ఎత్తారు.

"కాషియర్ మోహన్ కావాలి. ఆయన ఉన్నారా?''

"ఇప్పుడే ఇంటికి వెళ్ళబోతున్నారు. ఒక్క క్షణం ఉండండి పిలుస్తాను"

కాసేపు తర్వాత లైన్లోకి వచ్చాడు మోహన్.

"మోహన్ స్పీకింగ్" అన్నాడు.

''నేను..రమణని మాట్లాడుతున్నాను" రమణ అన్నాడు.

''హలో రమణా! ఏమిటి, ఏమిటిలా ఫోన్ చేశావు?''

"అవసరమొచ్చే చేశాను. నువ్వు మోసంచేసిన విజయ ఇప్పుడే ఊరువిడిచి పెట్టి వెళ్ళిపోబోతోంది. నీకు ఆమెమీద ఏదయినా జాలికానీ, ప్రేమగానీ ఉంటే ఈచివరిక్షణాన్ని సద్వినియోగం చేసుకో. పోనీ నీమీద ప్రేమతోనయినా ఆమె మనసు మార్చుకుంటుందేమో"

"విజయ వెళ్ళిపోతోందా! నీకెలా తెలుసు?" ఆత్రుతగా అడిగాడు మోహన్.

''ఎలా తెలుసన్నది కాదు సమస్య. ఇంతకీ ఈ చివరిక్షణాన్ని సద్వినియోగం చేసుకుంటావా? ఆమెను పెళ్ళి చేసుకుంటావా? ఈ చివరిక్షణాన్నయినా నువ్వు సద్వినియోగం చేసుకోగలిగితే ఓ స్త్రీ బతుకు దారికివస్తుందన్న ఆశతో చేస్తున్నాను''

"నన్ను క్షమించు రమణా! నా పెళ్ళి కుదిరిపోయింది. ఇప్పుడు నేనేమీ చెయ్యలేను"

"నాకు తెలుసు నువ్వు మోసగాడివని. కానీ ఈ క్షణమైనా నీ మనస్సు మారుతుందేమో అనుకున్నాను. ఓ స్త్రీ జీవితం సక్రమంగా జరిగేట్టు చూడాలనుకున్నాను. సారీ! నీ గురించిన నా అంచనా తప్పని తెలుసుకున్నాను. వస్తాను... విజయ ఎక్కడుందో వెతికి ఆమెకు వీడ్కోలు చెప్పి వస్తాను... గుడ్ బై"




ఫోన్ పెట్టేసాడు రమణ. వేగంగా కిందికి పరిగెత్తాడు.

బుల్లెట్ ని ఒక్క కిక్ తో స్టార్ట్ చేశాడు. రివర్స్ చేసి వేగంగా ముందుకు పరిగెత్తించాడు. యాక్సిలేటర్ బలంగా తిప్పాడు. స్పీడో మీటర్ ముందుకు కదులుతోంది.

మరో అయిదు నిముషాల్లో ఆర్.టి.సి. బస్టాండులో చూసి విజయ కనిపించక పోయేసరికి బుల్లెట్ రివర్స్ చేసి రైల్వే స్టేషన్ వైపు పోనిచ్చాడు రమణ,

• • •

బుల్లెట్ ని స్టాండ్ లో పెట్టాడు రమణ. ప్లాట్ ఫాం టిక్కెట్ తీసుకుని, ప్లాట్ ఫాం

మీదికి వెళ్ళాడు. అటూ, ఇటూ చూస్తూ ప్లాట్‌ఫాం మీద తిరిగాడు. విజయ ఎక్కడా కనిపించలేదు. లేడీస్ వెయిటింగ్ హాల్ వైపు నడిచాడు. లోపల కుర్చీలో కూర్చుని వెనక్కు వాలి కళ్లు మూసుకుని ఉంది విజయ. రమణ గుండె ఆనందంతో ఉప్పొంగింది.

"విజయగారూ!" మెల్లగా పిలిచాడు రమణ.

ఉలిక్కిపడి కళ్లు తెరచింది విజయ. ఎదురుగా వాకిట రమణ నిల్చొనిఉన్నాడు. ఒక్క క్షణం ఆమె గుండె ఆగి మళ్లీ కొట్టుకోసాగింది.

"ఇలా రండి" గంభీరంగా పిలిచాడు రమణ.

మౌనంగా పైకి లేచి ఎయిర్‌బాగ్ భుజానికి తగిలించుకుంది. హేండ్‌బాగ్ చేతికి తీసుకుని వెలుపలికి వచ్చింది. ఆమె గుండె భయంతో కొట్టుకుంటోంది. రమణ తనని ఆగిపొమ్మంటాడేమో! ఇప్పుడు ఆగిపోతే మరింత అవమానాల పాలు అవుతుంది తను. ఇప్పుడెలా చెయ్యాలి?

ఆమె భయాన్ని అర్థం చేసుకున్నట్టు రమణ అన్నాడు—

"భయపడకండి! మిమ్మల్ని ఆగిపొమ్మని చెప్పేందుకు రాలేదు నేను"

"మరి ఎందుకు వచ్చారు?'' ఆశ్చర్యంగా అడిగింది విజయ.

"మీకు వీడ్కోలు ఇద్దామని. మీకు కొన్ని విషయాలు చెప్పి వెళ్దామని వచ్చాను"

"ఏమిటవి?'' అడిగింది విజయ.

"మీరు చాలా దూరం వెళ్తున్నారు. లోకం మోసగాళ్లమయం. అందుకే మీరు జాగ్రత్తగా ఉండాలనిచెప్పాలని వచ్చాను. ఈ లోకంలో మోసగాళ్లు ఎందరో ఉన్నారు. స్త్రీ దొరికితే ఆమె అందాన్ని వాడుకొని, వీలయితే ఆమె దగ్గర డబ్బు గుంజుకొని వెళ్లాలనే ఘరానా పురుషులు వున్నారు. స్త్రీకి మాయమాటలు చెప్పి ఆమెను ఆకర్షించి వ్యభిచార గృహాలకు అమ్మే తార్పుడుగాళ్లూ ఉన్నారు. ప్రేమ అనే గొప్ప పదాన్ని ఉపయోగించుకొని స్త్రీకి వలవేసి, ఆమె అందాన్ని జుర్రుకొని పారిపోయే మగవాళ్లున్నారు. వీరందరి గురించి జాగ్రత్తగా ఉండాలి. స్త్రీ, పురుషులు ఇద్దరూ ఇష్టపడి శారీరక వాంఛ తీర్చుకునేందుకు కలుసుకుంటే అది వేరు సంగతి. కానీ ఆ స్త్రీ తనకు లోబడింది అని పురుషుడు ఆమెను చులకన చేస్తే భరించలేము కదా! ఇవన్నీ మీకు చెప్పాలనే వచ్చాను" చెప్పాడు రమణ.

"అలాగేనండీ! అటువంటి వారి గురించి జాగ్రత్తగానే ఉంటాను. హెచ్చరించినందుకు థాంక్స్"

''హెచ్చరించడం కాదండి. జాగ్రత్తగా ఉండమంటున్నాను. అటువంటి వారి గురించి ఎటువంటి జాగ్రత్తలూ చెప్పలేము ఎందుకంటే లోకంలో మనిషిని నమ్మకుండా మనిషి బతకలేడు. కానీ అవతలి మనిషి గురించి అంచనావేసి, మనస్సు పరిశీలించి మెలగాలని చెబుతున్నాను"

"అలాగేనండీ" అంది విజయ.

"సరే... మీరు ఏ ట్రైన్‌కి వెళ్తారు?" అడిగాడు రమణ.

''ఇంకొక్క అయిదు నిముషాలలో మద్రాసు వైపు వెళ్లే ట్రైన్ ఉంది. అందులో వెళ్తున్నాను" చెప్పింది విజయ.

"మద్రాసులో ఉండబోతున్నారా?"

"అక్కడ ఉండను. మన ఆంధ్రాలోనే మరో ప్రాంతానికి వచ్చేస్తాను. అక్కడ

ఓ వారం రోజులు మాత్రమే ఉంటాను"

"మరి ఎక్కడికి వస్తారు?'' అడిగాడు రమణ.

"అది మీకు చెప్పను. మీకు్కూడా చెప్పనందుకు క్షమించండి'' అంది విజయ.

కాసేపు మౌనంగా చుట్టూ చూశాడు రమణ. తర్వాత అన్నాడు-

"పోనీ నాకు ఉత్తరమైనా రాస్తారా?"

''క్షమించండి రమణగారూ! చాలా కాలం వరకూ మీకు ఉత్తరం కూడా రాయను. నా ఉనికినే తెలుపను. కానీ నాకు ఏదైనా ఆపద కలిగిననాడు మిమ్మల్నే గుర్తుతెచ్చుకుంటాను'' అన్నది విజయ.

''థాంక్స్"

ఇద్దరూ నిలబడి ఉన్నారు. మద్రాసు వైపు వెళ్లే ఎక్స్‌ప్రెస్ మరో అయిదు నిముషాలలో వస్తుందన్న అనౌన్సర్ కంఠం అప్పుడే వినిపించింది. అప్పుడు చూశాడు రమణ దూరంగా వస్తున్న మోహన్‌ని. అతడి కళ్ళు మిలమిల మెరిసాయి. అతడు తన తప్పు తెలుసుకుని, విజయని పెళ్ళి చేసుకునేందుకు వస్తున్నాడు కాబోలు. విజయ కూడా అలా అతడిని చూసి ఆశ్చర్యపోయింది. అతడు వస్తున్నందుకుకాదు- తను వెళ్ళేది అతడికెలా తెలిసిందా అని.

మోహన్, విజయ రమణలను చూశాడు. అటువైపు వచ్చాడు.

"విజయా! ఏమిటి నువ్వు చెయ్యబోతున్న పని" అడిగాడు అధికారంగా.

"ఏంచేస్తున్నాను?" అడగాలని అడిగింది విజయ.

"ఎక్కడికో వెళ్ళిపోతున్నావటకదా!"

"అవును వెళ్లిపోతున్నాను"ధైర్యంగా అంది విజయ.

"నిన్ను నేను వెళ్ళిపోనివ్వను" అన్నాడు మోహన్.

"అని ఏ అధికారంతో అంటున్నావు"

"నీ మేలు కోరి చెబుతున్నాను"

"నా మేలు కోరేవాడివయితే నన్ను పెళ్ళి చేసుకోవచ్చుగా!" అడిగిందివిజయ.

కొద్దిసేపు మౌనంగా ఉండిపోయాడు మోహన్. తర్వాత అన్నాడు-

"నన్ను క్షమించు విజయా!"

"నిన్ను... నిన్ను క్షమించటమా! ఆ ప్రకాష్‌గాడు నన్ను రేప్‌చేసి వీధిపాలు చేస్తే, నువ్వు రేప్ చేయకుండానే నన్ను అవమానాలపాలు చేశావు. ఆడదాన్ని మానభంగం చేసిన నేరానికి అతడిని ఒకవేళ కోర్టు శిక్షిస్తే శిక్షించవచ్చు. కానీ పరువుభంగం, మానసిక సంఘర్షణకు గురిచేసిన నీలాంటి నమ్మకద్రోహులకు ఏ కోర్టూ శిక్ష విధించలేదు. అటువంటి నిన్ను క్షమించాలా! ఆడదంటే తన కోసమే పడివుండే అందమైన జీవమున్న బొమ్మ అనుకునే నీలాంటివాణ్ని క్షమించాలా! ఈనాటి నా స్థితికి కారణం నువ్వే. నన్ను వీధిపాలు చేసిందీ నువ్వే. నిన్ను.. నిన్నెలా నేను క్షమిస్తాను" పెద్దగా అంది విజయ.

మౌనంగా ఉన్నాడు మోహన్. రమణ ఆ మాటలలో జోక్యం చేసుకోలేదు. కాసేపు తర్వాత మోహన్ అన్నాడు.

"నువ్వు వెళ్ళిపోతే కోర్టులో కేసు కొట్టివేస్తారేమో! ప్రకాష్‌గాడు శిక్ష నుండి తప్పించుకుంటాడు"

"శభాష్! నువ్వు నన్నెందుకు ఉండమంటున్నావో అర్థమయింది. నేను వెళ్ళిపోతే నా కేసు కొట్టివెయ్యొచ్చు. ప్రకాష్‌గాడు శిక్షనుండి తప్పించుకుంటాడు. నీవనుకున్న నీపంతం నెరవేరదు. నీపంతం

నెరవేరేందుకే నన్ను ఉండిపొమ్మంటున్నావు. ఈ సమాజంలో తలవొంచుకుని బతకమంటున్నావు. అవమానాలపాలుకమ్మంటున్నావు... అంతేకదూ!"

"లేదు నిన్ను నేను ఒంటరిగా ఉండిపొమ్మనటంలేదు. నిన్ను నేను పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాను"

''మంచిది... నువ్వు నన్ను ఎందుకు పెళ్లి చేసుకోవాలనుకుంటున్నావో అర్థం చేసుకోలేనంత తెలివితక్కువదాన్ని కాదు. ప్రకాష్‌తో అన్నమాటలు నెరవేర్చుకునేందుకు నన్ను పెళ్లి చేసుకోవాలనుకుంటున్నావుకదూ" అంది విజయ.

ఆ మాటకు మోహన్‌కు కోపం వచ్చింది. తమాయించుకుని అన్నాడు-

''అలా అర్థం చేసుకోకు విజయా! నిన్ను నేను మనస్ఫూర్తిగా పెళ్ళి చేసుకోవాలనే వచ్చాను. అంతేకానీ ఎవరి కోసమో నా బతుకును బలిపెట్టాలని అనుకోవడంలేదు"

''ఇప్పుడు కూడా నీ బతుకును బలిపెట్టుకోవద్దులే. మరి ఇంతకాలం మౌనంగా ఉన్నవాడివి, ఇప్పుడుఎందుకు వచ్చావు?" అడిగింది విజయ.

దూరంగా రైలు వస్తున్న శబ్దం అయింది.

''నిన్ను పెళ్లిచేసుకోవాలనేవచ్చాను. అంతేకానీ మరే ఉద్దేశంతో కాదు. నీమీద జాలితోనే వచ్చాను"

"పోనీ అతడు పెళ్లి చేసుకుంటానంటున్నాడు. ఆగిపో విజయా!" రమణ జోక్యం చేసుకుంటూ అన్నాడు.

"మీరు కాసేపు మౌనంగా ఉండండి రమణగారూ!" అని విజయ మోహన్ వైపు తిరిగి అన్నది-

"చూడు మోహన్! నీలాంటి వాళ్ళు నా కోసం జాలిపడాల్సిన అవసరంలేదు. స్త్రీకి మగాడు విధించిన కట్టుబాట్లు అనే సంకెళ్లను తెంచుకొనే వెళ్తున్నాను. ఈ లోకంలో ఆడా మగా సమానమనీ,మగాడి దయాదాక్షిణ్యాల మీద ఆధారపడి బతకవలసిన అవసరం స్త్రీకి లేదనీ నిరూపించాలనుకుంటున్నాను. తిరగబడిన స్త్రీ ఎంతటి కార్యమైనా చెయ్యగలదని నిరూపిస్తాను. మగాడితో సరిసమానంగా బతకాలనే స్త్రీలా వెళ్తున్నాను. అలాంటి నా మీద నీలాంటి మగాళ్లు జాలిపడనవసరం లేదు. నేను నీలాంటి స్త్రీజాతి విరోధులకు, స్త్రీ శరీరాన్నే కోరుకునే బాస్టర్డ్స్‌కు లొంగదలచుకోలేదు. నీలాంటి..."

ఆవేశంగా పెద్దగా అంటున్న ఆమెను కొంతమంది విచిత్రంగా చూసి, రైలు వచ్చే హడావుడిలో మళ్ళీ వేగంగా వెళ్ళిపోతున్నారు. రైలు వచ్చేస్తోంది. రమణ విజయను వారిస్తూ అన్నాడు.

"ప్లీజ్ విజయగారూ...అతణ్ని ఏమనవద్దు. రైలు వచ్చేస్తోంది"

రైలు ఆగింది. జనం తోసుకుంటున్నారు.

"వస్తాను రమణగారూ!"

విజయ రమణ దగ్గరగా వచ్చి, అతడి చెయ్యి తన చేతిలోకి తీసుకుంది. ఆ చేతిని తన పెదవులకు తాకించి సున్నితంగా ముద్దుపెట్టుకుంది.

విజయ వెంటనే వెనుదిరిగి వేగంగా కదిలింది.

కొద్దిసేపట్లో రైలు కూతవేసి, విజయను వెంట తీసుకుని కదిలింది.

రమణ కళ్లలోనుండి రెండు కన్నీటి బొట్లు రాలిపడ్డాయి.



## వైద్యం

నేను చేసే సేల్స్ రిప్రజెంటేటివ్ ఉద్యోగంలో నెలకి 20 రోజులు టూర్లు తిరగటంతోనే సరిపోతుంది. ట్రావెలింగ్ అంటే చాలా ఇష్టం నాకు. అందుకే కోరుకుని ఈ ఉద్యోగంలో చేరాను. కాని విపరీతమైన తిరుగుడు, ఆ తిరగడంలో అనుకోకుండా ఎదురయ్యే కొన్ని ఇబ్బందులవల్ల ఇపుడు నాకు టూర్ అంటే బోర్ అనిపిస్తోంది.

అలాంటి సమయంలో నేనా పట్టణానికి టూర్ వెళ్లాల్సి వచ్చింది. అక్కడ పని ముగించుకుని బయలుదేరేరోజున వంట్లో నలతగా అన్పించింది. మామూలుగా అయితే తెల్సిన టేబ్లెట్లు ఏవో మింగి నా అనారోగ్యాన్ని నిర్లక్ష్యం చేసేవాణ్ని. కాని ఈమధ్య ఇలా తరచుగా ఈవిధమైన నలత వుంటోంది ఆరోగ్యం గురించి మరి కొంచెం శ్రద్ధ తీసుకోందే లాభంలేదన్పించింది.

ఈ పట్టణం నాకు కొత్త! ఇక్కడికి రావడం ఇదే మొదటిసారి! అంచేత డాక్టర్ కోసం వెదుక్కుంటూ వీధులమ్మట బయలుదేరాను. అలా పావుగంట తిరిగాక ఓ క్లినిక్ కనబడింది. బయట బోర్డు వుంది.

"డాక్టర్ కె. రత్నారావ్, ఎం.బి.బి.ఎస్."

రత్నారావ్ అనగానే నా మిత్రుడు గుర్తొచ్చాడు. స్కూల్ ఫైనల్ వరకూ మేం కల్సి చదువుకున్నాం. అప్పట్లో ఒకరిని విడిచి ఒకరం ఉండలేనంత స్నేహం మాది. కాలేజీ చదువుకి వేరేవేరు చోట్లకి వెళ్ళడంతో అనుకోని విధంగా మేం విడిపోయాం ఎవరికెవరమో అన్నట్లు. వాడు ఎక్కడున్నాడో కూడా తెలీదు నాకిన్నేళ్లుగా. కొంపదీసి ఈ క్లినిక్ వాడిదికాదు కదా అన్పించింది. మావాడూ డాక్టరే! కానీ వాడు చదివింది బివిఎస్‌సి–అంటే వెటర్నరీ సైన్స్, పశువైద్యశాస్త్రం. కాని ఇది మనుషులకి వైద్యంచేసే క్లినిక్‌లా వుంది! పైగా పేరు చివర ఎం.బి.బి.యస్. అని డిగ్రీ కూడా వుంది. ఇక సందేహమెందుకు? మనవాడు కాదు అనుకున్నాను.

అలా అనుకుంటూనే లోపలికి అడుగు పెట్టాను. అయితే ఆశ్చర్యం! అక్కడ





కూర్చుని వున్నది నా మిత్రుడు రత్నా రావే!!

"అరె! నువ్వా...రారా" అన్నాడు నవ్వుతూ. నన్ను చూసి వాడేమాత్రం తడబడలేదు, ఆశ్చర్యపోనూలేదు.

"నువ్వు రత్నారావువేనా?" అన్నాను నేను అయోమయంనుంచి తేరుకునే ప్రయత్నంలో.

"ఇంకా అనుమానమా? బయట బోర్డు చూడలేదూ?" అన్నాడు అదే నవ్వుతో.

"కాని నువ్వు చదివింది పశువైద్యం కదా! ఇప్పుడీవైద్యమేమిటి?" నా ఆశ్చర్యాన్ని వెల్లడించాను.

"అదా!" అని నవ్వుతూ చెప్పాడు. "నిజానికి నేను పశువుల డాక్టర్ని కావాలనే ఉద్దేశంతోనే వెటర్నరీ సైన్స్‌లో చేరాను. కాని 'జంతుహత్య మహాపాపం!' అని గౌతమబుద్ధుడు చెప్పిన సంగతి చదివాక బాధకలిగి అది మధ్యలో మానేసి ఎం.బి.బియస్.లో చేరాను"

నాకర్థమైంది. వెంటనే నా అనారోగ్యం సంగతి కూడా గుర్తొచ్చింది. ఏదో తట్టినట్టయి, "నాకో అర్జెంట్ పనుంది, మళ్ళీ కలుస్తాను" అంటూ అక్కడినుంచి ఒక్కుదుటున బయట పడ్డాను.

# బస్సు బాధితులు!

యమధర్మరాజు తన సింహాసనంపై ఆసీనుడై వున్నాడు. పక్కనే చిత్రగుప్తుడు తన చిట్టాను ముందు పెట్టుకుని సిద్ధంగా వున్నాడు. యమభటులు ఒక్కొక్కరినే కొలువులో ప్రవేశపెడుతున్నారు.

వాళ్లు ముందుగా ఓ ధనికునిలా కనిపించే ఆసామీని ప్రవేశపెట్టారు. యమధర్మరాజు అతన్ని పరిశీలించి 'ఏమిటితని వివరం?' అన్నట్టు చిత్రగుప్తునికేసి చూశాడు.

చిత్రగుప్తుడు చిట్టా తిరగేసి, "ప్రభూ! ఇతను కారులోంచి పాదం కింద పెట్టనక్కర్లేనంత ఐశ్వర్యంతో బతికాడు. అంచేత బస్సుల్లో ప్రయాణించేవాళ్ళ బాధలు ఇతనికి తెలియవు. కారులో ఒంటరిగా తిరిగేవాడేతప్ప ఎవరికీ లిఫ్ట్ ఇచ్చిన పాపానపోలేదు. అర్జెంట్ పనుండి, ఎమర్జెన్సీ అయివుండి బతిమాలుకున్న వారికి కూడా ఏనాడూ దయతల్చి లిఫ్ట్ ఇవ్వలేదు. బస్‌స్టాపుల్లో ఎందరో బస్‌ల కోసం పడిగాపులు పడుతోంటే, వాళ్లను



చూసి గర్వంగా నవ్వుకుంటూ పోయే వాడే తప్ప 'పోనీ పాపం....లిఫ్ట్ ఇద్దాం!' అనుకునేవాడు కాదు" అని చెప్పాడు.

యమధర్మరాజు మరోసారి అతనికేసి చూసి తల పంకించాడు. యమభటులు అతన్ని పక్కన నిలబెట్టి, మరో వ్యక్తిని ప్రవేశపెట్టారు.

చిత్రగుప్తుడు అతని గురించి చిట్టాలో వెదికి, ఇలా చెప్పాడు.

"ప్రభూ! ఇతనో మధ్యతరగతి కుటుంబీకుడు. పిల్లాజెల్లాతో సర్దుకునేసరికి ఆఫీసుకి బయలుదేరడం ఎప్పుడూ ఆలస్యమే అయ్యేది. ఆ టైమ్‌లో కిక్కిరిసి నడిచే బస్సులు బస్‌స్టాప్‌లో ఆగేవి కావు.స్టాపుకి 20గజాలముందుగాని, స్టాపు దాటి 20 గజాల దూరం వెళ్లాకగాని ఆగేవి. అందువల్ల ఇతను పరుగెత్తి బస్సును అందుకోలేక పోయేవాడు. ఒక వేళ అందుకున్నా గుంపు మధ్య దూరి బస్ ఎక్కలేకపోయేవాడు. దాంతో ఏనాడూ ఆఫీసుకి లేటుకాకుండా వెళ్ళేవాడు కాదు. ఆవిధంగా ఇతను ఉద్యోగ విధులను సక్రమంగా నిర్వర్తించడంలేదని యాజ మాన్యం ఇతనికి ఒక్క ఇంక్రిమెంటూ ఇవ్వలేదు. దానివల్ల ఇతనికి, బస్‌లరష్‌కు కారణమయిన ప్రయాణీకులపై విపరీత మయిన కోపం వచ్చి బస్సుకిందే పడి ఆత్మహత్య చేసుకున్నాడు."

యమభటులు అతన్ని కూడా పక్కన నిలబెట్టారు. తర్వాత ప్రవేశపెట్టినవ్యక్తిని చూసి, చిత్రగుప్తుడు చిట్టాలోకి దృష్టి సారించాడు.

అతని గురించి, "ప్రభూ! ఇతను అద్దె ఇళ్ళలో బాధలు పడలేక, సొంత ఇల్లు ఒకటి కట్టుకోవాలనే కోరిక పెంచుకుని అది తీరకుండానే మరణించాడు. ఇతను ఇల్లు కట్టేందుకవసరమయినంత డబ్బు సంపాదించలేకపోయాడు. ఇతని జీతం ఏ నెలకానెల కాణీ కూడా మిగలకుండా సంసారపోషణకి ఖర్చయిపోయేది. పాపం అతని ఉద్యోగంలో పైసంపాదనకు అవ కాశం లేదు" అని వివరించాడు.

చిత్రగుప్తుడు తన వివరణ ముగించాక యమధర్మరాజు ఆ ముగ్గురికి విధించ బోయే శిక్షలు వినడంకోసం అందరూ చెవులు రిక్కించారు.

యమధర్మరాజు గొంతు సవరించుకుని ఇలా చెప్పాడు...

"ధనికుడు కారులో లిఫ్టు ఇచ్చి కొందరు ప్రయాణీకుల్ని బస్సు ప్రయాణం బారి నుంచి ఆదుకోగలిగివుండి కూడా అలా చేసేవాడు కాదుగనక అతను తిరిగి హైదరాబాద్‌లో పుట్టి రోజూ సిటీబస్‌లో ప్రయాణించే శిక్ష విధిస్తున్నాను.

మధ్యతరగతి కుటుంబీకుడు రష్‌గా వున్న బస్‌లో ఎక్కలేకపోయేవాడు గనక ఆ కసి తీరటంకోసం అతను హైదరాబాద్ సిటీబస్సుల్లో డ్రయివరుగాచేరి దర్జాగా ప్రయాణించేట్టు చేస్తున్నాను. అలా అయితే అతను ఇతరుల్ని బస్ ఎక్కకుండా నిరోధించి, అంతకుముందు తనను ఎక్క నివ్వకుండా చేసినవారిపై ప్రతీకారం తీర్చుకుంటాడు.

మూడో వ్యక్తి సిటీబస్ కండక్టర్ అవు తాడు. అతను తన జీతంతో కుటుంబాన్ని పోషిస్తూ, పై సంపాదనతో ఇల్లు కట్టుకో గలడుగాక!"

—జాస్తి శ్రీకృష్ణ వరప్రసాద్

---

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 004.

# మీ డబ్బుకి ఇంతకంటె మంచి రక్షణ అవసరం!



ఫలానా చోట భద్రత ఉంటుందని గట్టిగా నమ్మి మీ డబ్బును అక్కడ దాస్తారు. ఆ నమ్మకం కాస్తా వమ్మయితే...! అలా జరిగే అవకాశాలు లేకపోలేదు. అందుకే - కష్టార్జితాన్ని ఎక్కడ మదుపు పెట్టాలా అన్న విషయంలో మీరు బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి రావడం చాలా ముఖ్యం.

రెండు దశాబ్దాల అనుభవం ఉన్న మార్గదర్శిలో మీరు పొదుపుచేసే మొత్తాలకు పూర్తి రక్షణ ఉంటుంది. అందరి అవసరాలకూ సరిపడే విధంగా వివిధ రకాల చిట్‌లు మార్గదర్శిలో మీ అందుబాటులో ఉన్నాయి. అంతేకాదు, మీరు పొదుపుచేసే మొ లకు ఆకర్షణీయమైన డివిడెండ్లు కూడా తోడవుతాయి.

మార్గదర్శిలోని హితులు మీ ఆశలకూ, ఆశయాలకూ ఒక అ కల్పిస్తారు. మార్గదర్శిలో పొదుపు చేస్తే ధనానికి పూర్తి ర ఉంటుందని లక్షమందికి పైగా ఇప్పటికే గ్రహించారు.

మరి మీ మాటేమిటి?

డబ్బు కోసమేనా మీ చింత – మార్గదర్శి వున్నది మీ చెంత!



**మార్గదర్శి**
చిట్‌ఫండ్ ప్రైవేటు లిమిటెడ్
మార్గదర్శి హౌస్, అబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

శాఖలు: ● అబిడ్ సెంటర్, హైదరాబాద్ ● లక్డీకాపూల్, హైదరాబాద్ ● చిక్కడపల్లి, హైదరాబాద్ ● అమీర్‌పేట, హైదరాబాద్ ● కాబ్రా కాంప్లెక్స్, ఎమ్.జి.రోడ్, సికిందరాబాద్ ● బిసెంట్ రోడ్, విజయవాడ ● బందరు రోడ్, విజయవాడ ● మెయిన్ రోడ్, గుంటూరు ● మెయిన్ రోడ్, కాకినాడ ● ఇన్నీసుపేట, రాజమండ్రి ● నెహ్రూ రోడ్, కర్నూలు ● మెయిన్ రోడ్, విశాఖపట్నం ● జె. పి. ఎన్. రోడ్, వరంగల్, ● వైరారోడ్, ఖమ్మం